The Largest Circulated Telugu Monthly

# చతుర

ఆగస్టు '96

రు. 7/-



కాశీ విశ్వనాథ్ తీగలు తెగిన సితార




# పద పండితుడు

న్యూయార్క్‌లోని 39 ఏళ్ల నైల్‌బ్రైన్స్‌కి ఓ అద్భుతశక్తి ఉంది. ఒక పదంలోని అక్షరాల్ని ఎలా తారుమారు చేసిచ్చినా క్షణాల్లో పదం ఏమిటో చెప్పేస్తాడు. ఇదొకరకం అపూర్వధారణాశక్తి. ఉదాహరణకు **DOILRATTANI** అనే అక్షరాల్ని రెండే రెండు సెకండ్లలో **TRADITIONAL**గానూ **VEACNEL** అనే అక్షరాల్ని ఓ సెకండులోనే **ENCLAVE** గానూ పేర్చేశాడు. **GUARANTEREDUD** అనే అక్షరాల్తో మీరు ప్రయత్నించి చూడండి. మనవాడు కేవలం అయిదు సెకండ్లలో దాన్ని **UNDER GRADUATE** గా సరిచేయగలిగాడు మరి.

# చతుర ప్రపంచం

## క్రీడాకారుడి అంతరంగం

ఒకప్పటి ప్రఖ్యాత ఫుట్‌బాల్ ఆటగాడు ఉర్మిలింగం కన్నన్ ఈనాడు ఫుట్‌బాల్ అంటే తనకెలాంటి ఉత్సాహమూ లేదని, ఆ ఆటలో తాను మరెవ్వరినీ ప్రోత్సహించదలుచుకోలేదనీ ప్రకటించాడు. 1960లో జరిగిన రోమ్ ఒలింపిక్స్‌లో పాల్గొని ఇండియా తరపున ఘనవిజయం సాధించిన ఉర్మిలింగం చెప్పిన ఆ మాటకి అతని అభిమానులు, మిగిలిన క్రీడాకారులు షాకయ్యారు.

కన్నన్ ఉద్దేశం ప్రకారం ఈ రోజుల్లో ఫుట్‌బాల్ ఆటగాళ్లు రెండు రకాల ఆటలను ఆడుతున్నారు. ఏదైనా క్లబ్ తరపున ఆడినప్పుడు వారు చాలా చిత్తశుద్ధితో, నిజాయితీగా చక్కని ఆట ఆడి గెలుపొందుతారు. అదే దేశం తరపున మరో దేశంతో, అంటే ప్రభుత్వం తరపున ఆడే ఆటలో శ్రద్ధ వహించకుండా, ఎలాంటి ఉత్సాహాన్ని చూపించకుండా ఆడి ఓటమి పొందుతున్నారు.

ప్రభుత్వం తరపున రాష్ట్రస్థాయిలో ఆడినా, లేక దేశస్థాయిలో ఆడినా... సరియైన ప్రోత్సాహం లేక దానియందు ఉత్సాహాన్ని కోల్పోతున్నారు. ఆ ఆట ఆడటంలేదని ఆటగాళ్లను నిందించడం పొరపాటంటోంది సర్వే.

మామూలు క్లబ్బులు... నెగ్గినవారికి, పాల్గొన్నవారికి కూడా బహుమతుల రూపంలో చాలా ధనం అందజేస్తారు. 1938 అక్టోబర్ 2న పుట్టిన కన్నన్ సికింద్రాబాద్ సౌత్ సెంట్రల్ రైల్వేలో ఉన్నత పదవిలో వుండేవాడు. 1958లో మొట్టమొదటిసారి ఇతడు టోక్యోలో ఏసియన్ గేమ్స్‌లో పాల్గొన్నాడు. తరవాత 1960లో ఇండియన్ జట్టుకి కెప్టెన్‌గా వుండి రోమ్ ఒలింపిక్స్‌లో పాల్గొన్నాడు. 1962లో అతడు రైల్వే సర్వీసులో చేరాడు. అప్పటినుంచీ అతడు అందులోనే వున్నత పదవిని పొంది రిటయిరయ్యాడు.

అయితే తనకెంతో కీర్తిప్రతిష్ఠలు తెచ్చిపెట్టిన ఫుట్‌బాల్ మ్యాచ్ అంటే కన్నన్ ఎందుకు విముఖత చూపిస్తున్నాడన్న అనుమానం చాలామందికి కలిగింది.

1975లో ఒక పెద్ద రైలుదుర్ఘటనలో కన్నన్ టీమ్‌లోని కొంతమంది ఆటగాళ్లు, ఆ టీమ్ మేనేజరు చనిపోయారు. ఆ తరువాత ఆ ఆటగాళ్ల కుటుంబాలన్నీ రోడ్డున పడ్డాయి. ఎవరూ వారిని పట్టించుకోలేదు. వెంటనే అదే పరిస్థితి తనకి కూడా వస్తే అన్నప్రశ్న కన్నన్‌ని వేధించింది. అందుకే గుర్తింపులేని, ఆదరణ లేని ఈ ఆటలు ఎలాంటి కష్టసమయంలోను ఆదుకోవని, అవి శుద్ధ దండగనీ ఓ నిర్ణయం చేసుకున్నాడు కన్నన్.

అయితే అప్పటి ఆటలకి, ఇప్పటి ఆటలకి తేడా వుందా అని అడిగిన ప్రశ్నకు సమాధానంగా కన్నన్ చెప్పినదేమంటే...

"ప్రస్తుతం ఫుట్‌బాల్ ఆటలో చాలా వ్యాపార ధోరణులు వచ్చిచేరాయి. ఆటగాళ్లు కేవలం డబ్బుకోసం ఆడుతున్నారు. మా రోజుల్లో దేశంకోసం, దేశం తరపున ఆడటమంటే అది ఎంతో గౌరవనీయమైన విషయంలా భావించేవాళ్ళం. కానీ... ప్రభుత్వం ఎప్పుడూ మా సేవలను గుర్తించలేదు. కానీ... క్లబ్బుకి, ప్రభుత్వానికి కూడా మేము








ఒకేరకమయిన ప్రాధాన్యత ఇచ్చి ఆడాము. అందుకే ఇప్పటి యువత ఎక్కువభాగం క్లబ్బుల తరపున ఆడుతున్నారు.

ఇంతకీ మీ ఫుట్‌బాల్ జీవితంలో ప్రభుత్వం నుంచి మీరు పొందిన సన్మానంలాంటిదేమైనా వుందా? అని అడిగారు వాళ్లు. "ఫుట్‌బాల్ ఆటకి పనికివచ్చే వస్తువుల కిట్ తప్ప నాకు ప్రభుత్వంనుంచి ఎలాంటి బహుమతీ అందలేదు. ఉద్యోగ విషయంలో కూడా ప్రభుత్వం ఆటగాళ్ళకు ప్రత్యేకంగా సహకరించిందేమీ లేదు. మా వర్తమానం గురించిగాని, భవిష్యత్తు గురించిగాని ప్రభుత్వమెప్పుడూ పట్టించుకోలేదు. అలాంటప్పుడు ఎవరినైనా నేను ఫుట్‌బాల్ ఆడమని ఎలా ప్రోత్సహిస్తాను. అయితే నా ఫుట్‌బాల్ జీవితం వ్యక్తిగతంగా నాకెంతో సంతృప్తినిచ్చింది. ఎందుకంటే నేను డబ్బుకోసం ఎప్పుడూ ఆడలేదు.

కన్నన్ అత్యద్భుతమైన గోల్‌గెట్టర్‌గా పేరునార్జించారు. ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన గోల్‌కీపర్ కూడా కన్నన్‌ముందు గౌరవసూచకంగా తలవంచి నమస్కరిస్తాడు ఇప్పటికీ.

"ప్రభుత్వము, ఫుట్‌బాల్ సంస్థ అధికారులు కూడా సంకుచిత మనస్తత్వాలతో వ్యవహరించడంవల్ల ఈ ఆట ఉన్నతిని ఎన్నటికీ కాంక్షించలేము'' అంటున్నారు పరిశీలకులు.

# ఆట కాదు పోరాటం

ప్రపంచం మొత్తానికి మేటి టెన్నిస్ ప్లేయర్‌గా పేరు గాంచిన మార్టినా నవ్రాతిలోవా టెన్నిస్ ఆటలో కంప్యూటర్‌ద్వారా శిక్షణ పొందిన ఏకైక మహిళ.

1986 అక్టోబర్ 15న ఫ్రాన్స్‌కు చెందిన 18 ఏళ్ళ డౌసియత్‌ను ఓడించి తన 1000వ టెన్నిస్ విజయంతో ప్రపంచ రికార్డ్ సృష్టించింది. ఆ విజయానికి ఆమెకు ఓ బంగారు టెన్నిస్ బాల్ లాకెట్‌గా కలిగిన బంగారు గొలుసు బహుమతిగా లభించింది.

ఈరోజు తానొక ధనవంతురాలైన 12 మిలియన్ డాలర్ల అమ్మాయిననీ, ధనికురాలైన ఆటగత్తెను తానేనని చెప్పుకుంటుంది నవ్రాతిలోవా. ఈ విజయపరంపరకు కారణం తాను టెన్నిస్ ఆటలో చేసిన గణనీయమైన కృషియే అంటుంది. ఆమె పుట్టింది చెకోస్లవేకియాలో కానీ ఆమె నివాసం అమెరికాలో.




నవ్రాతిలోవా తల్లి కూడా ఆట కత్తే. స్కేటింగ్‌లోనూ జిమ్నాస్టిక్స్‌లోనూ ఆవిడ ప్రవీణురాలు. ఆవిడ తల్లి అంటే నవ్రాతిలోవా అమ్మమ్మ కూడా మంచి టెన్నిస్ ప్లేయర్.

నవ్రాతిలోవా తన 14 ఏళ్ళ వయసులో ఫస్ట్ చెకోస్లవేకియా నేషనల్ ఛాంపియన్ షిప్‌కి పోటీచేసింది. ఆ తరవాత ఎన్నోసార్లు పోటీల్లో పాల్గొంది. కెనడాలో వున్న ఆమె అంకుల్ టెన్నిస్‌కు సంబంధించిన మేగజైన్స్, పేపరు కట్టింగ్‌లూ ఎప్పటికప్పుడు నవ్రాతిలోవాకు పంపుతూ ఆమెను పరోక్షంగా ప్రోత్సహించేవాడు.

బిల్లీ జీన్‌కింగ్, మార్గరెట్‌కోర్ట్, రాడ్‌లావర్ మొదలైన ఎంతోమంది ఆటగాళ్లతో ఆడినప్పుడు ఆటకు సంబంధించిన ఎన్నో అనుభూతులను పొందానంటుంది ఆమె. అప్పట్లో రోజుకు 11 డాలర్లు ఆమెకి దినసరి ఖర్చులనిచ్చింది ప్రభుత్వం. అమెరికాలో ఆటముగిశాక, తనకు కీర్తిప్రతిష్ఠలు రావాలంటే అమెరికాలోనే స్థిరపడాలనే ఆలోచన ఆమెలో కలిగింది. దాంతో స్వదేశాన్ని విడిచిపెట్టి అమెరికాలో స్థిరపడిందామె. చాలా మంది ప్రజలు ఆమె విజయరహస్యాల్ని తెలుసుకోవాలని ఉవ్విళ్లూరుతూ వుంటారు. కానీ... ఆమె తనెలాంటి ప్రత్యేక పద్ధతినీ అనుసరించడంలేదనీ తన విజయానికి వెనక రహస్యమంటూ ఏంలేదనీ అంటుందామె. కేవలం తనకున్నది ధృడమైన ఆత్మవిశ్వాసం అని ఆమె నమ్మకం. 'ఒకసారి టెన్నిస్ కోర్టులో ప్రవేశించాక దాన్ని ఓ జీవన్మరణ పోరాటంలా తీసుకుంటాను నేను' అంటుంది ఆమె. "విజయంకోసం భగవంతుణ్ణి ప్రార్థిస్తాను నేను. ఒక్కొక్కసారి తొందరగానే విజయం లభిస్తుంది. ఒక్కొక్కసారి ఎంతో కష్టపడాల్సివస్తుంది'' అంటుంది ఆమె.

ఆమెది కంప్యూటర్ శిక్షణ అనడానికి కారణాలు ఆమె నిద్రసమయాన్ని, ఆహార నియమాల్ని అన్నిటినీ కంప్యూటరే నియంత్రిస్తుంది.

ఆమెది ఆటలో ఎడమ చేతివాటం. దాంతో రైట్‌హాండ్ ప్లేయర్స్‌ని కొన్నికొన్ని షాట్స్‌లో అవుట్ చేయడం సులువు అంటుందామె. టెన్నిస్‌లో ఆమెకు సంవత్సరానికి 10 లక్షల డాలర్లు లభిస్తున్నాయని అంచనా. ఇంత డబ్బు మీరేం చేస్తారని ఎవరో అడిగితే "ఉత్సాహం చూపించే యు




వ టెన్నిస్ ఆటగాళ్లకు సహాయం చేస్తా'' నందామె. అమెరికా మొత్తంమీద వున్న టాలెంటెడ్ యంగ్ టెన్నిస్ ప్లేయర్స్‌ను పోగుచేసి వారికి తగిన ఖర్చుపెట్టి టెన్నిస్ ఆటలో ప్రోత్సాహన్నిస్తానందామె. దీనికి ఆమె ఒక ఫౌండేషన్ కూడా స్థాపించింది.

"ఎంతవరకూ ఆడగలనో అంతవరకూ ఆడి అటుపై ఫౌండేషన్ పనిని స్వయంగా చూసుకుంటా'' నంటోంది నవ్రాతిలోవా.

# ప్రపంచ వస్తుప్రదర్శన

1851 లో లండన్‌లో మొట్టమొదటిసారిగా ప్రపంచ వస్తుప్రదర్శన జరిగింది. దీనికి విక్టోరియా రాణి భర్త ప్రిన్స్ ఆల్బర్ట్ ప్రారంభోత్సవం చేశారు. 1989లో మరోసారి ప్రపంచ వస్తుప్రదర్శన పారిస్‌లో జరిగింది. అప్పుడే ఆ నగరానికి ఈఫిల్ టవర్ వచ్చింది. నగరమంతా మొదటిసారిగా విద్యుచ్ఛక్తిని అమర్చడం జరిగింది. ఫోనోగ్రామ్ వాడకం కూడా ప్రారంభమయింది. 1893లో చికాగోలో జరిగిన వరల్డ్‌ఫెయిర్‌లో మొదటిసారిగా అక్షరాలను అచ్చువేసే పద్ధతిని ప్రదర్శించారు. అప్పుడే బెల్లీ డ్యాన్స్ ప్రారంభ ప్రదర్శన కూడా ఇచ్చారు. ఆ సమయంలో భారతదేశంనుంచి వెళ్లిన స్వామీ వివేకానంద చికాగోలోని అమెరికా ప్రజలనుద్దేశించి మతపరమైన ఉపన్యాసాన్నిచ్చారు. 1904లో జరిగిన వరల్డ్‌ఫెయిర్‌లో విమానాలు, కార్లు, రేడియోలు, కోల్డ్‌టీ మొదలయినవి ప్రజలకు మొదటిసారిగా పరిచయం చేయబడ్డాయి. అప్పటినుంచే ఐస్‌క్రీమ్‌లు కూడా వాడకంలోకి వచ్చాయి.

"ది వాన్కోవర్ వరల్డ్ ఫెయిర్, ఎక్స్‌పో 86" నగర శతజయంతిని తెలియజేస్తూ ప్రారంభించబడింది. లాస్‌ఏంజెల్స్‌నుండి వాన్కోవర్‌కి విమాన ప్రయాణదూరం వెయ్యి మైళ్లు. రెండున్నర గంటల సమయం పడుతుంది ఈ ప్రయాణానికి. వాన్కోవర్ ప్రకృతి సౌందర్యానికి పుట్టినిల్లు. ఎక్కడపడితే అక్కడ రంగురంగుల కుసుమాలు కనువిందు చేస్తూవుంటాయి. వాతావరణం కూడా చాలా ఆహ్లాదంగా వుంటుంది. వరల్డ్ ఫెయిర్‌లోకి ప్రవేశిస్తే ఎన్నో దేశాల పద్ధతులు, వస్తువులు కలబోసిన సమ్మేళనం కళ్ల ఎదుట నిలుస్తుంది. వాన్కోవర్‌లో సుమారు 60 వేలమంది భారతీయులు నివశిస్తున్నారు. సుమారు 150 దేశాలు ఈ ప్రదర్శనలో పాల్గొన్నాయి. 157 మిలియన్ డాలర్లు ఈ ప్రదర్శనకోసం ఖర్చు పెట్టబడ్డాయి. 3 రోజులపాటు ఈ ప్రదర్శనను చూడటానికి ప్రవేశ రుసుము 35 అమెరికన్ డాలర్లు. అందులోనే స్కైరైడ్, స్టీమర్ రైడ్, గండోలా వగైరాలన్నీ ఉచితంగా పొందవచ్చు.



ఈ ఫెయిర్ మొత్తాన్ని ఆరు జోన్లుగా విభజించారు. పసుపు, ఆకుపచ్చ, గులాబీ, నీలం, ఎరుపు, ఊదారంగులు. ఒక్కొక్క జోను ఆయారంగుల్లో అలంకరించబడి మెరిసిపోతూ ఆకర్షణీయంగా దర్శనమిస్తాయి. చేతిలో మ్యాప్ వుంచుకుంటే ఫెయిర్‌ను చుట్టిరావడం సులభం.

సందర్శకుల్లో ఎక్కువమంది ఆంగ్లేయులు, వీరుకాక చైనీయులు, జపనీయులు, కొరియన్లు, నీగ్రోలూ కూడా తగిన సంఖ్యలో వుంటారు. చక్రాల కుర్చీ ఆధారంతో ఈ ప్రదర్శనను తిలకించడానికి వచ్చిన అంగవికలురూ అధిక సంఖ్యలోనే వున్నారు. అటువంటివారికి ప్రత్యేక సౌకర్యాలు కల్పించారు. అంటే వారికి ప్రత్యేకమైన బాత్‌రూమ్‌లు ప్రత్యేకంగా నిర్మించబడిన ఫుట్‌పాత్‌లూ వున్నాయి.

ఈ ప్రదర్శన యొక్క ముఖ్యమైన పాయింటు ట్రాన్స్‌పోర్ట్, కమ్యూనికేషన్‌లకు సంబంధించినది. వరల్డ్ ఇన్‌మోషన్, 'వరల్డ్ ఇన్ టచ్' అన్నది ఈ ఎక్స్‌పో-86 స్లోగన్. భూమికి చిహ్నంగా ఒక పెద్ద స్టీల్‌గ్లోబ్‌ను ఈ ప్రదర్శనకు మధ్యగా వుంచారు. ప్రవేశ ద్వారం వద్ద ఒక పెద్ద జెండాపోల్ వుంటుంది. ఇది ప్రపంచంలోకెల్లా పొడవైనది. కెనడాదేశంవారు ఈ జెండాపోల్‌కి తమ దేశపు జాతీయపతాకాన్ని ఎగరవేశారు. అక్కడే 200 అడుగుల హాకీస్టిక్ కూడా వేలాడదీశారు. ఇది వారి దేశంలో అతిముఖ్యమైన హాకీ ఆటను గుర్తుతెస్తుంది.

ముందుగా ఎల్లోజోన్‌కి వెడితే అక్కడి ఈజిప్షియన్ పెవిలియన్ మనల్ని 1200 బిసికి తీసుకెడుతుంది. అప్పటి పురాతన వస్తువులన్నీ కళ్లబడతాయి. జిరాక్స్ పెవిలియన్ వద్ద సాంస్కృతిక కార్యక్రమాలు ప్రదర్శించబడతాయి. జనరల్ మోటార్ పెవిలియన్ వద్ద ఆధునికమైన కార్లు, ఇంజన్లు వగైరాల ప్రదర్శన వుంటుంది. యు.ఎస్.ఎ. పెవిలియన్ మనకి, స్పేస్‌ట్రావెల్, భవిష్యత్తులో వచ్చే రవాణా సౌకర్యాలను కళ్లకు కట్టిస్తుంది.

గ్రీన్‌జోన్‌లో బ్రిటిష్ పెవిలియన్ అప్పుడే కొత్తగా వస్తున్న రోల్స్‌రాయిస్ కారును ప్రదర్శనకు పెట్టింది. కెనడియన్ పెవిలియన్‌కు వెడితే అక్కడ అతిపెద్ద తెల్లపడవ దర్శనమిస్తుంది. అక్కడివారు చూపే 5 గంటల అద్భుతమైన సినిమా చూశాక షటిల్ ట్రెయిన్ ఎక్కి మెయిన్ ఫెయిర్‌కు చేరుకోవచ్చు.

రెడ్‌జోన్‌లో జపనీస్ పెవిలియన్ ఎన్నోరకాల రవాణా సాధనాలను ప్రదర్శించారు. పింక్‌జోన్‌లో రష్యా పెవిలియన్ వుంది. స్పేస్ ట్రావెల్ గురించిన ప్రదర్శన దీని ప్రధాన ఆకర్షణ. అక్కడ అద్భుతమైన ఫ్యాషన్‌షో కూడా వుంది.

పెరూపెవిలియన్ బంగారు ఆభరణాలతో నిండి కళ్లు మిరుమిట్లు గొలిపిస్తుంది. అక్కడొక ఇండియన్ చీఫ్‌గారి మమ్మీ కూడా ప్రదర్శనకు ఉంచబడింది. స్విట్జర్లాండ్‌వారు గడియారాల తయారీలో తమ ఘనతను ప్రదర్శిస్తూ 75 అడుగుల ఎత్తుగల గడియారాన్ని ప్రదర్శనకు పెట్టారు.

బ్లూజోన్‌లో బ్రిటిష్ కొలంబియా పెవిలియన్ వుంది. ఇందులో ఒకేసారి పదివేల మంది సందర్శకులు కూచోడానికి చోటు సరిపోతుంది. రాత్రి సమయాల్లో వారు ప్రదర్శించే టపాసుల విన్యాసాలు చూసితీరవలసిందే. కేవలం ఈ ఎక్స్‌పో-86 కోసం తయారుచేయబడిన బంగారునాణెం కూడా ఇక్కడ ప్రదర్శించబడింది. దీని విలువ ఒకటిన్నర మిలియన్ డాలర్లు. ఇండియన్ పెవిలియన్‌లో ఢిల్లీకి చెందిన 'ఐవరీ ప్యాలెస్' ప్రత్యేక ఆకర్షణ. ఇందులోని ఇండియన్ హాండీక్రాఫ్ట్స్ అమ్మకాలు లెక్కకుమిక్కుటంగా వున్నాయి. దీని తరువాతి 'వరల్డ్ ఫెయిర్' 1988లో ఆస్ట్రేలియాలోని బ్రిస్బేన్‌లో నిర్వహించబడింది. ★





# ఏరిన ముత్యాలు

★ బంధువుల్ని దేవుడు ఇస్తే స్నేహితుల్ని మనమే ఎంచుకుంటాం!

-వాట్స్‌ఫోర్డ్

★ వైభవంలోకంటె దైన్యంలో వివేకం మనకు అవసరం!

-వర్డ్స్‌వర్త్

★ వివాదం ఎంతకూ తెగలేదంటే అర్థం తప్పు రెండువైపులా ఉందని!

-వాల్టేర్

★ సాధ్యమైనంతదానికంటే ఎక్కువ మంచిగా ఉండాలనుకోవడం పెద్ద పొరపాటు!

-బెగెహాట్

★ కష్టాలను ముందుగా శంకించేవాడు రెండుసార్లు వాటిని అనుభవిస్తాడు!

-పోర్టియస్

★ జీవించడం కాదు మన స్వల్ప జీవితంలో మనం ఏమి సాధించామనేది ముఖ్యం!

-నెహ్రూ

★ ఊరికే వాగకు రైలును నడిపేది దాని కూత కాదు!

-హెన్రీథాంప్సన్

★ సుఖం ఆనందం కాదని ఆకర్షణ సౌందర్యం కాదనీ గుర్తించు!

-ఠాగూర్

★ జీవితంలో అన్నిటికంటే మంచి లక్షణం ఏకాగ్రత!

-ఎమర్సన్

★ మనకు సంబంధం లేని పనులు చేయడం సోమరితనంకంటే హీనం!

-గ్రేషియన్

★ జీవితంలో దుర్వినియోగం చేసే భాగమే జీవిత భారాన్ని పెంచుతుంది!

-రూసో

★ సమర్థుడుకి అసమర్థుడు అందజేసే అభినందన ఈర్ష్య

-ప్యూపియన్స్

★ చితి మరణించిన దేహాన్ని మాత్రమే కాలుస్తుంది. కాని చింత బ్రతికున్న మనిషినే కాలుస్తుంది.

-సుభాషిత రత్నావళి

★ ఆచరణ లేని సత్య సూక్తులు విషపూరితాలుగా మారతాయి!

-నీజె

☆ నిజాయితీపరుడైన వ్యక్తి తన అంతరాత్మ అంగీకరించని పనిని చేయలేడు.

-హ్యూమ్

☆ సహజ ప్రతిభలేని చదువుకంటే చదువులేని సహజప్రతిభ గొప్పది.

-సిసిరో

సేకరణ: వాకాడ శ్రీను

# చతుర

సంపుటి : 19
సంచిక : 7
ఆగస్టు : 1996

రంగస్థలంపై తన సహజ సౌందర్యంతో, అసమాన నటనాకౌశలంతో ప్రేక్షకులను ముగ్ధులను చేసి లెక్కలేనన్ని అవార్డులు పొందిన నటీమణి ఆమె.

**అయితే... ప్రలోభాలకు లొంగని సౌశీల్యం... ఆమెకు సదా పేదరికాన్నే అందించింది.**

అయినా చెక్కుచెదరని మనోబలంతో సినిమా రంగంలో కూడా ధైర్యంగా అడుగు పెట్టబోయిందామె.

ఆ దశలో... ఆమెకది ఓ భయంకర విషవలయంలా కనిపించిన కారణాలేమిటి? ఎన్నో అవకాశాలను మొగ్గలోనే తుంచేసుకున్న ఆమె... చివరికి ఎలాంటి గమ్యానికి చేరువయ్యింది.

**నిజమైన కళాకారుల్ని నిరుత్సాహపరుస్తున్న నేటి సినిమా, నాటకరంగాల నిజస్వరూపాల్ని అక్షరీకరించిన కాశీ విశ్వనాథ్ నవల 'తీగలు తెగిన సితార' ఈ నెల 'చతుర' సమగ్ర నవల.**

కాశీ విశ్వనాథ్

# తీగలు తెగిన సితార

"షటప్"

స్టూడియో ఫ్లోర్ అదిరిపోయేట్టు అరిచాడు మనోహర్!

ఫ్లోరంతా నిశ్శబ్దం...

ఫ్లోర్‌లో వున్న డైరెక్టరు శివరాం, ప్రొడ్యూసర్ సిద్ధప్ప దగ్గర్నుంచి అందరూ వూపిరి బిగబెట్టి, రెప్పలార్పకుండా మాట పోగొట్టుకున్న మనుషుల్లా ఆ దృశ్యాన్నే చూస్తూ వుండిపోయేరు.

అది షూటింగులోని సీనూ కాదు, "షటప్" అనేది ఆ సీన్‌లోని డైలాగూ కాదు.

ఆవేశంలో కేకలు వేస్తున్నవాడు సామాన్యుడు కాదు. తెలుగు ప్రేక్షకుల్లో ఎంతో ఫాలోయింగ్ వున్న హీరో. వస్తున్న ఏడుపుని ఆపుకుంటూ, ఎవరి సమర్థింపుకి, ఎవరి ఓదార్పుకి నోచుకోకుండా, చెయ్యని నేరానికి శిక్ష అనుభవిస్తున్న నేరస్థురాల్లా మౌనంగా తలదించుకున్న వ్యక్తి... కిరణ్మయి!

తొలిసారి సెకెండ్ హీరోయిన్‌గా వేస్తున్న తార.

సినిమా రంగానికి కొత్త నటి.

నాటకరంగంలో, మహానటి.

"నేనేవిటి? మార్కెట్లో నాకున్న ఫాలోయింగ్ ఏవిటి? ఇవాళో, రేపో, మిగతా హీరోలందర్నీ తొక్కిపారేసి, నేనే నెంబర్ వన్ పొజీషన్‌కెళ్లిపోతానని ఒకపక్క మీరే అంటూ, మరోపక్క నాకు సెకెండ్ హీరోయిన్‌గా ఓ అణాకానీ జూనియర్ ఆర్టిస్టుని వేస్తారా? మీరు అన్నం తింటున్నారా? గడ్డి తింటున్నారా?"

మనోహర్ వేస్తున్న కేకలు, తిడుతున్న తిట్లు అన్నీ తమకేనని డైరెక్టర్ శివరామ్‌కీ తెలుసు. ప్రొడ్యూసర్ సిద్ధప్పకీ తెలుసు.

అయినా ఏమీ జవాబు చెప్పలేకపోతున్నారు.

డైరక్టరు మాత్రం కాస్త ధైర్యం ఎరువు తెచ్చుకుని, ఏదో చెప్పడానికి ప్రయత్నించాడు.

కానీ మనోహర్ వాళ్లూ వీళ్లూ అని చూడకుండా, షటప్ షటప్ అంటూ కేకలు వేస్తూ, రెచ్చిపోతున్నాడు.

షూటింగు ఆగిపోయింది.

ప్రొడ్యూసర్‌కి ఏమిచేయాలో తెలియక మెదడంతా మొద్దుబారిపోయింది.

సంవత్సరంపాటు మనోహర్ చుట్టూ ప్రదక్షిణలు చేసి మరీ కాల్‌షీట్స్ సంపాదించాడు.

ఇవాళ వుదయం ఎనిమిదీ పదిహేను నిమిషాలకి ముహూర్తం షాట్ తీసారు. అదీ చాలా భారీ ఎత్తున, వచ్చిన అతిథులందరికీ అయిదురకాల టిఫిన్లు పెట్టి, ఒక్కొక్కరికి పాకెట్ డైరీలు గిఫ్టులుగా పంచిపెట్టి మరీ ఓపెనింగు ఫంక్షన్ని ధాంధూం మనిపించేరు.

తర్వాత హీరోకి, ముహూర్తానికొచ్చిన పెద్దలకి దండలు వేయడం, "కంగ్రాచ్యులేషన్స్... మీ పిక్చరు డెఫినెట్‌గా సూపర్ హిట్టయిపోతుంది, శతదినోత్సవానికి ఇప్పట్నించే షీల్డులు ఆర్డరిచ్చేయండి"లాంటి కాంప్లిమెంట్లు.

"థాంక్యూ థాంక్యూ... మీ అందరి ఆశీర్వాదం వుంటే తమరు శెలవిచ్చినట్టే జరుగుతుంది..."లాంటి మర్యాదపూర్వకమైన సమాధానాలు జరిగిపోయి ఎంతోసేపు కాలేదు.

ఆ తర్వాత-

మనోహర్, కిరణ్మయిలమధ్య ఒకేఒక షాట్ జరిగింది. రెండోషాట్ ఏర్పాట్లు చేస్తుండగా, ఈ గొడవ, ఈ ఘర్షణ ఆరంభమయింది.

మనోహర్ చిత్రసీమలో మకుటంలేని మహారాజని చాలా పత్రికలు రాస్తుంటాయి.

ఎప్పుడూ మకుటంలేని మహారాజనే రాస్తారు తప్ప, మకుటంవున్న మహారాజని





ఒక్కసారీ ఎందుకు రాయరయ్యా అని జర్న లిస్టుల్ని ఎన్నోసార్లు అడగాలనుకుంటూనే, అడగకుండా నిగ్రహించుకున్నాడు. ఎందు కంటే తనకంటే, ఎక్కువ పాప్యులార్టీ సంపా దించుకున్నవాళ్లు, ఎక్కువ పారితోషికం తీసుకుంటూ, ఎక్కువ సార్లు ప్రొడ్యూసర్లని తిప్పించుకున్నవాళ్లు మరో ముగ్గురు నలు గురు హీరోలున్నారు. వాళ్లని, ఈ ఏడాది కాకపోతే వచ్చే ఏడాదైనా అధిగమించి అగ్ర స్థానంలో, నెంబర్‌వన్ పొజిషన్ కొచ్చెయ్య గలనన్న గట్టి నమ్మకంతో వున్నాడు.

అలాంటి హీరోగారి కాల్ షీట్లు సిద్ధప్పగా రికొచ్చేయి. కథని అప్పటికే రైటర్‌చేత రాయించి సిద్ధంచేశాడు.

అందులో ఇద్దరు హీరోయిన్లుంటారు.

ఒకామె భార్య, రెండో కేరక్టరు హీరోగారి మరదలు.

భార్య కేరక్టరుకి సంసారపక్షంగా కని పిస్తూ రెండు సెంటిమెంటల్ సాంగ్స్ పాడి, నాలుగు ఏడుపులు ఏడిస్తే చాలని, 'సుధా రాణి'ని బుక్ చేశారు.

కానీ మరదలు కేరక్టర్ క్లిష్టమైంది.

మోడరన్ డ్రెస్‌తో బావగారితో డ్యూయెట్లు పాడాలి. తర్వాత ప్రేమని గెలి పించుకోడానికి తపన పడాలి. మాంగల్యబం ధాన్ని, మరో ప్రేమబంధమేదీ జయించలే దని తెలిసాక, ఓ అరడజను ఏడ్పులు ఏడ్చి, ఓ రీలున్నరపాటు మానసిక సంఘర్షణ అనుభవించి మీ సంసారం మీరు చేస్కోండి, నా మట్టుకు నేను మానవసేవ చేసుకుంటానంటూ మదర్‌థెరిసాలాంటి ఓ మహాసంఘసేవకురాలి ఆశ్రమంలో చేరిపో వాలి.

ఈ పాత్రకి గట్టిగా నటించే నటీమణి కావాలి తప్ప, మెత్త మెత్తగా నటించే నటీ మణిని పెడితే, సినిమా మొత్తం మట్టి కొట్టుకు పోతుందని అందరూ ఏకగ్రీవంగా భావించి అటువంటి ఆర్టిస్టు కోసం వెదకనా రంభించారు.

చాలామంది నటీమణుల పేర్లు డిస్కష న్‌లో కొచ్చాయి. కొంతమంది డ్యూయెట్ల యితే దంచేస్తారు తప్ప, మానసిక సంఘ ర్షణ సీనుల్ని మాత్రం దంచలేరని భావిం చారు. సంఘర్షణ సీనుల్లో ప్రేక్షకుల హృద యాల్ని పెద్ద పెద్ద గోళ్లతో గిల్లేసి ఏడిపిం చగల నటీమణులున్నారుగాని, వాళ్ల మోడ రన్ డ్రెస్సుల్లో డ్యూయెట్లు పాడినప్పుడు మాత్రం, సీతాదేవిచేత చిందులేయించినట్టే వుంటుంది తప్ప, కుర్రకారుచేత వెర్రిగెం తులు వేయించే విధంగా వుండదని వాళ్ల ప్రస్తావన పక్కన పెట్టేరు.

వారంరోజుల డిస్కషన్ తర్వాత, కొత్త నటి అయినా ఫర్వాలేదు, అందంగా వుండి, అవయవసౌష్టవం వుండి పెర్ఫార్మెన్సు చేయగలిగితే చాలనే నిర్ణయానికొచ్చేరు.

అప్పుడు-

కిరణ్మయి ఆల్బమ్ వారి టేబుల్ మీదకొ చ్చింది.

ప్రొడ్యూసర్, డైరక్టర్ ఫొటోల్ని చూసి- 'బాగానే వుంది' అనుకున్నారు. కిరణ్మయిని పిలిపించి, స్వయంగా చూసేక- "బాగానే వుండడమేవిటి, బ్రహ్మాండంగా వుంటేను" అనుకున్నారు.

అయితే వాళ్లకి తుదినిర్ణయం చేసే హక్కుగాని, అధికారంగాని లేదు. ఆమెను ఓకే చెయ్యవలసింది హీరో మనోహర్‌గారే.

ఆయన దగ్గరికి ఆల్బమ్ పంపించి- "మీరు చూస్తానంటే అమ్మాయి చేత కొన్ని బిట్సు ఏక్ట్ చేయించి చూపిస్తాం" అని ఫోన్ చేసారు.

మనోహర్‌గారు ఆల్బమ్‌ని తెరచి, నాలు గంటే నాలుగే ఫొటోలు చూసాక-"ఈ అమ్మాయి వేసిన నాటకాన్ని నేనోసారి మద్రాసు కళాసాగర్ వాళ్ల వుత్సవాల్లో చూశాను. నాటకాల్లో బ్రహ్మాండంగా నటించే నటీమణుల్లో చాలామంది మనకి అక్క వేషాలకో, వదిన వేషాలకో, తల్లి వేషాలకో



పనికొస్తారు తప్ప, హీరోయిన్ వేషాలకి పనికిరారనుకునేవాణ్ణి. కానీ కిరణ్మయిని చూసాక నా అభిప్రాయం తప్పని తెల్సుకున్నాను. అమ్మాయి వయసులో వుంది. ఆ వయసు కూడా చాలా సొగసుగా వుంది. ఇంక పెర్ఫార్మెన్స్ అంటారా? సింప్లీసూపర్బ్! మనం లక్షలకి లక్షలు తగలెట్టి హిందీనించి, చంబల్ లోయల్లోనించి అమ్మాయిల్ని తెచ్చి నానాతంటాలు పడుతున్నాం. మన రాష్ట్రంలోఇంత గొప్ప టాలెంటు వుందని మీరిప్పటికైనా తెల్సుకున్నందుకు మిమ్మల్ని కంగ్రాచ్యులేట్ చేస్తున్నాను. ఆ అమ్మాయికి టెష్టులు పెట్టడమంటే మనల్ని మనం కించపరుచుకున్నట్టే. ఆ వేషానికి వెంటనే ఫిక్స్ చేసెయ్యండి" అంటూ తన అంగీకారాన్ని తెలియజేశాడు.

ఇందాక జరిగిన ముహూర్తం షాట్ కూడా, మనోహర్, కిరణ్మయిల మీదే జరిగింది.

"పాపం, పుణ్యం అంటూ వేరు వేరుగా లేవు లీలా... ఒకరికి ఉపకారం చెయ్యడం పుణ్యం, అపకారం చెయ్యడం పాపం. అపకారిక్కూడా ఉపకారం చేసేవాళ్ల మాన్యులు మహానుభావులు అయితే, ఉపకారం చేసే వాళ్లక్కూడా అపకారం చేసేవాళ్ళు నీచులు, అధములు అవుతారు"

ఇదీ ముహూర్తం షాట్! "ఈ నాలుగు లైన్ల డైలాగుని ఫస్ట్ టేక్‌లోనే ఒకే చేయడం, నటుడిగా మీరు ఎంతో ఎదిగిపోయేరని చెప్పడానికి నిదర్శనం" అంటూ కొంతమంది పొగిడారు. మరికొంతమందయితే, అంత కోలాహలం, హడావిడిలోను అసోసియేట్ డైరెక్టర్ సుధీర్ యిలా సీన్ పేపరు చూసి డైలాగ్ చెప్పగానే, అలా గుర్తుంచుకుని చెప్పడం ఒక్క మనోహర్‌కే చెల్లిందని పొగిడారు. కానీ ఈ డైలాగ్ పేపర్ని నాలుగురోజుల క్రితమే అసోసియేట్ డైరెక్టరు హీరోగారికిచ్చేస్తే, ఆయన కంఠతా పట్టేడన్న

విషయం డైరెక్టరుకి తప్ప మరెవరికీ తెలీదు.

కిరణ్మయికిచ్చిందీ పెద్ద డైలాగే! అది కూడా అప్పటికప్పుడే ఇచ్చేరు. అయినా అక్షరం తప్పు లేకుండా చక్కటి మాడ్యులేషన్తో చెప్పింది. మనోహర్ ఆమెను అభినందించాడు. ప్రెస్‌మీట్ జరిగినప్పుడు కిరణ్మయిలోని టాలెంట్‌ని తానే మొదటిసారిగా కనిపెట్టి ఈ నిర్మాత, దర్శకులకి చెప్పి, వాళ్లని ఒప్పించి, ఈ సినిమాలో ఆమెకు సెకండ్ హీరోయిన్ అవకాశం ఇప్పించానని చెప్పాడు.

అందరూ హర్షధ్వానాలు చేశారు. కానీ నిర్మాత దర్శకుల ముఖాలు మాడిపోయాయి. ముఖ్యంగా అసోసియేట్ డైరక్టరు సుధీర్ హీరోగారి మాటలు విని శుష్కమందహాసం చేశాడు! అయినా ఫిలిమ్ జర్నలిస్టులు వాళ్లెవరి ముఖాలు, వాటి వెనక ఫీలింగ్సుని చూడకుండా హీరోగారు చెప్పిందే గబగబ రాసుకున్నారు.

ఓ జర్నలిస్టు అడిగాడు. "మీరింతవరకు పాప్యులర్ హీరోయిన్లతోనే నటించారు. కానీ ఇప్పుడు మీరో కొత్త హీరోయిన్‌తో నటించడానికి ఎందుకు ఒప్పుకున్నారు? "

మనోహర్ బుగ్గమీద చెయ్యి పెట్టుకుని, శూన్యంలోకి చూస్తూ ఏదో జటిలమయిన ప్రశ్నకి జవాబు ఆలోచిస్తున్నట్టుగా పోజు పెట్టి ఒకటి రెండు నిమిషాలపాటు అలాగే వుండిపోయేడు. అది తాము ఫొటో తీయడానికిచ్చిన పోజేనని గ్రహించిన ఫొటోగ్రాఫర్లు, క్లిక్ క్లిక్‌మంటూ ఫొటోలు తీశారు.

తర్వాత మనోహర్ శాంత గంభీరస్వరంతో సమాధానం చెప్పేడు. "మానవులంతా భూమ్మీదే నడుస్తారు. కానీ, అందులో కొందరే భూమిని తవ్వి బంగారాన్ని, వజ్రాల్ని బయటికి తీయడానికి ప్రయత్నిస్తారు. ఒకవిధంగా నేను అలాంటి

వాణ్ణేననుకోండి. కొత్త టాలెంటు ఎక్కడుందో నిరంతరం వెదికే అన్వేషిని! ఇలాంటి నటవజ్రాల్ని నాటకరంగమనే మట్టినించి బయటికిలాగి, సినిమారంగం అనే కిరీటంలో పొదగడం నాకో సరదా అనండి. నా సంస్కారం అనండి... మరేదైనా అనండి, దానికేం పేరు పెట్టినా మాకు అభ్యంతరం లేదు..."

ఈ మాటలకి జర్నలిస్టులు చప్పట్లు కొట్టేవారో లేదోగాని, మనోహర్‌గారి పెర్సనల్ మేకప్‌మేన్ దడదడమంటూ చప్పట్లు కొట్టేసరికి, అక్కడున్నవారు కూడా చప్పట్లు కొట్టక తప్పింది కాదు.

ఓ ప్రముఖ సినిమా పత్రిక జర్నలిస్టు, తన కుర్చీని మరికొంచెం ముందుకు లాక్కుని- "మీరు చెప్పిన డైలాగ్‌నిబట్టి చూస్తుంటే, త్వరలో మీ పిక్చర్స్‌కి మీరే డైలాగులు రాసుకునేటట్టు కనిపిస్తున్నారే" అన్నాడు నవ్వుతూ.

దానికి మనోహర్ గలగలమంటూ నవ్వేసి, "నేను డైలాగులు రాయాలంటే ఈ పిక్చర్‌కే రాయగలను. కానీ రాయను. రాసి ఓ డైలాగ్ రైటరు కడుపు కొట్టడం నా కిష్టం లేదు. అయినా, మీకో విషయం తెలుసో తెలీదో... నా పిక్చర్స్ వరకూ మాత్రమే చెప్తున్నాను సుమండీ! పాపం మా డైలాగ్ రైటర్స్ ఏవేవో రాస్తుంటారు. కానీ, నేనే హీరోగా నాకున్న అనుభవంతో వాటిని తిరగరాయడమో, వాటిని పాలీష్‌చేసి బెటర్‌మెంట్ చెయ్యడమో చేస్తుంటాను. అయినా, ఈ విషయాన్ని నేనెక్కడా పబ్లిసిటీ చేస్కోననుకోండి" అన్నాడు.

జర్నలిస్టులు చకచకా రాసేసుకుంటున్నారు. డైరక్టరు శివరాం ఓసారి అసోసియేట్ డైరక్టరు సుధీర్‌వైపు జాలిగా చూశాడు. అతను చిన్నగా నవ్వి ఊరుకున్నాడు. నిజానికి ఈ ప్రెస్‌మీట్‌లో జర్నలిస్టులచేత ఈ ప్రశ్నలు అడిగించమని చెప్పిందీ మనోహరే. ఆ ప్రశ్నలకి తను చెప్పిన జవాబుల్ని చక్కగా రాయమని చెప్పిందీ ఆయనే! సుధీర్ రంగస్థలంమీద నటుడిగా, రచయితగా, దర్శకుడిగా అపారమైన కృషిచేసి, సినిమారంగానికొచ్చినవాడే! ఇక్కడకొచ్చాక తనలోని నటుడికి, రచయితకీ తాత్కాలికంగా శెలవిచ్చి, ఒక్క దర్శకత్వపు శాఖలోనే పనిచేస్తున్నాడు.

జర్నలిస్టులు ఇప్పుడు కిరణ్మయిని ఇంటర్వ్యూ చేస్తూ, "మొదటి పిక్చర్‌లోనే ఇంత పెద్ద హీరోతో నటిస్తున్నందుకు మీరెలా ఫీలవుతున్నారు? " అని అడిగారు.

"రంగస్థల నటిగా నేను ఏ స్థాయికి ఎదిగానో నాకైతే తెలీదుగాని, నాకున్న ఆ కాస్త పాటి అర్హత నాకింత అదృష్టాన్ని కలిగిస్తున్నందుకు ఆ భగవంతుడికి, నాకీ అవకాశం కల్పించిన వారందరికీ నా హృదయపూర్వక కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను" కిరణ్మయి ముక్తసరిగా జవాబు చెప్పి వూరుకుంది.

ముహూర్తం షాట్ అంతకుముందే అయిపోయింది కాబట్టి ఓపెనింగు ఫంక్షనుకొచ్చిన పెద్దలు, అతిథులు వెళ్లిపోయారు. జర్నలిస్టులందర్నీ మధ్యాహ్నం భోజనాలు చేసి వెళ్ళమని సిద్ధప్ప చెప్పడం వల్ల, వారు మాత్రం వుండిపోయారు.

తర్వాత కిరణ్మయి, మనోహర్‌లతో మరో షాట్ తీశారు. అది గూడా కిరణ్మయి ఒక్క టేక్‌లోనే బాగా చేయడంతో, మనోహర్ ఆమెను మరింత అభినందిస్తూ "నో డౌట్, నువ్వీ ఇండస్ట్రీని దున్నేయడం ఖాయం. కావాలంటే ఇవాళే నీకు కాగితం రాసిస్తాను" అన్నాడు.

మూడో షాట్‌కి, సెట్లో లైటింగు ఏర్పాటు చెయ్యడానికో పావుగంట పడుతుందని డైరెక్టరు చెప్తే, కాస్సేపు రిలాక్స్ అవడానికి తన మేకప్‌రూమ్‌లోకి వెళ్ళి, మేకప్ చైర్‌మీద కూర్చుని సిగరెట్ వెలిగించాడు.

అదే సమయంలో-

జూనియర్ ఆర్టిస్ట్ సప్లయర్ అచ్చిరాజు





వచ్చేడు. రావడం కూడా ఉత్త చేతుల్తో రాలేదు. ఓ పెద్ద పూలదండ పట్టుకొచ్చేడు. అతన్తోపాటు జూనియర్ ఆర్టిస్ట్స్ అసోసియే షన్‌కి చెందిన మరో నలుగురైదుగురు ఆడా మగా వచ్చేరు. అచ్చిరాజు మనోహర్ మెడలో దండవేశాక, నేలమీదకి ఒంగి, అత నికి సాష్టాంగ నమస్కారం చేశాడు. ఈ హంగామా అంతా ఎందుకు చేస్తున్నారో మనోహర్‌కి అర్థంకాలేదు.

"ఏమిటి అచ్చిరాజూ ఇదంతా? " అన్నాడు మనోహర్.

"మరేంలేదు సార్! ఇది నేనొక్కణ్ణే వేసిన దండ కాదు. మా జూనియర్ ఆర్టిస్టులం దరం వేసిన దండ"

"నేను మీకేం చేసేనని నాకీ దండవేశా రయ్యా? " అన్నాడు దండవైపు ప్రేమగా చూస్తూనే.

"ఎంతో మేలుచేసి కూడా, మీకేం చేశా నయ్యా అని అడుగుతున్నారంటే, అదే మీ గొప్పతనం" అని మరో జూనియర్ ఆర్టిస్టు అన్నాడు వినయంగా.

"ఈ డైలాగులు మానేసి అసలు విషయం చెప్పండి" అన్నాక అచ్చిరాజు మరింత వినయంగా చెప్పేడు, "సార్... ఇక్కడ కానివ్వండి, మెద్రాసులో కానివ్వండి, గత ఇరవైరెండు సంవత్సరాలుగా జూని యర్ ఆర్టిస్టుగా పనిచేస్తున్నాను"

"వూఁ చేస్తే? "

"ఎన్నోవందలు, వేలమంది జూనియర్ ఆర్టిస్టుల్ని ఇండస్ట్రీకి సప్లయ్ చేశాను. అందులో గ్లామరూ గ్లీమరూ దిట్టంగా వున్న మ్మాయిల్ని హీరోయిన్‌లుగా చెయ్యాలని కూడా చాలా తంటాలు పడ్డాను. అయినా నావల్ల అయింది కాదు. కానీ మేం అడ క్కుండానే మా జూనియర్ ఆర్టిస్టుని తమరు సెకండ్ హీరోయిన్‌గా పెట్టడానికి ఒప్పుకున్నారు"

మనోహర్ ముఖం కాస్త బిగుసుకుంది. "ఎవరా జూనియర్ ఆర్టిస్టు? "

అతను అడిగిన ప్రశ్నకు జవాబు చెప్ప కుండా, అచ్చిరాజు తన సొంత గొడవ చెప్పు కుంటున్నాడు.

"ముత్తాలమ్మ అని మరో జూనియర్ ఆర్టిస్టు సప్లయర్ వుందిగదండీ.. దొంగ ముండ! అందం చందం వున్న ఆడోళ్ళంతా తన గ్రూపులోనే వున్నారని, నా దగ్గరున్నో ళ్ళంతా ముసిలీ ముతకేనని మా చెడ్డ విర్ర వీగుతున్నాదండి. తమరు కిరణ్మయిని సెకెండ్ హీరోయిన్‌గా చెయ్యడంవల్ల ఆ అమ్మాయి దశా తిరిగిపోయింది. నా గ్రూపుకి పేరూ పెరిగిపోయింది. ఆ ముత్తా లమ్మకి కొమ్ములూ విరిగిపోనాయి..."

అచ్చిరాజు మాటల్ని ఒక్క చేతి సౌంజ్ఞతో ఆపుచేసి- "కిరణ్మయి జూనియర్ ఆర్టిస్టా? " అని సీరియస్‌గా అడిగాడు మనోహర్.

"ఔన్ సార్! తమరు ఏక్షన్ చేసిన సిని మాల్లో నటించే ఛాన్సుంటే దానికి రాలేదు గాని, బయట పిక్చర్లు అయిదారుదాకా చేసిందండి. మొన్నామధ్య ఓ పోలీసోళ్ళ సినిమా సూపర్‌హిట్టయింది చూడండి. అందులో పోలీసోళ్లు ఓ బ్రోతల్ హౌసు మీద రైడింగ్‌చేసి ఆరుగురు అమ్మాయిల్ని, తంతూ, ఈడుస్తూ, కుక్కలబండిలోకి కుక్కల్ని విసిరేసినట్టు విసిరేస్తారు. అందులో ఒకమ్మాయి మాత్రం పోలీసుల్ని ఎదిరించి నాలుగు లైన్లు డైలాగు చెప్తే ఇన స్పెక్టరు దాన్ని బూటుకాలితో తంతాడు... ఆ డైలాగులు చెప్పి, ఇనస్పెక్టరుచేత తన్నిం చుకున్న అమ్మాయి ఎవరనుకున్నారు? మా కిరణ్మయే..."

అచ్చిరాజు చెంపచెళ్ళు మనడం, అతని మాటలు ఆగిపోవడం, మనోహర్ మెడలోని దండని తెంచేసి నేలకొట్టడం ఒకేసారి జరి గిపోయాయి.

ఆరోజు కిరణ్మయి గురించి ఘర్షణ జరగ డానికదీ కారణం!

డైరెక్టరు, ప్రొడ్యూసరూ మనోహర్‌ని




# 'సిక్' శిల్పం

రెబెల్క్ హాక్స అనే ఆవిడ హాస్పిటల్ మంచాలతో రూపొందించిన 'శిల్పం' ఇది. లండన్‌లోని సుప్రసిద్ధమైన 'టేటే' గ్యాలరీలో దీన్ని ప్రథర్శిస్తే, కొంటాం అంటూ కొందరు అడిగారు గానీ అమ్మలేదట!



కన్విన్స్ చెయ్యడానికి ఎంత ప్రయత్నించినా ఫలితం దక్కలేదు. అతను శాంతించినా, ఫలితం దక్కలేదు. అతను శాంతించలేదు.

"నాకు మీరెంత డబ్బు యిస్తున్నారు? ఏవరేజ్‌న రోజుకి లక్ష రూపాయలు పడు తోంది. అలాంటి నా పక్కన మీరు సెకండ్ హీరోయిన్‌గా ఎవర్ని ఫిక్సు చేశారు? రోజంతా పనిచేస్తే అయిదువందలు పారితో షికం కూడా పొందని ఓ అణాకాణీ జూని యర్ ఆర్టిస్టుని బుక్ చేశారు. అలా నన్ను అవమానించడానికి మీకెంత ధైర్యం? పోనీ కదాని, మీ పిక్చర్‌కి నేను కాంప్రమైజ్ అయితే, రేపట్నించి నా మిగతా ప్రొడ్యూ సర్లు కూడా ఎవరో దారినపోయే దేవమ్మని తీసుకొచ్చి నా పక్కన హీరోయిన్‌గా తగలె డతారు..."

మనోహర్‌ని మధ్యలో ఆపే ధైర్యం ఎవ రికీ లేదు కనక, క్షణక్షణానికీ రెచ్చిపోతు న్నాడు. అక్కడంతమంది వున్నా ఎవరూ అతనికి ఎదురుచెప్పడంలేదు. కొంతమంది, మనకెందుకొచ్చిన గొడవని మౌనం వహిస్తే మరికొందరు అతని మెహర్బానీ పొందడం కోసం "ఔనుకదా, నిజమేకదా"లాంటి పొడి పొడి డైలాగుల్ని అందిస్తూ అతని ఆవేశాన్ని మరింత పెంచుతున్నారు.

అక్కడ వీళ్లుగాక, లంచ్‌చేసి వెళ్దామను కున్న జర్నలిస్టులు కూడా ఉన్నారు. గంట క్రితానికీ, ఇప్పటికీ వాతావరణంలో ఇంత తేడా వస్తుందని వూహించకపోవడంవల్ల వాళ్లంతా అయోమయంలో పడ్డారు. ఎవరూ అడ్డు చెప్పకపోవడంవల్ల మనోహర్ మరీ రెచ్చిపోయి మాట్లాడుతున్నాడు. జర్న లిస్టుల్లో సీనియరు, నిర్మొహమాటస్థుడైన రాజ్‌కిరణ్ మాత్రం సాహసం చేసి ప్రశ్నిం చాడు.

"క్షమించాలి సార్! కిరణ్మయి జూనియర్ ఆర్టిస్టుగా నాలుగైదు సినిమాల్లో నటించే వుండొచ్చు కానీ ఇందాక మీరు ప్రెస్‌మీ ట్‌లో మట్టిలో వున్న మాణిక్యాన్ని కనిపెట్టి, సినీరంగం అనే మకుటంలో చేర్చడమే నా బాధ్యత అని అన్నారుగా..."

మనోహర్ అతనివైపు గుర్రుగా చూసి, జవాబు కోసం నాలుగైదు క్షణాలపాటు తడుముకుని- "మీరు నా మాటల్ని సరిగా అర్థం చేస్కోకుండా మాట్లాడకండి. మట్టిలో వుండే మాణిక్యాల్ని,వజ్రాల్ని బైటకి తీసుకొ స్తానన్నానుగాని, మట్టిలో వుండే ప్రతీ గుల కరాయికీ, ఓ స్థానం కల్పిస్తానని అనలేదే" అన్నాడు.

"మీ దృష్టిలో జూనియర్ ఆర్టిస్టులంటే గులకరాళ్లా?"

"కిరణ్మయి ఓ సినిమాలో బ్రోతలమ్మాయి వేషం వేసిందని, వాళ్ల సప్లయరే చెప్పాడు. అలాంటిదాన్ని నా పక్కన హీరోయిన్‌గా వేస్తానంటున్నారు. పదిమంది బ్రోతల్సులో ఓ బ్రోతల్ వేసిన అమ్మాయిని గులకరాయి అనకుండా జాతిరత్నమంటారా?"

రాజ్‌కిరణ్ ఇంకా ఏదో అనబోతుంటే మనోహర్ కుర్చీలో నించి లేచిపోయి, ప్రొడ్యూసర్ని, డైరక్టర్ని పిలిచాడు. "ఈ పంచాయితీలో వీళ్ల వేసే ప్రశ్నలకి జవా బులు చెప్పవలసిన అవసరం నాకు లేదు. నాకు నా కెరియర్ ముఖ్యం. మీ పిక్చరు బిజినెస్ కావడానికి నేను ముఖ్యం! అలాంటి నేను చెప్తున్నాను. కిరణ్మయి ఈ సినిమాలో సెకండ్ హీరోయిన్‌గానే కాదు, ఏ వేషం లోనూ వుండకూడదు. చివరికి జూనియర్ ఆర్టిస్టు వేషంలో వున్నా నేనొప్పుకోను. మరో అమ్మాయిని చూడండి. తెలుగు భాష రాక పోయినా, పెర్ఫార్మెన్స్ పూర్‌గా వున్నా ఫర్వాలేదు. నేను మేనేజ్ చేసుకుంటాను. నా కాల్‌షీట్సు వేస్ట్ కాకుండా రేపట్నించి, ఆ కేరక్టరు లేని వేరే సీన్లు ప్లాన్ చేస్కోండి. ఇవాళ జరిగిన ముహూర్తం షాట్ గురించి గాని, ఈ గొడవ గురించిగాని ఏ న్యూసూ, ఏ పేపర్లోనూ రాకుండా చూడండి" అంటూ గబగబా తన కారు ఎక్కి వెళ్లిపోయాడు.



జర్నలిస్టుల్లో రాజ్‌కిరణ్, మరో ఇద్దరు ముగ్గురు ఏడుస్తున్న కిరణ్మయి దగ్గరకొచ్చి సానుభూతి ప్రకటించడంతోపాటు, గతంలో ఇలాగే తిరస్కరించబడ్డ కొందరు నటీమణులు తర్వాత్తర్వాత ఎలా తారాపథం చేరుకుని చరిత్ర సృష్టించారో వివరించి చెప్పి ఆమెకు ధైర్యం చెప్పేరు. అయినా ఆ ధైర్య వచనాలు ఆమె చెవులకే తప్ప, దుఃఖంతో నిండిన ఆమె హృదయానికి వినిపించలేదు. కిరణ్మయిని ఏంచేద్దామన్నది, ఇటు డైరక్టరుకీ సమస్య కాలేదు, అటు ప్రొడ్యూసరుకీ సమస్య కాలేదు. ఏం చెయ్యాలన్నది మనోహర్ చెప్పి వెళ్ళిపోయాడు. పైగా డైరక్టరు శివరాం హీరో మనోహర్ రికమెండేషన్ మీద ఆ పిక్చర్‌కి డైరక్టరుగా, నియమితుడైన వ్యక్తి! ప్రొడ్యూసర్ సిద్ధప్ప ఓ ఏడాదిపాటు మనోహర్ చుట్టూ ప్రదక్షిణలు చేసి అతని కాల్‌షీట్లు సంపాదించుకున్నాడు. హీరోని ఎదిరించడానికి ఇద్దరూ నిస్సహాయులే!

"ఇప్పుడు కిరణ్మయికి ఎంతిచ్చి పంపించాలి? " ఇదొక్కటే సిద్ధప్పని రెండు క్షణాలపాటు ఆలోచింపచేసిన ప్రశ్న! ఆమెకు కొత్తగా ఛాన్సు ఇవ్వడం కాబట్టి, ఎంత కావాలీ? అని తనూ అడగలేదు. ఇంతివ్వండీ అని ఆమే చెప్పలేదు. హీరోగారే ఆమెను తీసెయ్యమన్నాడు కాబట్టి, ఆమెకు ఒక్క రూపాయి ఇవ్వకుండా పంపించినా తనని అడిగేవాడుండడు! అతని ఆలోచన కనిపెట్టి, శివరాం మాత్రం "అలా చెయ్యడం మరీ అన్యాయం. కనీసం ఓ రెండువేల అయిదువందలయినా ఇచ్చి పంపించండి" అన్నాడు. సిద్ధప్ప ఓ కవర్లో రెండువేల అయిదువందలు పెట్టి, ప్రొడక్షన్ మేనేజరు చేత కిరణ్మయికి పంపించాడు. కవరు తీసుకువెళ్తున్న మేనేజరుతో- "ఆ అమ్మాయినెలా పంపిస్తాం? మన ప్రొడక్షన్ కారులో పంపించు" అన్నాడు శివరాం.

"అలాగే" అంటూ వెళ్లబోతున్న మేనేజర్ని సిద్ధప్ప ఆపి "అసలే హీరోగారు మనమీద మంటెక్కిపోయున్నాడు. ఇప్పుడా అమ్మాయిని కంపెనీ కారులో పంపిస్తే మనల్నెన్ని తిడతాడో! ఇవాళంటే షూటింగు కాబట్టి యింటికి కారు పంపించి తెప్పించాం. కానీ నిన్నటిదాకా ఆవిడకి బస్సులో తిరగడం అలవాటేగా! బస్సులో వెళ్ళిపోమను" అంటూ జేబులోనించి అయిదు రూపాయల నోటు తీసి అందించాడు.

ఎంతయినా శివరాం, టెక్నీషియన్! కింద లెవెల్‌నించి పైకొచ్చినవాడు గాబట్టి ప్రొడ్యూసర్ మాటల్తో ఏకీభవించలేకపోయేడు. హీరోగారు ఇవాళీ గొడవంటూ పెట్టకపోతే, కిరణ్మయి యీ పిక్చర్లో సెకెండ్ హీరోయిన్ వేషం వెయ్యాల్సిన నటి! తన జేబులోనించి యాభై రూపాయల నోటుతీసి మేనేజరుకిచ్చి "ఆటోలో వెళ్లమని చెప్పు" అన్నాడు.

కిరణ్మయి సెట్లో ఓ మూల కూర్చుని ఏడుస్తోంది! ప్రొడక్షన్ మేనేజరు అందించిన డబ్బు తీస్కోవాలో, మానాలోనని ఆమె ఆలోచించలేదు. ఆ డబ్బు అక్కర్లేదని చెప్పినా తన ఆత్మాభిమానాన్ని గుర్తించేవాడెవడూ లేడక్కడ! కానీ, యీ డబ్బు చేతిలో వుంటే, దాంతో చెయ్యాల్సిన పనులు చాలా వున్నాయి. "దయచేసి నాకో ఆటో తెప్పించే ఏర్పాటు చెయ్యండి" అంది మేనేజరుతో.

అతను ఔననిగాని, కాదనిగాని చెప్పకుండా అక్కడనించి వెళ్లిపోయేడు.

కిరణ్మయి మెల్లగా మేకప్ రూముకెళ్లి షూటింగ్‌డ్రెస్ విప్పేసి, తన బట్టలు వేసుకుంది. ముఖానికున్న మేకప్ తుడుచుకోడానికి కొబ్బరి నూనె సీసా అందించాడు మేకప్‌మేన్! కానీ మేకప్ తుడుచుకుని, మళ్లీ సబ్బుతో ముఖం కడుక్కునే ఓపిక లేనట్టనిపించి 'వద్దులే' అంటూ వెళ్లబోయి ఆగి - "సుధీర్ గారొచ్చేరా? " అంది.

"లేదండి, లొకేషన్లు చూడ్డానికెళ్లేరుగదా!" అన్నాడు. ఆమెకు అప్పుడు గుర్తొచ్చింది.





ప్రెస్‌మీట్ అయిపోగానే సుధీర్ ఆర్ట్‌డైరెక్టర్ పరమశివాన్ని తీసుకుని రేపు షూటింగు చేయబోయే లొకేషన్లు చూడ్డానికి వెళ్తాన న్నాడు. ఇక్కడ తనకంటూ వున్న ఆత్మీయుడు, యీ వేషం రావడానికి కారకుడు ఒక్క సుధీరే!

మేకప్ రూమ్‌నించి బయటకొచ్చింది. అక్కడ ఆటోలేదు! ఇందాక ప్రొడక్షన్ మేనేజరు చూపించిన నిర్లక్ష్యాన్నిబట్టే అతను ఆటో తీసుకురాడని గ్రహించింది. హేండ్ బేగ్ పట్టుకుని మెల్లగా నడుస్తూ స్టూడియో నించి బయటపడింది. ఓ నూటయాభై గజాలు నడిచి రోడ్డుమీదకొచ్చింది. ఎండ ఫెళ్లుమంటోంది. పది నిమిషాలు వెయిట్ చేస్తే తప్ప ఆటో దొరకలేదు. తను ఎక్కడికెళ్లాలో చెప్పి ఆటోలో నిస్సత్తువగా కూలబడింది. "మీటరు మీద రూపాయికి పది పైసలు ఎగస్త్రా అవుద్ది, పెట్రోలు ధర మళ్లీ పెంచేశారు" అంటూ ఆటో డ్రైవరు ఏదో ఏదో చెప్తున్నా ఆ మాటలేవీ ఆమెకు వినబడ్డంలేదు.

ఆటో ముందుకు పరుగెడుతోంది. కిరణ్మయి మనసు అటు వూగి, యిటు వూగి, చివరికామె అధీనం తప్పి గతంలోకి పరుగులు తీసింది.



ఏడెనిమిదేళ్లక్రితం-

నెల్లూరులో రసరంజని కళాక్షేత్ర వారు అఖిలభారతస్థాయిలో నిర్వహించిన నాటక పరిషత్తు... బహుమతీ ప్రదాన కార్యక్రమం ఆరంభం కాబోతోంది. పది రోజులపాటు నిర్వహించిన నాటికలు, నాటకాలు, ఏకపాత్రాభినయాలు... యివన్నీ కాక, ఎక్కడా ఏ పరిషత్తులోనూ జరగని ఓ అద్భుతమైన పోటీ జరిగింది.

దాంట్లో విజేతలెవరు?

క్రిక్కిరిసిన థియేటర్లో కూర్చున్న ప్రతీ కళాకారుడి వుత్కంఠ అదే! పోటీల్లో పాల్గొన్న ప్రతీ కళాకారుడు ప్రతీ కళాకారిణి ఆ ఫలితాల కోసమే ఎదురు చూస్తున్నారు.

కళాక్షేత్ర కార్యదర్శి, ఓ సీల్డ్ కవరు పట్టుకుని వేదిక మీదకి రావడంతో హాలంతా నిశ్శబ్దమయింది.

మైకుని రెండుసార్లు వూది, టెస్టు చేశాక సరుగుడు కర్రకి సఫారీ స్టూటు వేసినట్టుగా కనిపిస్తున్న ఆ కార్యదర్శి ఓసారి కళ్లజోడు సవరించుకుని చెప్పనారంభించాడు.

"మీరు గత పదిరోజుల్నించి చాలా నాటకాలు, నాటికలూ చూశారు. అందులో పాల్గొన్న నటులు కానివ్వండి, నటీమణులు కానివ్వండి ఆషామాషీ ఆర్టిస్టులేంకారు. ఎవరికి వారే వుద్దండపిండాలు. ఇరవై నాలుగు నాటికలు, పదహారు నాటకాలు యిదే వేదిక మీద ప్రదర్శించబడ్డాయి. ఆ నాటక సమాజాలన్నీ ఒక్క ఆంధ్రరాష్ట్రం నించే రాలేదు. అటు బొంబాయినించి కానివ్వండి, యిటు బిలాస్‌పూర్ కానివ్వండి, ఇటు మద్రాసు నించి కానివ్వండి, అటు మధ్యప్రదేశ్‌నించి కానివ్వండి... మేం యావత్‌భారత స్థాయిలో పరిషత్తు నిర్వహించినందుకు, యితర రాష్ట్రాలవారు కూడా వచ్చి పాల్గొనడం మాకు సంతోషంతోపాటు, కించిత్తు గర్వాన్ని కూడా కలిగించిందనే చెప్పాలి"

థియేటరంతా హర్షధ్వానాలతో మారుమోగింది.



అలా చప్పట్లు కొట్టిన వారిలో మొదట్నించి మూడో వరసలో కూర్చున్న పార్వతి కూడా వుంది.

"ప్రేక్షకమహాశయురాలా! ఇవాళ ఆంధ్రదేశమంతటా నాటక పరిషత్తులు కుక్క గొడుగుల్లా లేచిపోయేయి. వాళ్లూ పరిషత్తులు నిర్వహిస్తున్నారు, మేమూ నిర్వహిస్తున్నాం. వాళ్లూ బహుమతులు యిస్తున్నారు, మేమూ యిస్తున్నాం. అయితే యిందులో మా రసరంజని కళాక్షేత్ర ప్రత్యేకతేం వుంది? మేం ఏ పరిషత్తూ నిర్వహించని విధంగా నెల్లూరి భార్గవ అవార్డు, కాకినాడ కిరణ్మయి అవార్డులకోసం ఓ ప్రత్యేకమైన పోటీని, ఓ విశిష్టమైన పోటీని నిర్వహిస్తున్నాం. ఆ పోటీలో గెలుపొందిన వారికి వంద తులాల వెండి కిరీటాన్ని బహూకరిస్తున్నాం. నెల్లూరి భార్గవ అంటే నాటకరంగానికి ఆరాధ్యుడు, ప్రాతఃస్మరణీయుడన్న విషయం మీ అందరికీ తెలుసు! ఆయన జ్ఞాపకార్థం భార్గవ అవార్డు ఇస్తున్నాం. కాకినాడ కిరణ్మయి, రంగస్థల నటీమణులందరికీ ఆరాధ్యదేవతనే చెప్పాలి. ఆమె జ్ఞాపకార్థం కిరణ్మయి అవార్డును మూడు సంవత్సరాల క్రితం ప్రవేశపెట్టేం. ఆ పోటీ పెట్టడంతోనే, మా రసరంజని కళాక్షేత్రకో ప్రత్యేకత ఏర్పడింది. ఈ పోటీ తాలూకు ప్రత్యేకత ఏమిటో తెలిసినవారికి మళ్లీ చెప్పక్కర్లేకపోయినా, తెలియని వారికి చెప్పాల్సిన బాధ్యత మాకుంది.

గత పది రోజులుగా జరిగిన నాటకాలు, నాటికల పోటీల్లో రెండు వందల తొంభైనలుగురు నటులు, యిరవై ఆరుగురు నటీమణులు పాల్గొన్నారు. వారిలోనించి ఎనమండుగురు నటుల్ని ఓ ఎనిమిది మంది నటీమణుల్ని మా న్యాయనిర్ణయ కమిటీ ఎంపిక చేసింది. వీరందరూ వారివారి నాటకాల్లో ప్రదర్శించిన ప్రతిభనిబట్టే ఎంపికయ్యారు తప్ప, మేం ఎటువంటి సిఫార్సులకిగాని, ప్రలోభాలకి లొంగిగాని ఎంపిక చెయ్యలేదు. ఆ నటీనటుల్ని లాటరీ పద్ధతి మీద ఎనిమిది జోడీలుగా విభజించేం! వారందర్నీ, జోడీల వారిగా మన హైస్కూలు రూమ్స్‌లో ఒక్కో జోడీని ఒక్కో రూమ్‌లో వుంచేం. వారందరికీ ఒకే సమస్యనిచ్చేం. ఆ సమస్యని పరిష్కరిస్తూ వారు వేదికమీద అభినయించాలి. వారు వారి గదిలో రిహార్సల్సు చేస్కోడానికి అరగంట వ్యవధినిచ్చేం! ఏ జోడీకి ఏ సమస్యనిచ్చేమో మరో జోడీకి తెలియదు. అలాగే ఒక జోడీ వచ్చి యీ స్టేజిమీద ఏవిధంగా అభినయించి, ఏ సంభాషణలు పలికారో మరో జోడీకి ఎంతమాత్రం తెలియదు. అలా తెలియకుండా వుండడానికే యిక్కడికి ఓ అర కిలో మీటరు దూరంలో వున్న హైస్కూలు రూమ్స్‌లో ఆ జోడీలని వుంచడం జరిగింది. కేవలం వాళ్లు వేదికమీదకి రావడానికి ఒక్క అరగంట ముందు మాత్రమే వారికి సమస్యని తెలియజేశాం కాబట్టి, వాళ్లు అప్పటికప్పుడు స్వయంగా ఓ సన్నివేశానికి రూపకల్పన చేసుకుని, సంభాషణలు పొదుగుకుని తమ నటనతో ఆశువుగా సంభాషణలు పల్కుతూ సన్నివేశాన్ని రక్తికట్టించాలి. యిదేం సామాన్యమైన విషయం కాదు! ఒక రచయిత రాసిన స్క్రిప్టు చదివి, నెలల తరబడి సంభాషణలు వల్లించి వుత్తమ నటుడు, వుత్తమ నటి బహుమతులు సంపాదించడం వేరు, అప్పటికప్పుడు సన్నివేశాన్ని క్రియేట్ చేస్కుని నటించడం వేరు. ఆ పోటీని, మీరింతవరకు చూశారు. ఇప్పుడు యీ సంవత్సరపు భార్గవ అవార్డుని పొందిన వారెవరు? కిరణ్మయి అవార్డుని గెల్చుకున్నదెవరో అదంతా యీ కవర్లో వుంది" అంటూ కార్యదర్శి చేతిలోవున్న కవరుని పైకెత్తి చూపించాడు.

"కవరు విప్పాలి, కవరు విప్పాలి" కేకలతో థియేటరు దద్దరిల్లిపోయింది.

అయినా ఆయన వెంటనే కవరు విప్పకుండా, విజేతలకు బహుమతులు అందజే





యడానికొచ్చిన రాష్ట్ర సమాచారశాఖామాత్యుల్ని వేదిక మీదకిపిల్చి, దండవేసి, కవరుని అతనికి అందించి "విజేతల పేర్లు మీరే ప్రకటించండి సార్" అన్నాడు.

మంత్రిగారు మైకుముందుకొచ్చి కవరు విప్పాడు.

పోటీలో పాల్గొన్న నటీనటులందర్లోను టెన్షన్, రవంత ఒణుకు ఆరంభమయింది.

పార్వతికైతే ఒళ్లంతా తడిసిపోయి, బట్టలు చెమటతో ముద్దయి పోయాయి. ఆమె శరీరం రవంత కూడా వణకడం లేదుగాని, మనసు మాత్రం సుడిగాలికి వూగిసలాడుతున్న సరుగుడు చెట్టులా అస్తవ్యస్తంగా వూగిసలాడుతోంది.

ఎడమవైపు ఆరో వరసలో కూర్చున్న సుధీర్‌కుమార్ కూడా రుమాలుతో ముఖం మీదున్న చెమటని తుడుచుకుంటూ టెన్షన్‌ని కంట్రోల్ చేస్కోడానికి ప్రయత్నిస్తున్నాడు.

"ఈ సంవత్సరపు నెల్లూరు భార్గవ అవార్డు పొందినవారు శ్రీ కె.సుధీర్‌కుమార్"

మంత్రిగారి ప్రకటన వినగానే చప్పట్లు, ఈలలు, కేకలు వినిపించాయి. ఈ ఏడాది తమకే ఆ అవార్డు వస్తుందని విపరీతమైన నమ్మకంతోవున్న నలుగురైదుగురు నటులు మాత్రం అన్యాయం, అన్యాయం అని అరుస్తూ థియేటర్ నించి బయటకి వెళ్లిపోయేరు. సుధీర్‌కుమార్ వేదికమీదకి వెళ్లి ప్రేక్షకులకి నమస్కరించాడు.

"ఇంక... యీ సంవత్సరపు కిరణ్మయి అవార్డు గ్రహీత..." మంత్రిగారు ఆ మాటనగానే హాలంతా ఒక్క క్షణంలో నిశ్శబ్దమైపోయింది.

"కుమారిపార్వతి"

యిందాకటికంటే పదిరెట్లు చప్పట్లు, కేకలు... "నేను అనుకున్నట్టే జరిగింది" అంది వనజనే మరోనటి మూతితిప్పుతూ!

"ఏం గత రెండుసార్లు ఆవిడకేయిచ్చినప్పుడు, యీ ఏడాది మరొకరికిస్తే ఏం పోయిందటు" అంటూ మూలిగింది పద్మప్రియ అనే మరో లేడీ ఆర్టిస్టు!

పార్వతి వేదికమీదకివెళ్లి అందరికీ నమస్కరించింది.

కార్యదర్శి మైకు అందుకుని "ఓ ముఖ్య విషయం వినండి, ఓ ముఖ్య విషయం వినండి" అంటూ ప్రారంభించాడు.

"మేం ఈ పోటీ ఆరంభించి ఇది మూడో సంవత్సరం! ఈ మూడేళ్లలోనూ, భార్గవ అవార్డును ముగ్గురు డిఫరెంట్ నటులు అందుకున్నారు. కానీ విశేషమేమిటంటే, ఈ మూడు సంవత్సరాలు కిరణ్మయి అవార్డుని మాత్రం ఈ పార్వతే అందుకుంది. అందుచేత నేను చెప్పేదేమిటంటే ఈ పార్వతి మా పరిషత్తుకి పోటీదార్రాలూ కాదు, మా సంస్థకి అతిథీకాదు, మేం యిచ్చే బహుమతులకి విజేతాకాదు. అయితే మరేవిటి? ఘనత వహించిన యీ బహుమతిని పొందడానికి పార్వతి మాకు రెగ్యులర్ కస్టమర్"

హర్షధ్వానాలమధ్య మంత్రిగారు సుధీర్‌కుమార్ శిరస్సున, పార్వతి శిరస్సున రజిత మకుటాన్ని అలంకరించి అక్షింతలు జల్లి ఆశీర్వదించాక,

మైకు అందుకుని మాట్లాడబోయేడు. కానీ చాలామంది ఈలలువేసి, చప్పట్లు కొట్టేరు. మంత్రిగారు ఆ శబ్దాలకి అర్థాలు బాగా తెల్సినవాడిలా చిన్నగానవ్వి,

"ఆగండాగండి! మీరు వేసే ఈలలకి అర్థం నాకు తెలుసు! దురద వేయగానే గోక్కోవడం ప్రతీ మనిషికీ ఎంత సహజమో, కళ్లముందు జనం, నోటిముందు మైకూ కనబడగానే ప్రతీ పొలిటికల్ లీడరు ఉపన్యాసం యిచ్చెయ్యడమూ అంతే సహజం! కానీ నేను అలాంటి వుపన్యాసాల మంత్రినికాదు. ఒకప్పుడు నేనూ డ్రామాలు వేసిన నటుణ్ణే" అన్నాడు.

మళ్లీ ఓ మాదిరిగా చప్పట్లు మోగేయి! "ఇప్పుడు మీరు కొట్టిన చప్పట్లు చాలా చప్పగా వున్నాయి. కానీ మీచేతే యింకా ఎక్కువ చప్పట్లుకొట్టే ప్రకటన ఒకటి చేయ దలిచాను"

"ఏవిటి మహాశయా? " ఎవరో అరిచారు.

"కిరణ్మయి అనే అవార్డు చాలా ప్రతిష్టాత్మకమైనది! ఆ అవార్డుని గెల్చుకున్న నటి సాధారణంగా అసాధారణమైన నటే అయుంటుంది! అలాంటి అవార్డుని ఒక్క సారి కాదు, రెండుసార్లుకాదు, ఏకంగా మూడుసార్లు గెల్చుకున్న పార్వతిని యికమీదట మీరంతా పార్వతి అని పిలవకుండా కిరణ్మయి అనే పిలవాలని, మీ అందరి సమక్షంలో ఆమెకు కిరణ్మయి అని నామకరణం చేస్తున్నాను"

మంత్రిగారి మాటలకి థియేటర్ దద్దరిల్లిపోయేలా చప్పట్లు, ఈలలు "కిరణ్మయికీ జై! కిరణ్మయికీజై" అని నినాదాలు వినిపించాయి. కిరణ్మయి ఆనందంతో మైమరచిపోయింది. పార్వతి ఈసారి సుబ్బారావు ట్రూపుతో ఓ నాటకం వేసింది. అందులో ఆమెకు వుత్తమ నటి అవార్డు, మరొకరికి వుత్తమ కమేడియన్ అవార్డు తప్ప, బెస్ట్ ప్రొడక్షన్ బహుమతి అంటూ ఏదీ రాలేదు. అలాంటి బహుమతి వస్తేనే ఆ నాటకానికి నగదు బహుమతి యిస్తారు. సుధీర్‌కుమార్ ఒక్క నాటిక మాత్రం ప్రదర్శించాడు. దానికి ద్వితీయ వుత్తమ ప్రదర్శన, అతనికి ద్వితీయ ఉత్తమ నటుడి బహుమతి రావడంతో పాటు, ఆ నాటిక రాసింది కూడా అతనే కావడంవల్ల స్క్రిప్టుకి ఉత్తమ రచన బహుమతి కూడా వచ్చింది.

బహుమతీ ప్రదానం అయేక సుధీర్, పార్వతి ఒకర్నొకరు అభినందించుకున్నారు. కొంతమంది నాటకాల వాళ్లు వారిద్దరి చుట్టూచేరి, "మీలో మీరు అభినందించుకోవడం కాదర్రా! మీయిద్దర్నీ మేం అభినందించాలి" అన్నారు.

మరొకాయన, "వీళ్లని కూడా కాదు. వీళ్ల వూరు విశాఖపట్నాన్ని అభినందించాలి. అదేవిటో ఆ వూర్నించి ఏ ట్రూపు వచ్చినా, బహుమతులన్నీ గోనెసంచుల్లో మూటకట్టుకుని ఎత్తుకుపోవడమే" అన్నాడు. అందరూ నవ్వేరు. పార్వతి మాత్రం పెద్దగా నవ్వకుండా, "మావూరు చాలా గొప్పదనే మాట నిజమేగాని, మా వూరి ప్రెస్టేజిని నేనీ సంవత్సరం కొద్దిగా చెడగొట్టేనుకదా" అంది.

"ఎలా? " నిడదవోలు రామారావు నవ్వుతూ అడిగేడు.

"మా ట్రూపుకి ఏవో రెండు ఇండివిడ్యువల్ ప్రైజులు వచ్చేయి తప్ప, బెస్ట్ ప్రొడక్షన్ ప్రైజు ఏదీ రాలేదుకదా"

నిడదవోలు రామారావు యీసారి చిన్న లెక్చరిస్తున్నట్టుగా మాట్లాడేడు, "ఈ ఏడాది భార్గవ అవార్డు, కిరణ్మయి అవార్డూ మీ వూరికే పట్టుకుపోతున్నారు. సుధీర్ బెస్టు ప్రొడక్షన్ కాకపోయినా సెకెండ్ బెస్టయినా కొట్టేడు. ఇంక నువ్వు ఆడిన నాటకం ఎవరిదమ్మా? మీ డబ్బా సుబ్బారావుది. రచన, దర్శకత్వం, మూర్ఖత్వం అన్నీ వాడే నిర్వహిస్తాడు. ఇంక మీ నాటకంలోని సంగీతమంతా వాడి పెళ్లాం నీలమణే వాయిస్తుంది. వాళ్లిద్దరూ వుండగా, ఆ ట్రూపుకి ప్రైజులెలా వస్తాయి? నటనంటే ఎలా వుండాలి? అంటూ నవరసాల గురించి నానా పత్రికల్లోనూ వ్యాసాలుగీకి పారేసే మీ సుబ్బారావుకసలు డైలాగు చెప్పడం వచ్చా! అని అడుగుతున్నాను"

అతని మాటలకి అందరూ నవ్వినా పార్వతి మాత్రం నవ్వలేకపోయింది.

రాజమండ్రి రమోల పార్వతిని దగ్గరగా తీస్కుని బుగ్గలు గట్టిగా నొక్కి "మాకంటే ఎంతో వెనగ్గా వచ్చి మాకంటే చాలా ముందుగా వెళ్లిపోతున్నావే! కానీ యిప్పుడు నాకో సందేహం వస్తోందే" అంది.

"ఏంటక్కా? " పార్వతికి నిజంగా అర్థం కాకనే అడిగింది.

 

"ఏం లేదు, నీకేమో రెండు బెస్టు అవార్డులు వచ్చేశాయి. మీ సుబ్బారావు ప్రొడక్షన్‌కి ఏ గుడ్డూ రాలేదుకదా! ఈసారి నీ కిరాయి కింద యీ రెండు ప్రైజుల్నీ జమకట్టేస్కోమంటాడేమో చూస్కో"

రమోలా వేసిన జోక్‌కి పార్వతితో సహా అందరూ పగలబడి నవ్వేరు.

"ఇంక బయల్దేరుదామా? "

ఆ గొంతు విని పార్వతి అటువైపు చూసింది.

అక్కడ నిలబడిన వ్యక్తి... వరదరాజులు. అతని చేతిలో ఫ్రేము కట్టబడిన పటం వుంది. కిరణ్మయి బిరుదుని తనకి ప్రదానం చేసినప్పుడు మినిస్టరుగారి చేత యిప్పించిన అభినందన పత్రమది! దాన్ని వేదికమీద ఓ పక్కన పెట్టిందేగాని, మిత్రులతో మాట్లాడుతూ బయటకొచ్చేటప్పుడు దాని విషయమే మర్చిపోయింది. అంతేకాదు యీ సంతోషంలో, ఈ సంరంభంలో వైజాగ్ నించి తనకి ఎస్కార్టు వచ్చిన వరదరాజులు విషయమే మర్చిపోయింది.

"సారీ నేనా పత్రం గురించే మర్చిపోయేను" ఎపాలజిటిగ్గా అంది పార్వతి.

"నేను మర్చిపోలేదులే.. బండికి టైమయింది, సుబ్బారావుగారు మనకోసం వెయిట్ చేస్తుంటారు" అంటూ పార్వతి చేతిలోవున్న వెండి కిరీటాన్ని, వుత్తమనటి బహుమతిని తన చేతిలోకి తీస్కున్నాడు.

"నేనొస్తానక్కా" అంది పార్వతి రమోలాతో.

"పరిషత్తుల్లో కలవడమేకాదు, అప్పుడప్పుడు వుత్తరాలు రాస్తుండు పార్వతీ!" అంది రమోలా ఎంతో ప్రేమగా.

వరదరాజులు ఆమెను, మిగతావాళ్లని ఆపి, చిన్నగా నవ్వుతూ అన్నాడు, "అన్ని వేల ప్రేక్షకుల సమక్షంలో ఓ మినిస్టరుగారు పార్వతి పేరుని కిరణ్మయిగా మార్చేక, యింకా మీరు పార్వతీ అని పిలవడం న్యాయం కాదు. ఈ రోజునించి మనం యీవిణ్ణి కిరణ్మయి అనే పిలుద్దాం"

అప్రయత్నంగానే అందరూ చప్పట్లుకొట్టేరు.

★ ★ ★

కిరణ్మయి, వరదరాజులు బహుమతులు పట్టుకుని పరిషత్తువాళ్లు తమకిచ్చిన రూముకొచ్చేసరికి రాత్రి ఒంటిగంట దాటింది! సుబ్బారావు, నీలమణి, మిగతా నటులు ప్రయాణానికి సిద్ధమవుతూ తమ పెట్టే బేడా సర్దుతున్నారు. సుబ్బారావుగారి దగ్గర కెళ్లి, తనకొచ్చిన బహుమతుల్ని చూపిస్తూ. "యివి నాకిచ్చేరు సార్" అంది వినయంగా

సుబ్బారావు ఏం అనాలనుకున్నాడో ఏమోగాని, నీలమణి మాత్రం చుడుతున్న బెడ్‌హోల్డాల్‌ని అలాగే మధ్యలో వదిలేసి, రుసరుసలాడుతూ తన అక్కసుని వెళ్లగక్కింది.

"వాటిని మేమూ చూసేం తల్లీ! ఈ కిరీటాన్ని నీ నెత్తిమీద పెడుతున్నప్పుడు మేమేం కడుపుమంటతో కళ్లు మూసేస్కో లేదు. మాకేం అసూయలు, అక్కసులు, కుళ్లుకుసిద్ధాలూ ఏవీలేవు. నేను నాటకాలాడే రోజుల్లో ఈలాంటి బహుమానాలేం పెట్టలేదా దొంగ ముండాకొడుకులు! పెట్టుంటే, నేనూ కొట్టుకొచ్చేదాన్ని! చూపించింది చాలుగాని, తొందరగా తెములు. నువ్విక్కడే కిరీటాలు చూస్కుని మురిసిపోతుంటే అవతల వైజాగెళ్లే ట్రైను కాస్తా తుర్రుమంటుంది"

ఆ మాటనేసి బాత్రూమ్‌వైపు నడిచింది. సుబ్బారావు ఎదుటకి ఏనాడూ పెద్దపులి రాలేదు కాబట్టి దాన్ని చూసి భయపడతాడో లేదో తెలీదు కానీ తన భార్య నీలమణిని చూస్తే మాత్రం నోటంట మాట పెగలదు. ఆమె బాత్రూమ్‌కి వెళ్లడం చూసి చాలా మెల్లని స్వరంతో కిరణ్మయిని ఆశీర్వదించాడు. "నీకు మేడమ్ సంగతి తెలీదులా వుంది. ఇంక నీ బహుమతుల సంగతంటావా? నీకు ఏ చిన్న బహుమతి వచ్చినా

సంతోషించేవాళ్లలో నేనే మొదటివాణ్ణి” అంటూ ఆమె తలమీద చెయ్యిపెట్టేడు.

వరదరాజులు అతని చేతిని కిరణ్మయి తల మీదనించి తీసేసి “చూడండి, మా కిర ణ్మయికే గుర్తింపొచ్చినా సంతోషించేవాళ్లలో మీరే మొదటివాడినన్నారు. ఆ విషయం నాకు డౌట్‌గాని, కిరణ్మయికి ఏ గౌరవం లభించినా మీ ఆవిడ వుడుక్కుంటుందనే విషయంలో మాత్రం నాకు ఎటువంటి డౌటూలేదు” అన్నాడు చిరాగ్గా!

డ్రామాల్లో లేడీ ఆర్టిస్టు వెనక వయస్సులో వున్న మగాడు ఎస్కార్టు వస్తేనే ఎవరికీ నచ్చదు. వరదరాజులు తనకి ఎస్కార్టు వచ్చిన మనిషి! అతను డ్రామా ట్రూపు ఆర్గ నైజరు భార్యని విమర్శిస్తే చాలా గొడవలు జరగొచ్చన్న భయంతో కిరణ్మయి వరదరా జులుకి కళ్లతోనే సంజ్ఞ చేసి వూరుకోమని చెప్పింది.

కిరణ్మయి, వరదరాజులు, మిగతావా ళ్లంతా తమ గదిలోనించి బైటకొచ్చి రిక్షాలు ఎక్కబోతుండగా పక్క గదుల్లో వున్న మిగతా సమాజాల నటులు కొంతమంది గబగబా వాళ్ల దగ్గరకొచ్చారు. అందులో ఒకాయన కిరణ్మయితో అన్నాడు, “అమ్మాయ్! నువ్వు వరసగా మూడుసార్లూ కిరణ్మయి అవార్డుని కొట్టేశాక మా అందరికీ ఓ అయిడియా వచ్చింది”

‘ఏవిటండి? ” అంది కిరణ్మయి నవ్వుతూ.

“నటనలో పరీక్షపెట్టి, కిరణ్మయి అవార్డు యిచ్చినట్టే పరిషత్తుకొచ్చిన లేడీ ఆర్టిస్టులకి అందంలో కూడా పోటీ పెట్టాలని మేం రస రంజని కళాక్షేత్ర వాళ్లకి వుత్తరాలు రాయా లనుకుంటున్నాం. ఎందుకంటే అందాల పోటీ పెడితే అందులో కూడా నువ్వే అందా లరాణి ప్రైజుకొట్టేస్తావని మా నమ్మకం” అంటూ బిగ్గరగా నవ్వేడు. అందరూ వంత కలిపారు. నీలమణి మాత్రం నవ్వకుండా, తన ధోరణిలోనే “అదొక్కటే తక్కువ యింది. కాస్త తొక్క తెల్లగుండగానే అంద గత్తెకిందలెక్కేనా? ఆ లెక్కనయితే, నా రోజుల్లో నేనూ మిలమిల్లాడిపోయేదాన్ని! ఎందుకొచ్చిన చెత్త కబుర్లుగాని, ఎక్కండె క్కండి రిక్షాలెక్కండి” అంది.

వరదరాజులు నీలమణిమీద గుడ్లురు ముతూ ఏదో అనబోయేడుగాని కిరణ్మయి అతని చేతిని గట్టిగా నొక్కడంతో అతను కోపాన్ని తమాయించుకుంటూ కిరణ్మయితో పాటు రిక్షా ఎక్కేడు.

★ ★ ★

కిరణ్మయి విశాఖపట్నంలో ట్రైన్ దిగేస రికి పదిన్నరయింది. ఆరోజు ఆ ట్రైను రెండున్నర గంటలు ఆలస్యంగా వచ్చింది. ఆ ట్రూపులోని నటులంతా వుద్యోగస్థులే! ట్రైన్ కరెక్టు టైమ్‌కొస్తే ఆరోజు తమ డ్యూటీ లకి హాజరై పోవచ్చనుకున్నారుగాని, అది పదిన్నరకి చేరడంతో ఆలస్యంగా వచ్చిన ట్రైన్‌ని, తమకు ప్రైజులు యివ్వని పరిష త్తుని తిట్టుకుంటూనే స్టేషన్‌లోనించి బయ టికి నడిచారు.

కిరణ్మయికి ఏ శ్రమాలేకుండా వరదరా జులే అన్ని సామాన్లు, ప్లాట్‌ఫారం నించి బయటికి మోస్తూ, “సుబ్బారావు కిరాయి యిచ్చేశాడా? ” అన్నాడు మెల్లగా.

“లేదు”

“స్టేషన్ బయటకెళ్లాక, అడిగి తీస్కో! నువ్వు ఏమాత్రం మొహమాటపడినా వాడు ఇవ్వడు, వాడు ఇవ్వాలనుకున్నా ఆ దొంగ ముండ నీలమణి యివ్వనివ్వదు”

కిరణ్మయి ఏదో అనబోయిందిగాని, అప్ప టికే సుబ్బారావు, నీలమణి తమ లగేజీలు మోసుకుంటూ దగ్గరగా వచ్చేరు. దాంతో కిరణ్మయి ఏమీ అనలేకపోయింది. ఆమె ఏ ట్రూపునైనా కిరాయి గురించి అడగ్గలదేమో గాని సుబ్బారావుని మాత్రం అడగలేదు! ఎందుకంటే సుబ్బారావుని ఆమె గురువు గానే భావిస్తుంది. తనకి నాటకరంగంమీద





తొలిసారిగా బొట్టుపెట్టి, ముఖానికి రంగువేసింది ఆయన కాకపోయినా, పెద్దపెద్ద పరిషత్తుల్లో పాల్గొని, పదిమందికీ తెలిసింది ఆయనవల్లే! ఆవిధంగా ఏర్పడిన గురుభావంతో తనెప్పుడూ అతన్ని కిరాయి గురించి అడగలేదు. ఇప్పుడు కూడా మిగతా ట్రూపులకంటే ఓ పదీ యిరవై తక్కువే ఇస్తాడు. అయినా అతను ఎంతిస్తాడన్నది తను ఏనాడూ పట్టించుకోలేదు. అతను ఇచ్చింది ఎంతయినా, యిస్తానన్న కిరాయి ఎగ్గొట్టింది ఏనాడూలేదు.

స్టేషన్ బయట అందరూ రిక్షాలు ఎక్కుతున్నారు, కిరణ్మయి రిక్షాలో సామాన్లు సర్దడానికే చూస్తోందిగాని సుబ్బారావు డబ్బు యిస్తాడా యివ్వడా అనే విషయం ఆలోచించడంలేదు. వరదరాజులు సుబ్బారావు, నీలమణి రిక్షా ఎక్కడంవైపే చూస్తున్నాడు. కిరాయి విషయం ఏమీ చెప్పకుండానే సుబ్బారావు వెళ్లిపోతాడేమోనని అతని భయం.

సుబ్బారావు బృందంలోని నటులంతా ఎవరి దోవన వారు వెళ్ళిపోయేరు. అతను తన రిక్షాలో సామాన్లు సర్దేసి, కిరణ్మయి కూర్చున్న రిక్షా దగ్గరకొచ్చి,

"అమ్మాయ్! మనకక్కడ బెస్ట్ ప్రొడక్షన్ ప్రైజు వచ్చుంటే, నీ కిరాయి అక్కడే యిచ్చేసేవాణ్ణి! కానీ నీకు తెలియందేం వుంది? దగుల్బాజీ వెధవలు, మనల్ని దగాచేశారు. అయినా ఏంభయంలేదు. చేతిలో వున్నది కాస్తా మన మేకప్పు వెంకట్రావుకి, వయొలినిస్టు రాజుకీ యిచ్చేసాను లేకపోతే వెధవలు నన్ను తిట్టుకుంటారు. ఇపుణ్ణేను దులిపేసిన సంచిలా మిగిలిపోయేను. అయినా రెండు మూడురోజుల్లో నీ కిరాయిని పువ్వుల్లో పెట్టి యిచ్చేస్తాగా... అన్నట్టు, ఎల్లుండినించి రిహార్సల్సుంటాయి. రేపొచ్చే నెల పదినించి కాకినాడ పరిషత్తుంటుంది. ఆ డేట్సులో మరెవరికీ ఒప్పుకోకు" అంటూ

ఆఖరు వాక్యాన్ని కాస్త ఒత్తి చెప్పి మరీ వెనక్కి తిరిగెళ్లి తన రిక్షా ఎక్కి వెళ్లిపోయేడు. అతను చెప్తున్నప్పుడు, అలాగేసార్ అలాగేసార్ అని కిరణ్మయి అందిగాని, అతను వెళ్లాక అప్రయత్నంగానే నిట్టూర్చింది.

ఆమె కూర్చున్న రిక్షా ముందుకు కదిలింది! కిరణ్మయి అలా నిట్టూర్చిన ప్రతీసారీ వరదరాజులు ఆమెకు హితోపదేశం చేస్తుంటాడు! ఇప్పుడు మళ్ళీ ఆమె నిట్టూర్పు, వెను వెంటనే అతని వుపదేశం ఆరంభమయ్యాయి.

"ఈ చాలీచాలని జీవితం ఎన్నాళ్ళు చెప్పు? ఈ చిన్నచిన్న చింతాకులతో విస్తరాకు కుట్టలేం! ఈ నాటకాల్లో నటించడం వల్ల నీ ఒంట్లోని వూపిరి ఆవిరి కావడం, నలుగురిచేతా నానా మాటలూ అనిపించుకోవడం తప్ప నాలుగు రూపాయలు వెనకెయ్యగలుగుతున్నావా? నువ్వు ఎన్నాళ్లనించి నాటకాలు వేస్తున్నావు? ఎంత డబ్బు సంపాదించేవు? నీ సంపాదనంతా నీ ఫేమిలీ తింటానికే సరిపోయిందిగాని, ఓ ఇల్లు కొనుక్కోగలిగేవా? కనీసం ఓ పెద్దింటిని అద్దెకు తీస్కోగలిగేవా? పరిషత్తుల్లో ఉత్తమనటి బహుమతులొచ్చినప్పుడల్లా వుప్పొంగిపోతున్నావు. ఆ బహుమతి కొట్టాలని ఎంతో శ్రమపడతావు. రిహార్సల్సులో చేసింది చాలనట్టు, యింటి దగ్గర అద్దం ముందుకూడా నిలబడి . ప్రాక్టీసు చేస్తుంటావు. అఫ్‌కోర్స్ అది నీ సిన్సియార్టీకి నిదర్శనమనుకో! కానీ- వుత్తమనటి బహుమతి పొందాలన్న తపనలో సగమైనా నువ్వు వున్నతంగా బతకాలని ఆలోచిస్తున్నావా? అని అడుగుతున్నాను"

చైను జారడంవల్ల రిక్షా ఆగింది. కానీ, వరదరాజులు మాటలు ఆగలేదు. "కిరణ్మయి అవార్డు మూడోసారి కూడా నువ్వే కొట్టేవు. మూడేళ్లక్రితం ఈ ప్రైజు కొట్టినప్పుడయినా, నువ్వు నీ కిరాయి ఓ పాతిక రూపాయలయినా పెంచావాంటే అదీలేదు! యికమీదట పెంచుతావాఅంటే, పెంచవని నాకు తెలుసు. నీకు కీర్తి మీదున్నంత మమకారం డబ్బుమీద లేదు"

రిక్షా మళ్ళీ ముందుకు కదిలింది. వరదరాజులు ఆమె హితవుకోరుతూ ఈ మాటలు చెప్పడం, తను మౌనంగా వినడం కిరణ్మయికి అలవాటే!

"పోనీ, కీర్తి అంటే అంత మమకారం వున్నదానివి, దాన్ని పెంచుకోడానికి మార్గాలు వెదుకుతున్నావాంటే అదీలేదు. నువ్వు మూడుసార్లు కాదు ముప్పైసార్లు ఇలాంటి కిరణ్మయి అవార్డులు కొట్టినా, ఓ సినిమాలో ఓ మాదిరి వేషం వేసిందానికిచ్చే విలువ నీకిస్తారా చెప్పు? రెక్కలు రాని పక్షి తల్లిని పట్టుకుని గూట్లోనే గుట్టుగా వుంటుంది, కానీ, రెక్కలొచ్చేక లోకంమీదకి ఎగరాలి! నీ అందం ఏ నటీమణికైనా వుందేమో చూపించు. నా చెవి కోయించుకుంటాను. నీ ఏక్టింగ్ టాలెంట్ ఒక్కదానికి చూపించు, వాళ్ళింట్లో నేను జీవితాంతం చాకిరీచేస్తాను"

స్టేషన్నించి యింటికి చేరడానికి పట్టిన యిరవై నిమిషాలు వరదరాజులు మాటల్లో తన జీవితమే నలిగేసరికి కిరణ్మయి మనసు వెయ్యి మెదళ్లతో ఆలోచించవలసి వచ్చింది. చెంగల్రావుపేటలోకి రిక్షా మళ్ళింది. రిక్షా ఇల్లు సమీపిస్తుందనగా, వరదరాజులు, మరింత సిన్సియర్‌గా అన్నాడు-

"మాటిమాటికీ నీ జీవితాన్ని విమర్శిస్తున్నాననుకోకు! నీ శ్రేయోభిలాషిగా చెప్తున్నాను. డబ్బుండి గూడా సుఖపడనివాణ్ణి ఏమంటాం? పిసినారి వాడంటాం. అందం, టాలెంటు రెండూ వుండిగూడా వాటిని సద్వినియోగపరుచుకో లేని వాళ్లని ఏమనాలి? నీ జీవితం నీకు నచ్చిందేమోగాని, నాకు మాత్రం నచ్చలేదు. నాకేకాదు, రత్నం విలువ పెరిగేది మకుటాన్ని చేరినప్పుడేనన్న సంగతి తెలిసిన ఏ గాడిదకీ నీ జీవితం.





నచ్చదు"

ఇంటిముందు రిక్షా ఆగింది. రిక్షావాడు లగేజి అంతా యింట్లో పెట్టేడు. కిరణ్మయి యింట్లోకి వెళ్ళబోతుండగా వరదరాజులు ఆమెను ఆపి, "నీ దగ్గరేమైనా చిల్లరుందా? నాదగ్గరన్నీ పదులున్నాయి" అన్నాడు. కిరణ్మయి పర్సు తెరచి ఓ అయిదు రూపాయలనోటు, రెండు రూపాయలనోటు అందించింది.

"నేను మళ్ళీ ఈవినింగొస్తాను. నువ్వు బాగా పీక్కుపోయున్నావు. రెస్టు తీస్కో! నేను చెప్పేది ఒక్కటే పార్వతీ... నీ జీవితం నాకు, మరొకరికి నచ్చడం కాదు... అసలు నీ జీవితం నీకైనా నచ్చిందా? ఆలోచించుకో"

ఈమాట చెప్పేసి, ఆమె ముఖంలోకి రెండు మూడు క్షణాలపాటు చూసి, అదే రిక్షాలో వెళ్ళిపోయేడు. అతను చెప్పిన మాటల్ని మనసులో మోస్తూ కిరణ్మయి యింట్లోకి అడుగుపెట్టింది.

★ ★ ★

కిరణ్మయి స్నానంచేసి, భోజనం ముగించి, తల్లితో తను సాధించిన విజయాన్ని, సంపాదించిన గౌరవాన్ని అతి వివరంగా చెప్పాలని ప్రయత్నించిందిగాని, అలసటవల్ల, బడలికవల్ల వివరంగా చెప్పలేక, చాలా క్లుప్తంగానే ముగించి, ఆవులింతలు తీస్తూ, పరిషత్తులో యిచ్చిన ప్రశంసాపత్రం పటాన్ని తల్లిచేతికిచ్చి, దీన్ని గోడకి తగిలించమ్మా" అంటూ మంచంమీద కూర్చుని ఆలోచనలో పడింది.

కిరణ్మయి తల్లి సరోజమ్మ ఇంట్లోని గోడలన్నీ వెదకి, "దీన్ని ఎక్కడ తగిలించాలో నువ్వే చెప్పు" అంది. కిరణ్మయి గదిలోని నాలుగ్గోడల్నీ పరీక్షగా చూసింది. గోడల నిండా తను గెల్చుకున్న షీల్డులు, కప్పులు వ్రేల్లాడుతున్నాయి. కొన్ని కళ తప్పిపోయి, కొన్ని సగం మాసిపోయి... మొత్తం మీద గోడలన్నీ తన విజయచిహ్నాలతోనే నిండిపోయేయి. "సర్లే దాన్నో మూలన పెట్టు తర్వాత చూద్దాం దాని సంగతి" అంటూనే మంచంమీద వాలిపోయింది.

వంటగదిలోకి వెళ్ళి ఏదో చెయ్యబోయిన సరోజమ్మకి ఠక్కున ఏదో గుర్తొచ్చి మళ్ళీ కిరణ్మయి దగ్గరకొచ్చింది. "అన్నట్టు... యిందాక వెంకట్రామయ్య వచ్చెళ్లేడే! గత నెలదీ, యీ నెలదీ అద్దె మొత్తం రెండ్రోజుల్లోగా యిస్తే యిచ్చేరు. లేకపోతే మీ యింట్లోని చెంబూ తపేళా వీధిలోకి విసిరేస్తానని, అటుపైన మీ యిష్టం అంటూ తెగ నీలుగులు నీలిగాడు. అమ్మాయి పరిషత్తు కెళ్ళిందీ, తిరిగి రాగానే యిచ్చేస్తాను బాబూ అని ఎంత చెప్పినా వినడే! వీధిలో కెళ్ళి మరీ కుక్కలా అరిచాడు... యిప్పుడు తీసుకొచ్చిన డబ్బులో ఎంతో కొంత వాడి మొఖాన కొట్టు, లేకపోతే వాడు వూరుకునేలాలేడు" అంది.

తల్లి మాటల్లో బాధ కిరణ్మయి గ్రహించకపోలేదు. అద్దె సక్రమంగా కట్టకపోవడం తమదే తప్పు! కానీ, వెంకట్రామయ్య మరీ అలా వీధికెక్కి కేకలు వేసి పరువు తియ్యడమే ఆమె సహించలేకపోయింది.

"అతనొచ్చినప్పుడు నాన్న యింట్లో లేడా? " అంది. తన తండ్రి యింట్లో వుంటే వెంకట్రామయ్య అంతలా తోక జాడించడని ఆమెకు తెలుసు!

"వుంటే యింకేం? అసల్నువ్వు పరిషత్తు కెళ్ళిందగ్గర్నించి మళ్ళీ మీ నాన్న ఆ ముండ యింట్లోనే మకాం పెట్టేడు" మనసులోని దుఃఖం ఆమెనక్కడ నిలబెట్టలేక వంట గదిలోకి తీసుకువెళ్ళింది.

కిరణ్మయి, తన తండ్రిని తల్చుకుని నిట్టూర్చింది! తన జీవితానికి అతనో పెద్ద సమస్య! మంచంమీద మళ్ళీ వాలింది. మనసు రెక్కలు విప్పుకుని రయ్‌మని తిరగసాగింది.

రెక్కాడితేనేగాని డొక్కాడదనే సామెతకి

తనే ఓ చక్కటి వుదాహరణ! నాటకాలు వేస్తేనే తప్ప నాలుగు డబ్బులు చేతికిరావు. వచ్చిన డబ్బుకి వెయ్యి రెక్కలుంటాయి. అందుకే, డబ్బు అందిన ప్రతీ సారీ, కొన్ని గంటల్లో, ప్రతీ రూపాయీ ఎంతో వేగంగా ఎగురుకుంటూ వెళ్లి పోతుంది! నిన్నటి పరిషత్తుతో కలిపి, ఎనభై ఏడుసార్లు ఉత్తమ నటి బహుమతులందుకున్న తను రెండు నెలల్నించి యింటికి అద్దె కట్టలేక పోతోంది. ఆ విషయం ఆమెకు నవ్వు తెప్పించింది! తను కిరణ్మయి అవార్డు గ్రహీత! అదీ ఒక్కసారి కాదు, మూడుసార్లు అందుకుందా అవార్డు! అలాంటి కిరణ్మయికి మనశ్శాంతిలేదు! తండ్రి వున్నా అతనివల్ల సంపాదనలేదు. సరిగదా, అతను కోటవీధిలో మరో ఆవిణ్ణి వుంచుకున్నాడు! తరచుగా వుండేది ఆమె దగ్గరే! తను ఎప్పుడైనా కేకలు వేస్తే, ఓ నాలుగు రోజులు యింట్లో వుంటాడు. వున్న నాలుగు రోజులూ అతను మైకంలోనే వుండాలి! అలా అతనికి కావలసిన మైకానికి తను మదుపు పెట్టగలిగితేనే యింట్లో వుంటాడు. ఇది ఒకనాటి కథ కాదు. దాదాపు ఆరు ఏడేళ్ల పాతది! అందుచేత పండగలకి, పబ్బాలకి తన తండ్రి కూడా యింట్లో వుంటే బావుణ్ణన్న భావన కలిగితే, అతని షరతులకి సిద్ధమై అతన్ని ఇంట్లో వుంచుతుంది. అతను యింట్లో వున్నన్ని రోజులూ సారా, మాంసాలు, చేపలు, సిగరెట్లు తప్పనిసరిగా వుండాలి. అందులో, ఏ ఒక్కటి లోపించినా, అతను వెళ్ళిపోతాడు! మొన్న పరిషత్తుకెళ్ళేముందు వందరూపాయలు యిచ్చి వెళ్లింది. నాలుగు రోజుల తర్వాత తిరిగొచ్చేసరికి అతను యింట్లో లేడు! మళ్లీ రెండో ఆవిడ దగ్గరకే వెళ్ళిపోయేడట. అతని మనసో కుక్కతోక!

వీధుల్లో ఎక్కడెక్కడో తిరిగొచ్చిన కిరణ్మయి తమ్ముడు కృష్ణ, విజిల్ వేసుకుంటూ హుషారుగా ఆ గదిలోకొచ్చి, మంచంమీద పడుకున్న అక్కని చూసి కంగారుపడి వెనక్కి వెళ్లిపోబోయేడు! కానీ, ఆమె వాణ్ణి చూడ్డం, పిలవడం కూడా క్షణంలో జరిగిపోయింది.

"ఎక్కడికెళ్ళేవురా? "

కృష్ణ పలకలేదు,

"ఎక్కడికెళ్లేవూ అని అడుగుతున్నాను" ఈసారి గద్దించింది. "ఏం మాట్లాడవు? మళ్ళీ పేకాటకేనా" అంటూ తమ్ముడి జేబులు తడిమింది. రెండు సిగరెట్లతో ఓ సిగరెట్ పేకెట్టు, అగ్గిపెట్టె దొరికాయి.

"నీకెన్నిసార్లు చెప్పినా, ఆ పేకాట, యీ సిగరెట్లు మానవన్న మాట" అంటూ ఓ లెంపకాయ కొట్టింది.

"వెళ్ళి స్నానంచెయ్" అంది కాని, కృష్ణ ఆమెను కోపంగా చూసి, గది తలుపుల్ని దభ్ మని కాలితో తన్నేసి "నువ్వున్నంతవరకు నేను యింటికే రాను" అని బయటకి పారిపోయేడు.

ఈ గొడవకి వంటగదిలోనించి సరోజమ్మ వచ్చింది.

"తమ్ముడొచ్చేడా? " అంది. "నేను లేననుకుని వచ్చేడు. అద్సరే, వాడు ఎన్ని రోజుల్నించి యింటికి రావడంలేదు? " కర్కశంగా ప్రశ్నించింది.

జవాబు చెప్పకుండా సరోజమ్మ మౌనంగా లోనికి వెళ్లబోయింది. "నీకు చాలాసార్లు చెప్పేను. నాన్న ఎలాగూ యింట్లో వుండడు, కనీసం వీణ్ణయినా యింట్లో వుండేలా చూస్కో అన్నాను. నాకు నాటకాలు, రిహార్సల్సుతో, వాడి సంగతి చూడ్డానికి తీరిక వుండదు. నువ్వేమో వాణ్ణి అతిగారాబం చేస్తావు. అందుకే వాడు బేవార్సు తిరుగుళ్లు తిరుగుతూ పేకాటతోనే కాలక్షేపం చేస్తున్నాడు. సర్లే యిలా వాగీవాగి నేను చెడ్డదాన్నవడమే తప్ప, మీరు మాత్రం మారరు" అంటూ చిరాగ్గా మంచంమీద వాలిపోయి, దుప్పట్ని గుండెలదాకా లాక్కుంది.

సరోజమ్మ తప్పుచేసిందాన్లా తలదించుకుని వంట గదిలోకి వెళ్లిపోయింది.





కిరణ్మయి కళ్లు అయితే మూసుకుంది గాని, మనసు మాత్రం నిద్రలోకి జారనం టోంది. డబ్బు సంపాదిస్తున్న మనిషిగానే, తనని తన తల్లిదండ్రులు గుర్తుంచుకోవడం, తన సరదాలు, సంతోషాలు ఏవిటో గుర్తుం చుకోకపోవడం... యివన్నీ ఆమెకు అప్పుడ ప్పుడు బాధ కలిగించినా, కర్మ సిద్ధాంతాన్ని మననం చేసుకుంటూ తనకి తనే వూరట చెప్పుకునేది! కానీ, తను సంతోషంగా వూపిరి పీల్చుకునే విధంగా తన యింట్లో ఒక్కరి ప్రవర్తనా లేనందుకు ఆమె ఎప్పుడూ బాధ పడుతూనే వుంది! తండ్రి ఆవిధంగా, అక్కడ రెండో ఆవిడతో తిరగడం.. తమ్ము డీవిధంగా పనీపాటా లేకుండా పేకాట లాడుతూ క్లబ్బుల్లో తిరగడం... ఈమధ్య మందు కొడుతున్నాడని కూడా విన్నది. ఇంతా చూస్తే వాడి వయసు పదిహేడు దాటిందో లేదో...

"నీ జీవితం నాకు నచ్చలేదు" అని వరద రాజులు అన్నాడంటే, అందులో తప్పేం వుంది?

అతను తన జీవిత చిత్రాన్ని దగ్గర్నించి చూస్తున్నాడు గనక, ఈ అందమైన బొమ్మలో ఎన్ని లోపాలున్నాయో గమనించ గలిగాడు. మిగిలినవారంతా బొమ్మని దూరంనించి చూసి ఆనందించేవారే. తను ఎన్నో నాటకాలు వేసి ఎంతో సంపాదించేసేననుకునేవారే. ఎందరో, తనని డైరక్టుగానే అడిగేసారు. "మీరు ఇంత బిజీగా నటిస్తూ, బోలెడంత సంపాదిస్తూ కూడా మీరెందుకు ఖరీదైన చీరలు కట్టు కోరు?"

కట్టాలనే కోరిక తనకీ వుంది. కానీ, ఇల్లంతా, తన రాబడిమీదే బ్రతకాలి, బట్ట కట్టాలి. ఇది బయటికి చెప్పుకోలేని జవాబు. చెప్పినా ఎదుటివార్ని సంతృప్తిపరచలేని జవాబు. పైగా ఎదుటివారు సానుభూతి చూపించే జవాబు! ఎందుకో... తనకలాంటి సానుభూతి పొందడం ఇష్టం వుండదు.

"ఈపాటికి మీరో సొంతిల్లు కొనుక్కునుండా ల్సింది" అని చాలామంది అన్నారు. మొదటిసారి ఈమాట విన్నపుడు ఆమెకి అప్రయత్నంగానే నవ్వొచ్చిందిగాని, తర్వాత్తర్వాత నవ్వు రావడం మానేసింది. సొంత ఇల్లు కొనుక్కోవడంమాట అటుంచి, వుంటున్న ఇంటికి అద్దె సక్రమంగా కట్టలేకపోతోంది. ఈ విషయం ఎలా చెప్పగలదు. అసలెందుకు చెప్పాలి? అంచేత మౌనంగా వుండిపోవడమో, చిరునవ్వు నవ్వెయ్యడమో, లేక ఆ టాపిక్కు మార్చేసి మాట్లాడ్డమో అలవాటు చేసుకుంది.

ప్రస్తుతం వుంటున్న ఇల్లు తనకి చాలీచాలని ఇల్లే! తనని నాటకానికి బుక్ చేస్కోడానికొచ్చినవాళ్లు కూర్చోడానికి సరిపడే కుర్చీలు లేక ఇబ్బంది పడినప్పుడు, ఇంటి ఓనరు వెంకట్రామయ్య అద్దెకట్టనందుకు దారుణంగా తిట్టినప్పుడు, ఈ ఇంటినించి మరో ఇంటికి మారిపోవాలీ అని అనుకునేది. కానీ- మారితే ఇంతకంటే మంచి ఇంటికే మారాలి. దానికింతకంటే ఎక్కువ అద్దె కట్టాలి. ఈ ఇంటి అద్దె కట్టడానికే ఇన్ని తిప్పలు పడుతున్నప్పుడు, ఇంతకంటే పెద్ద ఇల్లు కావాలని కోరుకోవడం మూర్ఖత్వమే అవుతుంది.

ఏమిటీ జీవితం?

సమస్యల తోరణం. ప్చ్... సంపాదన వున్నా శాంతిలేదు. తన జీవితాన్ని, తన మనసుని, తన మనసులోని అసంతృప్తిని, ఆవేదనని పూర్తిగా అర్థంచేసుకున్నవాడు వరదరాజులొక్కడే! తన జీవితం గురించి తన ముఖమ్మీద చెప్పగలిగిందీ అతనొక్కడే!

అతను సంవత్సరం కిందట పరిచయమయేడు. "నీ అందంనచ్చింది, నీ నటన నచ్చింది, నీకు ఆ భగవంతుడిచ్చినవన్నీ నాకు నచ్చేయి. కానీ, వాటిని నువు జీవితానికి వుపయోగించుకోకపోవడమే నాకు నచ్చలేదు" అని, తనతో పరిచయమయిన తొలి వారంలోనే అనేసాడు. ఇంకా అంటూనే వున్నాడు. కాకపోతే, మునుపటికంటే చనువుగా... పెరిగిన స్నేహంతో వచ్చిన అధికారంతో అంటున్నాడు. అతను ఎలా అన్నా- అతను అన్నది నిజంకాకపోతేగదా!

"వరదరాజులు మంచివాడు", ఈ అభిప్రాయాన్ని కిరణ్మయి ఏ ఒక్క రోజులోనో, అతను చేసిన ఏ ఒక్క పనిని చూసి స్పందించో ఏర్పర్చుకోలేదు. ఏ ఆవేశమో అతని మీదా సదభిప్రాయాన్ని కలిగించలేదు.

అసలు తనలో ఆవేశంలేదు.

లేదా అంటే వుంది. కానీ, తన మనసు క్షణికావేశానికి లోనవదు. తనకదో గట్టి నమ్మకం. వరదరాజులు మంచి స్నేహితుడు. తన అందాన్ని వర్ణిస్తూ, తన నటనా ప్రాభవాన్ని నిండుమనసుతో ప్రశంసిస్తూనే, తన భవిష్యత్తు బంగారం కావాలని కోరుకుంటున్న మంచి వ్యక్తి! తన వెంట అనేక సార్లు ఎస్కార్టుగా పరిషత్తులకొచ్చినా, తమ ఏకాంతాన్ని మరో విధంగా వాడుకోవాలని ఏనాడూ ప్రయత్నించలేదు. అతన్లో, ఆమెకు నచ్చిన గొప్ప విషయం అదే! తన శరీరాన్ని కాకుండా, తన భవిష్యత్తుని కోరుకుంటున్నాడు గాబట్టే, "నీ జీవితం నాకు నచ్చలేదు" అనగలిగాడు! అతనికి మంచి రూపంతో పాటు, మంచి మాట చాకచక్యం వుంది. గంటలో ఎదుటివారిని శ్రోతగా మార్చి తను వక్త అవగలిగే నేర్పుందతనికి! కాబట్టి, ఎవర్నీ నమ్మని తన తల్లికి సైతం, పరిచయం అయిన నెలరోజుల్లోనే, సలహాదారుడిగా మారిపోయేడు! అతనికి కొద్దో గొప్పో నాటకానుభవం వుందని, తెనాలిలో నాటకాలాడేవాణ్ణని అతనే చెప్పేడు! సినిమాల్లో నటించి, హీరోగా రాణించి, కీర్తిప్రతిష్టలు, అంతకంటే ఎక్కువ డబ్బు సంపాదించాలని తపన ఎక్కువ.

ఇది కేవలం కిరణ్మయి అభిప్రాయం మాత్రమే! అది కూడా వరదరాజులు ఆవి




# ఏరిన ముత్యాలు

☆ విజ్ఞానం స్వర్గానికి ఎగరడానికి కావలసిన రెక్క.

-షేక్స్పియర్

☆ శరీరం బుద్ధిబలానికి వశమైవుండాలి.

-హక్స్లీ

☆ విజ్ఞానమే మన అంతిమశ్రేయస్సు

-సోక్రటీస్

☆ వెయ్యి తుపాకులకంటే, నాలుగు వ్యతిరేక పత్రికలే ఎక్కువగా భయపెడతాయి.

-నెపోలియన్

☆ సముద్రాన్ని పొగుడు. కాని ఒడ్డునే నిలబడు.

-జార్జి హెర్బర్ట్

☆ విషం తన ప్రభావాన్ని ఒక్కసారే చూపుతుంది. కాని ఒక చెడ్డపుస్తకం చాలాకాలంవరకు మనుషుల మనసులను విషమయం చేస్తూనే వుంటుంది.

-జాన్‌ముర్రే

☆ కలాలు చాలా ప్రమాదమైన సాధనాలు. కత్తులకంటే ఎన్నో రెట్లు పదునైనవి. కొరడాదెబ్బల కంటే కఠినమైనవి.

-జాన్ టేలర్

☆ మానవుడు యజమానిగా పెత్తనం చెలాయించడానికిగాని, బానిసగా చాకిరీ చేయడానికిగాని పుట్టలేదు.

-అబ్రహం లింకన్

☆ చీకటి నిండిన గర్భగుడిలో భగవంతుడు లేడు. నడిరోడ్డుపై రాళ్లు కొట్టే శ్రమజీవి చెంత నిలిచివున్నాడు.

-టాగూర్

☆ వేలకొలది నీతులు బోధించడంకంటే ఏదైన ఒక మంచిపని చేసి చూపించడం మేలు.

-గాంధీజీ

☆ అభ్యుదయ సాహిత్యం ఒక ప్రబలమైన సామాజికశక్తి. సామాజిక శక్తులు పెరగడం, సమాజాన్ని దోపిడీ చేసేవారికి రుచించదు.

-కొడవటిగంటి కుటుంబరావు

సేకరణ: ఆముదాల అజయ్‌బాబు

# చతుర సమీక్ష

ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

ఆగస్ట్ చతుర నవల తీగలు తెగిన సితార

సమీక్షకుని పేరు : ..................................................

చిరునామా : ..................................................

..................................................

..................................................

..................................................

డకి కావాలని కలగజేసిందే! ఇక్కడ ఆమెకు తెలియంది, సినిమారంగంలోని చోటా మోటా, చిన్నాచితకా మనుషులకి తెల్సిన మరో కథ వుంది.



పాములపేరుతో వానపాములు కూడా వున్నట్టే, నాటకాల నటుడు పేరుతో నాటకాలు ఎప్పుడూ వెయ్యని వారూ వున్నారు!

కానీ, పేరు చెప్పగానే "ఓహో, నాటకాల వరదరాజులా? ఆయన మాకెందుకు తెలీదూ? " అనే గుర్తింపును తెచ్చుకుంటారు. కానీ, అలా అన్నవాళ్లెవరూ వరదరాజులు వేసిన నాటకాల్ని ఎప్పుడూ చూడలేదు. అలా పదిమందీ, పది పదులు వంద సార్లూ అలా అనగానే, యిలాంటి వరదరాజులు, అలా నాటకాల వరదరాజులుగానే, సెటిలైపోతారు. చెలామణీలోకొస్తారు! ఎప్పుడో ఒకటీ, అరా నాటికలు, నాటకాలు వరదరాజులు వేసాడటగాని, అవేం లెక్కలోకి రాలేదు. అలా అడపాదడపా వేసినప్పుడు గూడా అతని కాళ్ళు రంగస్థలం మీదవున్నా, కళ్లు మాత్రం సినిమారంగంమీదే వుండేవి! అతని చేతివేళ్లు సినిమా హీరోలు సంపాదించే లక్షల్ని లెక్కపెట్టడానికే వుపయోగపడేవి! అతని మనసు అతనికో గట్టి నమ్మకాన్ని, ఓ గట్టి సంశయాన్ని కూడా ఏర్పరిచింది.

"నేను ఏదో ఒకరోజు నెంబర్ ఒన్ హీరోగా తెలుగు సినిమా ఫీల్డుని ఏలడం ఖాయం" -యిది ఆయన గట్టి నమ్మకం కాగా-

"నేను నెంబర్ ఒన్ హీరో కావడానికి ఓ సంవత్సరం పడుతుందా? లేక రెండేళ్ళు పడుతుందా? " ఇదీ ఆయన గట్టి సందేహం!

మనిషి తన ఆత్మవిశ్వాసాన్ని పెంచుకోడానికి కొన్ని మార్గాలున్నా యంటారు! చేసిన కృషినిబట్టి కొందరు, వెనుకనున్న ఆస్తినిబట్టి కొందరు, ఎన్నుకున్న దారుల్నిబట్టి యింకెందరో ఆత్మవిశ్వాసాన్ని పొందుతారు! కానీ, వరదరాజులు వీటిల్లో ఏ ఒక్క దానిమీదో ఆధారపడలేదు! కేవలం ఓ పెద్దసైజు అద్దాన్ని మాత్రమే నమ్ముకున్నాడు! అతని రూపం ఎలావున్నా, ఆ అద్దం మాత్రం అతన్ని అందంగానే వున్నట్టుగా చూపించి, తనని డబ్బిచ్చి కొన్నందుకు అతనికావిధంగా ప్రత్యుపకారం చేసింది.

కానీ, అతను అద్దంలో తననితాను చూసుకుని మురిసిపోయే ప్రతీసారీ, కిటికీ లోనించి ఓ పిచ్చుకవచ్చి, అద్దంమీద వాలి, అద్దంలో కనిపించే తన ప్రతిబింబాన్ని చూస్తూ అద్దాన్ని తన ముక్కుతో పొడిచేది. పొడుస్తూ కిచ్‌కిచ్‌మంటూ అరిచేది. అద్దాన్ని చూడగానే పిచ్చుకలకి కూడా అందాన్ని చూస్కోవాలనే తపన కలుగుతుందని, వరదరాజులుకి కొన్ని రోజులకే అర్థమయింది.

అతను అద్దం చూస్కుంటూ, తను ప్రస్తుతంవుండే హీరోలెవరికంటే ఏమాత్రం తక్కువ కాకపోయినా, రవంత ఎక్కువలాగే వున్నాననుకున్నాడు. కానీ పిచ్చుక ప్రతీ రోజూ కుఁయ్‌కుఁయ్ లాడుతుంటే, అతనే జవాబు చెప్పుకున్నాడు.

"నా నెత్తిమీద వెంట్రుకలు పల్చబడిపోతే మాత్రమేం కేవలం బోడిగుండుతో వున్న హీరోలు ఎంతమంది లేరు? విగ్గువేస్కుంటే నెత్తికి రావాల్సిన అందం నెత్తికొస్తుంది.

మేకప్ కొట్టుకుంటే సపోటాపండు రంగులో వున్న నేను ఏపిల్ పండురంగులో కొచ్చే స్తాను. నా వాయిస్, డబ్బాలో గులకరా యిలు ఆడించినట్టు దరిద్రంగా వుంటుందని మా శంకర్రావుగాడు కామెంట్ చేశాడు. కానీ, మంచి డబ్బింగు ఆర్టిస్టుచేత డబ్బింగ్ చెప్పించుకుంటే, నా గొంతు కూడా ఖంగ్ మంటూ మోగుతుంది! పైగా డబ్బింగ్ ఆర్టి స్టులకిచ్చే డబ్బు కూడా ప్రొడ్యూసరే ఇచ్చు కుంటాడుగాని, నేనేం యివ్వక్కర్లేదట..."

ఇలా, యివాళ సినిమాలకోసం ఎగబడు తున్న చాలామంది అనుకున్నట్టుగానే అతనూ అనుకున్నాడు! అర్హతల్ని గురించి ఆలోచించకుండా కేవలం ఆశలసంఖ్యని పెంచుకోడానికే కాలాన్ని వెచ్చించాడు! కాస్త నాటకానుభవం వుంటే మంచిదిగదా అని సలహా యిచ్చినవాళ్లని చీదరించుకున్నాడు. నాటకాలు వేయడంవల్ల, ఫిలిమ్ ఇనిస్టిట్యూ టుల్లో శిక్షణ పొందినవారు సినిమారం గంలో ఎలా రాణించారో వాళ్ళు వుదాహర ణలు చెప్తే, ఏ అనుభవం లేకుండా రాణింపు కొచ్చిన వారిపేర్లు యితను చెప్పేడు, "ఎటొచ్చీ 'సుడి' అంటూ తిరగాలి గాని సినిమారంగంలో రాణించడం ఓ పెద్ద పనా?" అంటూ హేళనగా మాట్లాడాడు.

ఇలా అతను 'సుడి' అనబడే అదృష్టం ఎక్కడుందాని, దాని ఎడ్రస్‌కోసం వెదుకు తున్న సమయంలోనే చంద్రన్ పరిచయమ యేడు!

బి.ఆర్. చంద్రన్... చాలామంది జనానికి, సినిమా ఫీల్డుమీద ఇంట్రెష్టుతో సినిమా పత్రికలు చదివేవారికి చాలా బాగా తెలిసిన పేరే! అతనెంత బాగా తెలుసో, అతను స్థాపించిన "విశ్వ కళావైభవం" అనే సాంస్కృతిక సంస్థ గురించి గూడా అంత బాగా తెలుసు! సత్యనారాయణస్వామి దేవా లయం ఎక్కడుందీ? అని అడిగితే, అన్నవ రంలో వుందని చెప్పలేని వాళ్ళు, అమరావతి అనే వూరు ఆంధ్రాలో గూడా ఒకటుందని తెలియని వాళ్ళు గూడా- "విశ్వకళావైభవం" ఎక్కడ వుందని అడిగితే, హైదరాబాద్‌లో వుందని ఠకీమని చెప్పెయ్యగలరు! ప్రతీ ఏటా భారీ ఎత్తున సినిమా ఫంక్షన్స్ నిర్వ హించడం, దానికి భారీ సినిమా మనుషుల్ని భారీ రాజకీయ ప్రముఖుల్ని ఆహ్వానించడం వల్ల ఆ భారీ సంస్థ పేరు అందరికీ భారీగానే తెలుసు! అటువంటి ప్రముఖుల సమక్షంలో సినిమా అవార్డుల కమిటీ ఎంపి కచేసిన నటీనటులకి అవార్డులు యిస్తారు. రాష్ట్రప్రభుత్వం చేత నంది అవార్డులు అందుకోవడంకంటే, విశ్వకళావైభవం వారిచ్చే అవార్డు అందుకోవడమే గొప్పగా, ఓ ఘనతగా భావించేస్థాయికి పాపులారిటీని సంపాదించుకుంది!

★ ★ ★

ఆ సంస్థవారు దేన్ని ఉత్తమచిత్రంగా ఎవర్ని ఉత్తమనటుడిగా, ఎవర్ని హాస్యనటు డిగా... ఇలా ఎవరెవర్ని ఏయే అవార్డులకి ఎంపిక చేస్తారో ఎవరికీ తెలియదు. అసలా సంస్థకి "సెలక్షన్ కమిటీ" అంటూ ఒకటి వుందా? అని అడిగేవారు కొందరైతే "ఛీ! దానికో సెలక్షన్ కమిటీయా? పాడా? దానికి కర్త, కర్మ, క్రియ అన్నీ ఆ చంద్రన్ గాడే! వాడు చేసేదంతా మాయే! అసలు వాడి పేరే మాయ! వాడి పేరు బి.ఆర్. చంద్రన్ అనగానే, వాడేదో అరవ్వాడని అందరూ అనుకొంటారు. వాడి అసలు పేరు బొచ్చెల రామచంద్రన్న. ఎవరో షావు కార్ని పట్టుకుని, డైరక్టుగా డైరక్టరు అవబో యాడు. కానీ ఆ ప్రొడ్యూసరుగారి మర దల్తో సరసాలు ఆడబోతే వీణ్ణి తన్ని తగిలే శారు. దాంతో వీడు హైదరాబాదొచ్చి "బి.ఆర్. చంద్రన్‌గా మారిపోయి, ఈ అవార్డు సంస్థ పెట్టేడు. సంవత్సరం అంతా పెద్ద పెద్దోళ్ల దగ్గర చందాలు దండడం, ఆ తర్వాత అవార్డుల ఫంక్షన్ పెట్టడం ఇదే వాడి పని. అర్హతల్ని బట్టి వీడు అవార్డులు ఇవ్వడు. వీడికి ఎవరు డబ్బు యిస్తే వాడికే




అవార్డు ఇస్తాడు. పబ్లిసిటీ కోరుకునేవాళ్ళ వీడికి డబ్బిచ్చి అవార్డులు కొనేసుకుంటారు. సన్మానాలు చేయించుకుందామనుకునేవాళ్ళ దానికి రేటు ఇచ్చేసి సన్మానాలు చేయించేసు కుంటారు. ఒకవిధంగా చెప్పాలంటే, తిరుపతి దేవస్థానానికీ, ఈ సంస్థకీ తేడా ఏంలేదు. గుండు గియ్యడానికి ఇంత, దేవుడి కల్యాణానికి ఇంత, ప్రత్యేక దర్శనానికింతా అని రేట్లు పెట్టినట్లు పెట్టేశాడు" అంటూ విమర్శించేవాళ్ళ విమర్శిస్తూనే వున్నారు. ఆ సంస్థ రోజురోజుకీ పెరిగిపోతూనే వుంది.

ఈ సంస్థని పొగుడుతున్న ఒకానొక గొప్ప సినిమా కవిగారు మాట్లాడిన మాటల్లో కొన్ని బంగారు వాక్యాల్ని ఏరి, ప్రతి ఏటా వేయించే ఆహ్వాన పత్రికల్లో వేయించనారంభించాడు చంద్రన్. ఆ బంగారు వాక్యాలు ఏవిటయ్యా అంటే-

"యావత్ప్రపంచానికీ ఒకేఒక్క నయాగరా! యావత్ ఆసియాఖండానికి ఒకేఒక్క హిమాలయం! యావత్ భారతానికీ ఒకే ఒక్క తాజ్ మహల్! యావత్ ఆంధ్రదేశానికీ ఒకేఒక్క విశ్వకళామయి సంస్థ! భారత స్వాతంత్ర్యం గురించి చెప్పేటప్పుడు గాంధీ గురించి చెప్పకపోయినా, ప్రత్యేకాంధ్ర రాష్ట్రం గురించి చెప్పేటప్పుడు పొట్టిశ్రీరాములు గురించి చెప్పకపోయినా చరిత్ర నన్ను క్షమిస్తుందేమోగాని 'విశ్వకళావైభవం' సంస్థ గురించి చెప్పేటప్పుడు దానికి, రంగు, రుచి, వాసన కల్పించి, కర్త, కర్మ, క్రియగా మారిన బి.ఆర్.చంద్రన్ గురించి చెప్పకపోతే ఆంధ్రదేశం నన్ను క్షమించదు. నటరాజు అంతకంటే క్షమించడు"

అదిగో అలా కీర్తించబడుతున్న చంద్రన్ గారిని వరదరాజులు కలుసుకున్నాడు. కల్సుకున్నాక తనకి సినిమా హీరో అవ్వాలనే ఉద్దేశం వున్నట్టుగా తెలియజేశాడు.

"నేను పేరులోకొచ్చిన సిన్మాస్టార్స్ని మరింత పైకి తీసుకురావడానికి పనికొస్తానేమోగాని, ఏ పేరూలేని వారిని ఎగదోయడానికి పనికిరాను. పాప్యులారిటీ వున్న వాళ్ళకి అవార్డులిస్తాను. వాళ్ళ నాకు పారితోషికంగా ఎంతో కొంత ఇస్తారు. ఆ సభలకి పదవుల్లో వున్న మినిస్టర్లని ముఖ్యఅతిథులుగా పిలుస్తాను. అందువల్ల నాకు రూపాయి కూడా ఆదాయం ఉండదు. కానీ వాళ్ళు రావడం వల్ల కాణీ కూడా ఖర్చుండదు. వారి పలుకుబడుల మీద పనులు జరిగిపోతాయ్. నీకేదైనా ఉద్యోగం కావాలంటే చెప్పు వేయించేస్తాను. దాని రేటు, ఆ కమామీషు వివరంగా మాట్లాడుకుందాం" అన్నాడు చంద్రన్ నిర్మొహమాటంగా. కానీ వరదరాజులుకి ఉద్యోగం చెయ్యాలని లేదు. ఉద్యోగం అనేది సినిమా హీరోలు అవలేని చవటలు చేసేపని అని ఏనాడో తీర్మానించేసుకోవడంవల్ల 'నాకు సినిమా హీరో ఉద్యోగం తప్ప మరో ఉద్యోగం అక్కర్లేదు' అని చెప్పేశాడు.

చంద్రన్ వరదరాజుల్ని పరీక్షగా ఒకటికి నాలుగుసార్లు ఎగాదిగా చూశాడు. బహుశా తను ఏటైపు హీరో వేషానికి పనికొస్తాడో నని పరీక్షిస్తున్నాడనుకున్నాడు. కానీ, చంద్రన్ చేసిన పరిశీలన వేరు. కొన్నాళ్ళ పాటు తన వెంట తిరగమన్నాడు చంద్రన్. అలాగే తిరిగాడు. ఒకానొక సందర్భంలో వరదరాజుల్ని పిల్చి ఓ ఎయిర్ బేగ్ అందించి "దిల్ కుష్ గెస్ట్‌హౌస్‌లో మన సంస్థ రాజపోషకుడు నెల్లూరు రెడ్డిగారున్నారు. ఈ సంచిలో మూడు స్కాచ్‌బోటిల్సున్నాయ్. వీటిని అతనికిచ్చెయ్. అతను, అతని ఫ్రెండ్సూ తాగగా మిగిలితే అతను నీకో పెగ్గు ఇస్తే గిస్తే నువ్వూ తాగు. అంతే తప్ప నీ అంత నువ్వు తాగకూ' అన్నాడు. వరదరాజులు ఎటువంటి ఫీలింగ్సూ పెట్టుకోకుండా, ఆ బేగ్ తీసుకెళ్ళి అందించాడు.. వాళ్ళూ అతనికో మూడు పెగ్గులిస్తే తాగేడు. మరో రెండునెల్ల తర్వాత, ఓ మునిమాపు వేళ, వరదరాజులుని చంద్రన్ పిల్చి "సాయి



సుధ గెస్టుహౌసులో ఒంగోలు వెంకటరాజు గారు దిగేరు. ఆయన మందు ఆయనే తెచ్చుకుంటాడు కాబట్టి మనమేం సప్లయ్ చెయ్యక్కర్లేదు. సుధామయీ గెస్టుహౌసులో వకుళశ్రీ అనే సినిమా స్టారున్నది. అది చాలా సినిమాల్లో క్లబ్‌డేన్సులు చేసిందే కాబట్టి నీకూ తెలిసేవుంటుంది" అన్నాడు.

"పేరు తెల్సు, ఆవిడ ముఖం తెల్సుగాని పరిచయం మాత్రం లేదు" అన్నాడు వరద రాజులు.

ఆ క్షణంలో చంద్రన్ పురమాయిస్తున్న పని ఏమిటో అతనికి తెల్సింది కాదు.

"పరిచయం లేకపోతే, ఇప్పుడు పరిచయం అవుతుందిలే. దానికి నేను ఫోన్ చేసి చెప్తేను. నువ్వు ముందు దాని గెస్టు హౌస్‌కెళ్లి దాన్ని కారులో ఎక్కించుకుని, రాజుగారి గెస్టుహౌసులో దింపెయ్. దింపెయ్యగానే నీ పని అయిపోయిందనుకోకు. ఆ పక్కనే ఓ ఔట్‌హౌసుంది. అందులో నువ్వు రాత్రంతా వుండి, తెల్లారుగట్ట నాలుగుగంటలకల్లా దాన్ని మళ్లీ కారు ఎక్కించి, దాని గెస్టహౌసులో దాన్ని దింపెయ్"

చంద్రన్ చెయ్యమన్న పని ఏమిటో అర్థం కానంత అమాయకుడు కాదు వరదరాజులు. తను ఆశించింది- సినిమా హీరో వేషం. ఇప్పుడు చెయ్యమంటున్నది బ్రోకర్ పని.

వరదరాజులు పడుతున్న సంశయాన్ని చంద్రం సులభంగానే గ్రహించి చిన్నగా నవ్వి, అతని భుజం తట్టాడు.

"తిరుపతి కొండమీదకి కొందరు కాలినడకన వెళ్తారు. మరికొందరు బస్సులమీద వెళ్తారు. ఇంకొందరు కారుల్లో వెళ్తారు. ఎవరెలా వెళ్లినా అందరూ దైవదర్శనానికేగదా. నువ్వు సినిమా హీరో అవ్వాలనుకున్నావు. వెంకటరాజుగారు పెద్ద ఫిలిమ్ డిస్ట్రిబ్యూటరు. అప్పుడప్పుడు సినిమాలు కూడా తీస్తుంటాడు. త్వరలోనే ఓ సినిమా తీసే ప్లాన్‌లో ఉన్నాడు. నీకు డైరక్టుగా హీరో వేషం కాకపోయినా, ఏదైనా సైడ్ కేరక్టరయినా ఇవ్వాలంటే నువ్వు అతనికి టచ్‌లో వుండాలిగా. ఎంతమంది హీరోలు సైడ్ హీరో వేషాలు, విలన్ వేషాలూ వేసి హీరోలు అవలేదంటావ్... మరేం ఫర్వాలేదులే. వెళ్లు" అన్నాడు.

చంద్రన్ ఏవిటో, అతనీ స్థాయికి రావడానికి ఎక్కిన మెట్లు ఎలాంటివో వరదరాజులుకి అర్థమైంది. నాలుగైదుసార్లు ఇలాంటి పనులకే అతన్ని పురమాయించడంతో అతన్లో ఓ ఆలోచన ఆరంభమయింది. అది చంద్రన్ చేసే పనుల్లోని మంచి చెడ్డల గురించి కాదు. అతను చేసే మంచిపనులంటూ ఏవీ లేవు. చేసేదల్లా చెడ్డపనే. కానీ, దానివల్లే అతనికి రాబడి, పలుకుబడి పెరుగుతున్నాయి. ఏ దారిలో నాలుగు డబ్బులు, కీర్తి, ప్రతిష్ట వస్తే అదే మంచిదారిగా చెలామణీ అవుతోందని అతనికీ తెలుసు. ఇలాంటి చెడ్డపనులవల్ల ఎవడో చంద్రన్‌గాడికి మేలు జరుగుతున్నప్పుడు, ఆ చెడ్డపనులు ఇతరులకి చేసే బదులు, తనే చెడ్డవాడిగా మారి, చెడ్డపనులు చేసి, మంచివాడిగా ప్రజలచేత గుర్తించబడొచ్చుగా.

ఈ ఆలోచన రాగానే అతను స్వయంకృషిమీద సినిమా వేషాలు సంపాదించడానికి మద్రాసు బండెక్కాడు. అక్కడ కొన్ని అనుభవాల్ని చవిచూశాక, చేత్తో అందంగా, మెత్తగా వుండే ఓ గేలాన్ని పట్టుకొచ్చి గిర గిరమంటూ తిప్పి తిప్పి విసిరితే, ఆ గేలానికి తగిలిన వ్యక్తే, కిరణ్మయి.

కిరణ్మయి నాటకాలమీద అభిలాషతో నటిగా మారలేదు. తను నటిగా మారుతాననిగాని, పరిస్థితులు తనని నటిగా మారుస్తాయనిగాని, నటిగా మారి, తనే ఇంటిని పోషించాల్సి వుంటుందనిగాని ఆమె ఏనాడూ వూహించలేదు.

ఆమె ఎనిమిది, తొమ్మిదేళ్ల ప్రాయంలో వున్నప్పుడు ఆమె తండ్రి స్నేహితుడు జగన్నాథరావు ఆ ఇంటికొచ్చేడు. అతనికి కొద్దో




గొప్పో నాటకానుభవం వుంది. కాఫీ ఇస్తున్న కిరణ్మయిని పరిశీలనగా చూసి "అమ్మాయి చేత నాటకాలు వేయించకూడదూ? కను, ముక్కుతీరు చాలా బాగుంది. మరి కాస్త వయసొస్తే అమ్మాయి అందం చూడ్డానికి రెండు కళ్లూ చాలేటా లేవు" అన్నాడు.

నాటకాలమీదగాని, మరో కళమీదగాని ఎటువంటి అభిప్రాయమూ లేని అప్పలరాజు అదేదో అప్రస్తుతమైన మాటలా భావించి, నవ్వేసి వూరుకున్నాడు. సరోజమ్మ కూడా చిన్నగా నవ్వేసి వూరుకుందిగాని, ఆ మాట గురించి పెద్దగా ఆలోచించలేదు.

అప్పటికి కిరణ్మయి ఇల్లు సూర్యుళ్లా కాకపోయినా, అనేక నక్షత్రాల్లో ఓ నక్షత్రంలా వెలుగుతూ వుంది. అంటే ఆవిడ తండ్రి అప్పలరాజు అప్పటికింకా రెండో ఆవిణ్ణి వుంచుకోలేదు. అందరూ ఆనందంగా, నవ్వుతూ కాలం గడిపేస్తున్న మధురమైన రోజులవి. అప్పట్లో అప్పలరాజు అప్పుడప్పుడు తాగుతుండేవాడు తప్ప, తాగుడు అతన్ని మింగెయ్యలేదు. పగలంతా ఎక్కడెక్కడ తిరిగినా, రాత్రయ్యేసరికి ఇంటికి చేరుకునేవాడు. ఏదో చిన్న ఉద్యోగం చేస్తూ జీతమంతా ఇంటికిచ్చేవాడు. ఇచ్చింతర్వాతనే, సారాదుకాణం బాకీ ఇంతని, కిళ్లీదుకాణం ఖాతా ఇంతని, క్లియర్‌గా భార్యకి లెక్కలు చెప్పేవాడు. ఆ బాకీలు జమకట్టడానికి భార్యని అడిగే డబ్బు తీస్కునేవాడు.

సూర్యచంద్రుల్లాంటి పెద్ద గ్రహాలకి తప్ప, మిణుకుమిణుకుమనే చిన్న చిన్న నక్షత్రాలకి గ్రహణం పట్టదు. అయితే అది అంతరిక్షంలో వుండే గ్రహాల పరిస్థితి... కానీ భూలోకంలో చిన్న చిన్న నక్షత్రాలకే తప్ప పెద్ద గ్రహాలకి గ్రహణం పట్టదు. చిన్న నక్షత్రంలా చిరుకాంతితో వెలుగుతున్న కిరణ్మయి కుటుంబానికి గ్రహణం పట్టింది. ఆ కుటుంబంమీద కాలం కన్నెర్ర జేసింది.

కోటవీధిలో రాజేశ్వరి అనే ఆవిణ్ణి వుంచుకుని అక్కడే ఇల్లు తీసిపెట్టాడు అప్పలరాజు. రాత్రిళ్లు పడకదగ్గర్నించి నెలజీతం అందుకునే చేతుల వరకు అన్నీ మారేయి. దాంతో ఆ సంసారశకటం సమస్యలనే గతుకులపుంత తొక్కింది.

చేతిలో డబ్బు ఆడడంలేదు. డబ్బు లేదు కదాని, కడుపులో ఆకలి పుట్టడం మానదు. అప్పలరాజు ప్రవర్తనలో మార్పు తేవడానికి, ఓ నెలరోజులపాటు తీవ్రంగా ప్రయత్నించాక, ఓ వారంపాటు అర్థాకలితో బాధలు పడ్డాక, కిరణ్మయిని తీసుకుని సరోజమ్మ, జగన్నాధరావు ఇంటికి వెళ్ళింది.!

అతనే, గతంలో ఓసారి కిరణ్మయిచేత నాటకాలు వేయిస్తే బావుణ్నని చెప్పింది. ఆనాడు నాటకాల గురించి చెప్పినప్పుడు, ఔననిగాని, కాదనిగాని చెప్పని సరోజమ్మ, ఈనాడు కూతుర్ని స్వయంగా తీసుకొచ్చి నాటకాలు వేయించమనడం అతనికి కాస్త ఆశ్చర్యం కలిగించింది. సరోజమ్మ అంతరాత్మకి విరుద్ధమైన పని ఏదో చేస్తున్నట్టుగా చేస్తూ- "దీనికి అందం వుందనీ కాదు. ఇదేదో బాగా నటించగలదనీ కాదు, మాకు డబ్బు అవసరం వుండి, దీన్ని నాటకాల్లోకి దింపుతున్నాను..." అంటూ ఆవిడ తన కుటుంబ పరిస్థితిని వివరించింది.

జగన్నాధరావుకి ఆ ఇంటి విషయం తెల్సినా, సరోజమ్మ నోటంట వినేసరికి, అతని హృదయం ద్రవించింది. కిరణ్మయి తలమీద చెయ్యివేసి నిమురుతూ సిన్సియర్‌గా, సరోజమ్మతో అన్నాడు. "చూడమ్మా! ఈ లలితకళలనేవి పులుముకుంటే వచ్చేవి కాదు. వారసత్వంగా కూడా వస్తాయనే నమ్మకంలేదు. అవి జన్మతః రావాలి. సాధనతో పెరగాలి. ఎందుకో నీ కూతురు చాలా మంచి నటి అవుతుందనే నమ్మకం నాకు కలుగుతోంది" అన్నాడు. సరోజమ్మ కిరణ్మయిచేత అతనికి పాదాభివందనం చేయించింది.



జగన్నాథరావు కిరణ్మయిచేత కొన్ని డ్రామాల్లోని డైలాగులు చెప్పించాడు. కానీ, అతను డైలాగులు చెప్పే విధానం చాలా కృతకంగా వున్నట్టుగా కిరణ్మయికి అనిపించింది. అతను బాగా చెప్పడంలేదా? అని అడిగితే, "లేదు" అని చెప్పలేకపోయినా బాగున్నాయి అని మాత్రం చెప్పలేకపోయేది. ఎలా వున్నాయి? అని అడిగితే ఫలానావిధంగా వున్నాయని వాటికి పేరు పెట్టలేని వయసు. అతను ఎక్కువగా పౌరాణికాలు వేయడంవల్ల సాంఘిక నాటకాల్లోని డైలాగులు కూడా అలాగే చెప్తున్నాడు. కిరణ్మయి చేత చెప్పిస్తున్నాడు.

అతను తనకి 'నటన' అనేదాన్ని ప్రప్రథమంగా నేర్పిన గురువు? అతను చెప్పే విధానం బాగులేదని చెప్పే సాహసం లేకపోయినా, చివరికి తెగించి 'మేష్టారూ ఆ డైలాగ్‌ని ఇలా చెప్తే బాగుంటుందేమో' అని మాత్రం ఓరోజు అనగలిగింది.

అన్నదేగాని, అతను చాచికొడతాడేమోనని లోలోపల భయపడుతూనే వుంది. కానీ, అతను కోప్పడలేదు. కొట్టలేదు. కనీసం కన్నెర్ర చెయ్యకుండా 'సరే, చెప్పు' అన్నాడు.

కిరణ్మయి చెప్పింది. ఒకే వాక్యాన్ని ఒక్క అక్షరం కూడా మార్చకుండా వివిధ మాడ్యులేషన్స్‌తో నాలుగు విధాలుగా చెప్పింది. నాలుగింటికీ నాలుగు అర్థాలు వచ్చాయి. ఆ అమ్మాయి చూపించిన ప్రతిభ అయితే జగన్నాథరావు చుట్టూ వున్న శిష్యులకి నచ్చింది. చప్పట్లు కొట్టబోయి గురువుగారు కోప్పడతారేమోనని కొట్టకుండా తమాయించుకున్నారు.

జగన్నాథరావు జేబులోనించి సిగరెట్ తీసి వెలిగించి, కిరణ్మయిని చూస్తూ పొగ వదిలాడు. నాలుగుదమ్ములు లాగేక, "నువ్వింక ఇంటికెళ్లిపో. రేపు కబురు చేస్తాను" అన్నాడు.

కిరణ్మయి వెళ్ళిపోయింది.

కిరణ్మయికి ఈ రోజుతో ఉద్వాసన పలికేసినట్టే అనుకున్నారు శిష్యులు. కానీ జగన్నాథరావు శూన్యంలోకి చూస్తూ మెల్లగా గొణిగాడు.

"కళాకారుల్లో రెండురకాల వారున్నారని నాకిప్పుడే తెల్సిందయ్యా! చాలాకాలంనించి నటించేవారు ఒక వర్గం అయితే, చాలా బాగా నటించేవారు మరొక రకం. పార్వతి రెండోవర్గానికి చెందుతుంది. మనం ముప్ఫైఐదు సంవత్సరాల్నించి నాటకాలు వేస్తున్నాం. ఫలానావారు మా గురువులనో, పేరులోకొచ్చిన ఫలానావాడు మా శిష్యుడనో చెప్పుకుంటున్నాం. అంటే, పేరు తెచ్చుకున్నవారి పేరుని మనం అడ్డం పెట్టుకుని బతికేస్తున్నాం. చెట్టు పేరు చెప్పి కాయలమ్ముతారనే సామెత బహుశా మనకీ వర్తిస్తుందేమో. మనం ఎన్ని సంవత్సరాల్నించి నాటకాలు వేసినా, మన సీనియార్టీని సంవత్సరాల్లో చెప్పుకుంటూ మురిసిపోతున్నాం. మనలో చాలా విద్య వుందని అనుకుంటూ, గురువులుగా మారిపోయి, ఇతరులకు బోధించేస్తున్నాం... కానీ, పార్వతికి ఏం సీనియార్టీ వుంది? అసలా అమ్మాయి వయసెంత? నాటకరంగం గురించి ఆ అమ్మాయికేం తెలుసు? కానీ, మనం ఇచ్చిన ఒక్క వాక్యంలో నాలుగు మాటలుంటే, అందులో ఒక్కొక్క మాటని ఒక్కోవిధంగా విరిచి ఒక్కో అర్థాన్ని సృష్టించింది. మనం అదే నాటకాన్ని పదేళ్లనించి వేస్తున్నాం. కానీ నాకిన్నాళ్లూ ఆ అయిడియాయే తట్టలేదు. లేదు లేదు. ఆ అమ్మాయికి నేను గురువుననిపించుకోలేను. నేనా నటీమణిని రంగస్థలానికి అందించే ఓ పోస్ట్‌మేన్‌లాంటి వాణ్ణి. ఆ బొమ్మని నలుగురికీ చూపించే ప్రయోక్తనవుతానుగాని, ఆ బొమ్మని చెక్కే శిల్పిని కాలేను. నీలాకాశంలో నిగనిగలాడే ఇంద్రధనుస్సుకి ఎవరూ రంగులు వేయనక్కర్లేనట్టే ఈ అమ్మాయిలోని నటనా పాటవాన్ని ఎవరూ తీర్చిదిద్దక్కర్లేదు. ఈమె




సహజనటి..." అంటూ అతను అప్రయత్నంగానే చాలాసేపు అభినందించాడు.

అతని నోటి దీవెన ఫలించింది. అతని గ్రూపుతో నాటకాలు వేస్తూనే యవ్వనవతి అయింది. మరోవైపు నాట్యం నేర్చుకుంటూ నర్తకి అయింది. తొలి పరిషత్తులోనే, ద్వితీయ ఉత్తమనటిగా బహుమతి పొంది నాటకరంగంలో జైత్రయాత్ర ఆరంభించింది. తర్వాత తర్వాత "ఆవిడ మా నాటకంలో వుంటే మాకు బెస్టు ప్రొడక్షన్ రావడం గ్యారంటీ అనుకునే నటులు, ఆవిడ పరిషత్తుకొస్తే మాకు ఉత్తమనటి అవార్డు రాకపోవడం, డబల్ గ్యారంటీ అని నటీమణులు అనుకునే పరిస్థితి ఏర్పడింది. మీరు ఎన్ని పరిషత్తుల్లో పాల్గొని ఉత్తమనటీమణి బహుమతి పొందారని అడగడమంత సిల్లీ క్వశ్చన్ మరొకటి వుండదు కాబట్టి మీరు ఏ పరిషత్తులో ఉత్తమనటి బహుమతి పొందలేదో చెబితే మేం పత్రికల్లో రాస్కోడానికి ఈజీగా వుంటుందని జోకులు వేసే పత్రికా జర్నలిస్టులు తయారయ్యేరు.

ఆమె నటజీవితం ఏ ముహూర్తంలో ఆరంభమయిందోగాని, వారానికి రెండు మూడు నాటకాల చొప్పున వచ్చాయి. విశాఖపట్టణం సాంస్కృతికరంగానికి తలమానికమైన నగరం కాబట్టి, అక్కడ నాటక ప్రదర్శనలూ ఎక్కువే. నాటక సమాజాలూ ఎక్కువే. పరిషత్తులకెళ్ళి తమ ప్రజ్ఞాపాటవాలను చూపించాలనే తపన ఆ వూరి కళాకారులకి ఎక్కువే. అందువల్ల ఇటు అందానికి అందం, అటు నటనకి నటన వున్న కిరణ్మయి ఊపిరి తిరగనంత బిజీనటి అయిపోయింది. ఆ వూళ్లో వున్న నాటక సమాజాల వారితో, ఆంధ్ర, ఆంధ్రేతర ప్రాంతాల్లో నాటకాలు వేయడంతోపాటు, అటు బిలాస్‌పూర్ ఇటు బొంబాయి, మద్రాసు వగైరా రాష్ట్రాల్లోని ప్రవాసాంధ్రులు వేసే నాటకాలకి ఆమెనే బుక్ చెయ్యడం ఆరంభించారు. అటు పేరుకి పేరు, ఇటు డబ్బుకి డబ్బు. "కిరణ్మయికి ఎంత ఆదాయం వస్తోందో?" అంటూ సరదాగా లెక్కలు కట్టేవాళ్లూ తయారయ్యారు. కానీ వాస్తవంలో కొస్తే కిరణ్మయి సంపాదించిన కీర్తికీ, ఆవిడ కూడేసిన డబ్బుకీ ఎక్కడా పొంతన లేకుండాపోయింది. ఆవిడకంటే తక్కువ డిమాండ్‌లో వున్న నటీమణులే సొంతంగా చిన్న చిన్న ఇళ్లు కట్టుకున్నారు. అలాంటిది కిరణ్మయికొచ్చే ఆదాయానికి ఓ మేడ కొనొచ్చు కానీ... "కానీ దక్షత లేని ఇంటికి పది లక్షలు వచ్చినా సరిపోవు" అని పెద్దలు చెప్పే సామెతకి ఆవిడ ఇల్లొక ఉదాహరణయింది. "కుంచాలమ్మ కూడదీస్తే, మంచాలమ్మ మాయం చేసిందనే" సామెతని నిరూపించడానికి ఆమె తండ్రి అప్పలరాజు తయారయ్యాడు.

ఆ ఇంట్లో తెచ్చే చెయ్యి ఒకటైతే తినే చేతులు మూడు. ఇది చిన్న సమస్యే! కానీ ఆవిడ తండ్రిది తినే నోరు కావడంతోపాటు తాగే నోరు కూడా కావడంవల్ల అతనూ కొన్ని అలవాట్లు మార్చుకున్నాడు. సారా మానేసి బ్రాందీ తాగుతున్నాడు. మామూలు సిగరెట్లు మానేసి షిప్పుల్లో నించి దిగుమతయ్యే దొరలే కాల్చే సిగరెట్లు కాల్చనారంభించాడు. అంతేకాదు, అంతవరకు తన రెండవ భార్యకి పదులు, యాభైలు చొప్పున ఇచ్చేవాడు, ఇప్పుడు వందల్లో ఇవ్వడం ఆరంభించాడు. వీటన్నింటికి మూలధనం కిరణ్మయి నాటకాలు వేసి సంపాదిస్తున్న కిరాయే!

అందువల్ల కన్నం వున్న కుండలో ఎన్ని నీళ్లు పోసినా నిండనట్టు, ఆమె ఎంత సంపాదించినా, ఖర్చులకి తప్ప నిలవ చెయ్యడానికంటూ ఏమీ మిగల్లేదు. ఆమె జీవితం గోదావరి ఈత, లంకమేతలా తయారయింది. ఉదయంనించి రాత్రివరకు మూడు నాలుగు కంపెనీలలో నాటకాలు రిహార్సల్స్ చేసొచ్చి అలిసిపోయిన కిర

ణ్మాయికి ఇంటికి రాగానే సరోజమ్మ ఏడుస్తూ, ఆవిడ భర్త పట్టుకుపోయిన డబ్బుల గురించి చెప్తుంటే ఆవిడకి మన శ్శాంతి కరువయ్యేది. శరీరం అలిసిపోయినా, ఇంటిని గురించిన ఆలోచనలు ఆవిడకి నిద్రపట్టనిచ్చేవి కాదు. ఆమెకు, విశ్రాంతి అనే మాటకి ఎంతో దూరం ఏర్పడింది.

★ ★ ★

చాలా వ్యాపారాలకి, బిజినెస్ ఎక్కువగా వుండే సీజన్, బిజినెస్ డీల్ అయ్యే సీజన్ అంటూ వుంటాయి. ఇలాంటి సీజన్‌లు వ్యాపారాలకే కాదు, కిరణ్మయిలాంటి కిరాయి నటీమణులకీ వుంటాయి. ముఖ్యంగా వర్షాకాలంలో అట్టే నాటకాలు వుండవు. పరిషత్తులు కూడా మండువేసవిలోనే ఎక్కువగా నిర్వహిస్తారు. ఆంధ్ర రాష్ట్రంలో నాటకం వెయ్యడానికి సరైన వసతులున్న థియేటర్లు తక్కువ. అందులోనూ ఇన్‌డోర్ థియేటర్లు మరీ తక్కువ. ఓపెన్ ఎయిర్ థియేటర్సే ఎక్కువ. పరిషత్తులయినా మామూలు ప్రదర్శనలు అయినా అక్కడే ఎక్కువగా జరుగుతాయి. అంచేత వర్షాకాలంలో అలాంటి కార్యక్రమాల్ని పెట్టుకోవడానికి సాహసించరు. ఈ సీజన్‌లో వృత్తి కళాకారిణుల ఆదాయం తగ్గుతుంది. ఈ రెండు మూడు నెలలూ ఇంటద్దె కట్టడం దగ్గర్నించి, భోజనం, ఇతర ఖర్చులు కూడా సమస్యలుగానే తయారవుతాయి. మునుపు సంపాదించుకున్న దాంట్లోనించి, కొద్దో గొప్పో దాచుకుంటే తప్ప ఇలాంటి క్లిష్టపరిస్థితిని నెట్టుకురావడం కష్టం. ఆదాయమూ తగ్గి, దాచుకున్నదీ లేనప్పుడు, అప్పులు చెయ్యడం మినహా మరో మార్గంలేదు. అల్లిపురంలో వుంటున్న సన్యాసమ్మ వడ్డీ వ్యాపారం చేస్తోంది. బంగారం వస్తువు తనఖా పెడితే నూటికి మూడు రూపాయలు తనఖా లేకుండా అయితే అయిదు రూపాయలు వడ్డీ చొప్పున ఆవిడ వ్యాపారం చేస్తోంది. కిరణ్మయి చాలాసార్లు ఆవిడ దగ్గర అప్పు తీస్కున్నా కిరణ్మయి వేసిన నాటకాలు చాలాసార్లు చూసినా, "నా తల్లే ఎంత బాగా ఏక్టింగ్ చేసినావే, నీ ముందు సినిమా యాక్టర్లంతా బలాదూరే" అంటూ చాలాసార్లు పొగిడినా, అప్పు ఇవ్వడానికి మాత్రం, తన పద్ధతుల్నే అనుసరిస్తుంది తప్ప, ఒక్క పైసా కూడా వెసులుబాటు చెయ్యదు సన్యాసమ్మ. తనఖా పెట్టడానికి బంగారం వస్తువులేవీ లేవు. కాబట్టి అయిదు రూపాయల వడ్డీకే అప్పు తెచ్చి ఈ సీజన్లో గడుపుకొచ్చేది. మళ్లీ నాటకాల సీజన్‌వరకు ఆగి, వచ్చిన డబ్బులో అద్దె కట్టి, మిగిలిందాంట్లో రేషన్ సామాన్లు కొన్నా కొనకపోయినా ఠంచన్‌గా వడ్డీ డబ్బులు చెల్లించేది. అలా చెల్లించినప్పుడల్లా కిరణ్మయి కళ్ళకి నీళ్ళొచ్చేవి. ఇలా కాదని చెప్పి వర్షాకాలంలో ఉపయోగపడ్డానికి మామూలప్పుడు తెచ్చే ప్రతీ ఎమౌంట్‌లోను కొంత కొంత తీసి బీరువా అడుగు అరలో దాచడం ఆరంభించింది. అయితే, నటీమణికి కష్టాలనేవి వర్షాకాలం రూపంలోనే రానక్కర్లేదని, ఆమె తమ్ముడు కృష్ణ నిరూపించాడు. మునుపయితే తండ్రి ఒక్కడే తాగుడు కోసం డబ్బులు పట్టుకుపోయేవాడు. అతనికి పోటీగా ఇప్పుడు తమ్ముడు తయారయ్యాడు. అంటే ఇంతవరకు ఒకపక్కనించే వెలుగుతున్న కొవ్వొత్తికి ఇప్పుడు రెండోవైపు కూడా అంటించినట్టయింది.

ఆ ఇంట్లో తయారయిన ఇద్దరు ఇంటి దొంగల్లో, కృష్ణకంటే అప్పలరాజే నయమనిపించాడు. కృష్ణ చాటుగా ఇంట్లో దూరి కిరణ్మయి దాచుకున్న డబ్బులూ పట్టుకుపోతున్నాడు. డబ్బులు దొరకనప్పుడు ఆమెకి పరిషత్తుల్లో ఇచ్చిన వెండికప్పులూ పట్టుకుపోయి అమ్మేస్తున్నాడు. కిరణ్మయి అవార్డు పొందినప్పుడిచ్చిన వెండి కిరీటాన్ని అతను తాకట్టు పెట్టడానికి సిద్ధపడుతున్నప్పుడు, డబ్బు పోయినప్పటికంటే ఎక్కువ దుఃఖిం




చింది కిరణ్మయి. ఆమె తన దుఃఖాన్ని, ఆవేశాన్ని తమాయించుకోలేక చింతబరిగె తీసుకుని వాణ్ణి రక్తాలు కారేలా చావగొట్టింది. అలా కొట్టడంవల్ల అతన్లోని దుర్మార్గం, దొంగబుద్ధి చావకపోగా, అంతవరకు అక్కపట్ల వుండే కాస్త భయమూ పూర్తిగా చచ్చిపోయింది.

నాటకాలు వేసే కిరాయి నటీమణికి జ్వరం రాకూడదు. ఓ జబ్బు రాకూడదు. ఇంట్లో ఏ విషాద సంఘటనా జరగకూడదు. ఒకవేళ ఇలాంటి అవాంతరాలు ఏం వచ్చినా, నాటకాలు జరగని ఏ వర్షాకాలం లోనో, రావాలి తప్ప బిజీగా నాటకాలాడే పరిషత్తు సీజన్లో మాత్రం రాకూడదు. ఆ సీజన్లో ఔత్సాహిక కళాకారులంతా పరిషత్తులకి నాటకాలు కడతారు. దాదాపుగా ఈ కళాకారులంతా ఉద్యోగాలు చేసుకునేవాళ్లే కావడంవల్ల నాటక పరిషత్తులు కూడా ఒకే సీజన్లో పెడతారు. ఒక పరిషత్తుకి మరో పరిషత్తుకి 'క్లాష్' రాకుండా తేదీలు నిర్ణయిస్తారు. ఓ పది, పదిహేనురోజులు శెలవులు పెట్టుకుంటే, నాలుగైదు పరిషత్తుల్లో వరసగా పాల్గొనే అవకాశం వుంటుంది. అలాంటప్పుడే కిరణ్మయిలాంటి పాప్యులర్ ఆర్టిస్టులు యమబిజీగా ఉంటారు. అలా బిజీగా వుంటేనే నాలుగు డబ్బులు చేతికి వస్తాయి. ఓసారి మంచి నాటకాల సీజన్లో కిరణ్మయికి టైఫాయిడ్ జ్వరం వచ్చి మంచాన పడింది, మర్నాటినెలనించి పరిషత్తుల సీజన్ ఆరంభమవుతుంది. పరిషత్తులు ఒక్క ఊళ్లో కాక, రకరకాల వూళ్లల్లో జరుగుతాయి. ఆ సీజన్లో కిరణ్మయి నాలుగు నాటికలు, మూడు నాటకాలకి బుక్కయి, ఏడు సమాజాల్నించి, టోకెన్ ఎడ్వాన్స్‌లు తీసుకుంది. అందులో ఒకటి ఖర్గపూర్ వాళ్లది. మరొకటి బరంపురం వాళ్లది. ఒకటి సత్తెనపల్లివాళ్లది. మిగతా నాలుగూ విశాఖపట్నానికి చెందిన ట్రూపులే అయినా, అందులో ఒకటి గూడూరులో, వారం తర్వాత ఏలూర్లో, తర్వాత రెండు రోజుల వ్యవధిలో జంషెడ్‌పూరులో... అన్ని ట్రూపుల్తో రిహార్సల్సు చేయడం, స్క్రూటినీలు ఇవ్వడంకోసం ఆ వూర్నించి ఈ వూరు, ఈ వూర్నించి, ఆ వూరు తిరగడం, నిద్ర సరిగా లేకపోవడంవల్ల ఆమె ఆరోగ్యం దెబ్బతినేసింది. జ్వరం వచ్చినప్పుడు, మామూలు జ్వరమేకదాని ఆ మాత్ర మింగి, ఈ మాత్ర మింగి సొంతవైద్యంతోనే ఓ పదిరోజులు నెట్టుకొచ్చిందిగాని, పదకొండోరోజున విశాఖపట్నం సాంబమూర్తి కళామందిరంలో రిహార్సల్ చేస్తుండగా సడెన్‌గా స్పృహ తప్పి పడిపోయింది. డాక్టర్‌కి చూపిస్తే టైఫాయిడ్ అని తేల్చి నెలరోజుల దాకా మంచం దిగకుండా, విశ్రాంతి తీసుకోవాలని చెప్పాడు. పోనీ డాక్టరు చెప్పిన సలహాని పక్కనపెట్టి నాటకాలు వేద్దామన్నా, ఒంట్లోని జ్వరం కన్ను తెరవనివ్వడంలేదు, కాలు కదలనివ్వడంలేదు. దాంతో ఎన్నో నాటకాలు వదులుకోవలసివచ్చింది.

తన ముఖంమీద ఎవరూ తిట్టకపోయినా, లోలోపల వాళ్ళు బాధపడతారు కదాని మనసులో కుమిలిపోయింది. మిగతా వాళ్ళు తనని చూసి ముఖం చిట్లించి తమ చిరాకుని వ్యక్తం చేసినా, లక్ష్మణరావు అనే డ్రామా డైరెక్టరు మాత్రం తన కోపాన్ని దాచుకోకుండా అర్థంపర్థంలేని మాటలు కూడా మాట్లాడేశాడు.

"ఇలాగైతే ఎలాగమ్మా? పరిషత్తుకి ఎంట్రీ ఫీజు కట్టేశాం, స్క్రూటినీ ఇచ్చేశాం. రోజుకి వందరూపాయిలచొప్పున ఖర్చు చేసి, కాఫీలు, టిఫిన్లూ తెప్పించి రిహార్సల్సు చేయించేశాను. రైలు టిక్కెట్లు కూడా కొనేశాను. హైదరాబాదులోను, మద్రాసులో కూడా ప్రోగ్రామ్‌లు మాట్లాడేశాను. అక్కడకి చూస్తే బోలెడంత మంది సినిమావాళ్ళు వచ్చేస్తున్నారు. వాళ్ళు మన నాటకం చూసి, కనీసం నన్నూ, మరో ఇద్దరినైనా సినిమా



ల్లోకి లాగేసుకుంటారనుకున్నాం. తీరా మేం ఇంత ప్రోగ్రామ్ పెట్టేసుకుంటే, ఇప్పుడు నువ్వు జ్వరం తెచ్చేసుకుంటావ్? కొంచెం మంచీ చెడ్డా, మా నష్టం గిష్టం కూడా నువ్వు ఆలోచించాలమ్మా..." అంటూ ఏదేదో అంటూ తనని తప్పుపడుతుంటే, కిరణ్మయి ఏడవడం తప్ప మరేమీ చెయ్యలేక పోయింది. జ్వరం రావడం తన తప్పు కాదు. నెలరోజులపాటు మంచం దిగలేకపోడానికి తను కారణం కాదు... అయినా నిందలు, నిష్టూరాలు పడక తప్పలేదు!

తన నిస్సహాయతని అలావుంచితే, యీ సీజన్‌లో తనకు రావల్సిన నాలుగువేల మూడువందలు చేతికి అందకుండా పోయేయి. జ్వరం తగ్గి, పూర్తి స్వస్థత చేకూరేక, యింటి పరిస్థితిని సమీక్షించుకుంటే ఏం వుంది? ఇంటినిండా సమస్యలు, ఇంటద్దె బాకీ, నిండుకున్న రేషన్ సామాన్లు... మునుపు నాటకాలకి సీజన్ కాని పరిస్థితుల్లో చేసే అప్పు ఏదో, యిప్పుడే చెయ్యాల్సొచ్చింది! మళ్ళీ ఆమె కళ్ళముందు సమస్యల తోరణం వెర్రిగా వూగింది.

ఏమిటీ జీవితం?

కిరణ్మయి పడుకునే నిట్టూర్చింది. నాన్ స్టాప్ ట్రైన్స్ అనబడేవి కూడా మధ్యలో ఏదైనా అవాంతరం వచ్చినప్పుడు ఆగుతాయి. ఒకవేళ, అలాంటి అవాంతరాలు లేనప్పుడు గూడా, చివర్లో దాని గమ్యం దగ్గరయినా ఆగుతుంది! కానీ సమస్యలు అనబడే తన జీవితపు నాన్‌స్టాప్ ట్రైన్ మాత్రం అవాంతరాలు లేకుండా పరుగులు తీస్తూనే వుంది! ఎటొచ్చీ దానికో గమ్యం లేదు కాబట్టి అది అక్కడ కూడా ఆగకుండా ఎక్కడికో, ఎక్కడికో వెళ్తోంది.

ఓసారి ఆమె తండ్రి అప్పలరాజు కిరణ్మయికోసం ఓ సంబంధం తీసుకొచ్చేడు! అతనికో ప్రైవేటు కంపెనీలో ఉద్యోగం వుండడంతోపాటు పెద్దలు సంపాదించిన ఆస్థి కూడా ఓ మోస్తరుగా వుంది. అతను కట్నం అక్కర్లేదనడంతోపాటు, కిరణ్మయి నిచ్చి పెళ్ళిచేస్తే అప్పలరాజుకే తను పదివేలరూపాయలు ఎదురిస్తానన్నాడు. ఆ ఒక్క పాయింటుకే అతను లొంగిపోయి, పెళ్ళికొడుకుని తీసుకొచ్చేడు. ఎలుగుబంటికి తెల్ల బట్టలు వేసి తీసుకొచ్చినట్టుగా వున్నాడా పెళ్ళికొడుకు! కిరణ్మయికేదైనా మంచి సంబంధం కుదిరితే పెళ్ళి చేసెయ్యాలనే ఆలోచనలోనే వుంది సరోజమ్మ! కానీ కిరణ్మయి ఈ పెళ్లికొడుకునే కాదు ఇప్పట్లో పెళ్ళే చేస్కోనని తెగేసిచెప్పేసింది! ఆ విషయం దగ్గరే తండ్రీ కూతుళ్ళమధ్య తీవ్రమైన వాదోపవాదాలు జరిగాయి!

"నేను నాటకాలు వేసి నాలుగు డబ్బులు సంపాదిస్తుంటేనే మన బండి అంతంతమాత్రంగా నడుస్తోంది! ఇప్పుణ్ణేను నాటకాలు మానేసి, పెళ్లిచేస్కుని అత్తవారింటికి వెళ్ళిపోతే అమ్మని, తమ్ముణ్ణీ ఎవరు చూస్తారు? నీకంటే మరో భార్య వుంది. కానీ మమ్మల్ని మేం పోషించుకోడానికి నా ఆదాయం తప్ప మరో మార్గంలేదు"

కూతురి వాదనలో ధ్వనించిన నిజం సరోజమ్మని మాట్లాడనివ్వలేదు! అప్పలరాజు మాత్రం తన పెద్దరికమేదో ఫెయిలైపోతున్నట్టుగా తెగ రెచ్చిపోయేడు!

"నాటకాలు ఏసే ఆడదాన్ని పెళ్లాడ్డానికి మర్యాదస్తుడెవడూ ముందుకురాడు! ఒకవేళ వచ్చినా టెంపరరీగా వుంచుకోడానికొస్తారు తప్ప పర్మినెంటుగా కాపరం చెయ్యడానికెవడూ ఒప్పుకోడు! అలాంటిది ఈ అబ్బాయి తెగించొచ్చేడు. వచ్చి కూడా కాణీకట్నం అడగలేదు. అడక్కపోగా పెళ్ళి ఖర్చులన్నీ తనే పెట్టుకుని పది వేలు తిరిగి మనకే యిస్తానంటున్నాడు. ఇప్పుణ్ణువ్వు కాదంటే ఎలాగ? నేను నా కూతురిచేత నాటకాలాడించి బతుకుతున్నానని పదిమందీ పది రకాలుగా అంటుంటే పరువుపోయి బుర్రబాదుకుంటున్నాను. నేనీ అబ్బాయికి మాట




ఇచ్చేసేనుగాబట్టి నువ్వు అరిచి గీపెట్టినా నీ కాళ్ళు విరగ్గొట్టి నీ మెడలో తాళికట్టించే హక్కు నాకుంది"

"నా మీద నీకాహక్కు ఎందుకుంటుంది?" సూటిగా తీవ్రంగా ప్రశ్నించింది కిరణ్మయి.

"ఎందుకేటి? నేను నీ తండ్రిని కాబట్టి వుంటాదాహక్కు" చాలా ధీమాగా చెప్పేడు అప్పలరాజు!

"నువ్వు నా తండ్రివి కావు"

కిరణ్మయి మాటలకి అదిరిపడ్డాడు అప్పలరాజు!

"ఔను... నువ్వు నా తండ్రివి కావు! తండ్రి అనేవాడు భార్యా బిడ్డల్ని పోషించాలి? కానీ నువ్వు మమ్మల్ని పోషిస్తున్నావా? నా తండ్రికి నా తల్లే భార్యగా వుండాలి! కానీ- నువ్వు మా అమ్మని భార్యగా చూస్తున్నావా? నీకు మరో భార్య వుంది! అక్కడే వుంటున్నావు. నీ జీతమూ అక్కడే ఇస్తున్నావు. కాబట్టి నీకు హక్కులు, అధికారాలంటూ వుంటే అక్కడుంటాయి గాని ఇక్కడకాదు!""

అప్పలరాజు సమాధానంకోసం తడుముకుంటున్నాడు.

"నాలాంటి నాటకాలమ్మాయిని పెళ్ళాడ్డానికి ఏ మర్యాదస్తుడూ ముందుకురాడన్నావు. ఏం? నేనంత అవమానకరమైన పనేమయినా చేస్తున్నానా? ఒకవేళ ఆడపిల్ల నాటకాలు వెయ్యడమే తప్పని నువ్వనుకుంటే లేదా ఎవరైనా నీతో అలా అని వుంటే- వాళ్ళకీ నీకూ ఒక్కటే సమాధానం! నన్ను నాటకాలమ్మాయిగా మార్చింది నువ్వే"

"నేనా? నేనెప్పుడూ నిన్ను నాటకాలాడమనలేదు"

"నోటితో అనకపోయినా, నీ చేతల్తో నాకాపరిస్థితి కల్పించావు! నీమట్టుకు నువ్వు మరో ఆడదాన్ని పెట్టుకుని కాపురం చేస్తూ మా ఖర్మానికి మమ్మల్ని వదిలేశావు. అప్పుడు అమ్మా, నేనూ, తమ్ముడు పస్తులు పడ్డాం. ఇంటద్దె కట్టలేక ఇంటి ఓనరుచేత బైటికి గెంటించుకునే పరిస్థితుల్లో నేను నాటకాల్లోకి దిగేను. నలుగుర్లోనూ నాటకాలాడి మా నాలుగు వేళ్ళూ నోట్లోకెళ్లేలా చేశాను. నేను నాటకాల్లో రకరకాల మనస్తత్వాలున్న పాత్రలు పోషించానేగాని, నా ఒరిజినల్ మనస్తత్వాన్ని నేనెప్పుడూ మార్చుకోలేదే! నువ్వు పోషించాల్సిన వాళ్లని, ఆడదాన్నై వుండి నేను పోషించాను తప్పా? నువ్వు ఈ ఇంట్లో వుండడానికి నీకు సారా కావాలి, సిగరెట్లు కావాలీ, అవి కావాలీ ఇవి కావాలీ అని షరతులు పెడితే ఆ షరతుల న్నీ,ఏ డబ్బుతో తీర్చేననుకున్నావ్? ఈ నాటకాల డబ్బుతోనే! నువ్వు నీ పరువుపోయిందని బాధపడ్డానికి నేను స్టేజిమీద నాటకాలాడుతున్నాను తప్ప జీవితంలో డబ్బుకోసం ఏ నాటకాలూ ఆడ్డంలేదు! నాటకాలాడే అమ్మాయిలంతా చెడిపోతారనే నీ నమ్మకం, నీ స్నేహితుల నమ్మకం అయితే వాళ్ళతో ఒక్కమాట చెప్పు? నాటకాలాడే వాళ్ళంతా చెడిపోవాలనే రూలు లేదు. ఈ లోకంలో చెడిపోయిన ఆడవాళ్లంతా నాటకాలాడే చెడిపోలేదని చెప్పు! నాటకాన్ని నేనో పవిత్రమైన వృత్తిగా భావించాను. అలా కాకుండా ఉత్త డబ్బు సంపాదించడాన్నే ధ్యేయంగా పెట్టుకుంటే నేను నాటకాల్లో జాయినవకుండా ఏ సాని కొంపలోనో జాయినై వుండేదాన్ని"

కిరణ్మయి ఆగకుండా, ఆవేశంగా, ఆవేదనగా తన అంతరంగం అసలు స్వరూపాన్ని ఆవిష్కరించేసరికి అప్పలరాజు అవాక్కై వుండిపోయేడు! తను తప్పతాగి రెచ్చిపోతున్నప్పుడు తనని ప్రాధేయపడిన కూతుర్ని యిన్నాళ్ళూ చూశాడు. తను కొడితే, మౌనంగా ఏడ్చిన కూతుర్ని మాత్రమే చూశాడు! కానీ ఇప్పుడామె అగ్నిపర్వతం బద్దలైనట్టు బద్దలయింది! ఆమె ధోరణి గమనించి పెళ్ళి కొడుకు జారుకున్నాడు!

అది గమనించి అప్పలరాజు చాలా బాధపడ్డాడు. అందుక్కారణం కూతురికి సంబంధం కుదరలేదని కాదు, ఆ పెళ్లికొడుకు ఇస్తానన్న పదివేలూ చెయ్యిజారిపోయేయని!

ఈ సంఘటన జరిగేనాటికే వరదరాజులు కిరణ్మయికి పరిచయమయేడు! కిరణ్మయి ఎదిరింపుని అతను అభినందించాడు! కొండంత భవిష్యత్తుని ముందుపెట్టుకుని ఇప్పుడు పెళ్లి రొంపిలో దిగడమెందుకూ? అన్నాడు.

కిరణ్మయి అతని అభినందనకేమీ జవాబు చెప్పలేదు!



రంగస్థల నటీమణి ఎంత ప్రతిభావంతురాలయినా, ఎంత నీతినియమాలతోవున్నా ఆమెకు సంఘంలో గౌరవం వుండదు! ఇది వృత్తి కళాకారిణులకీ సమాజం పెట్టిన శాపం! నాటకాన్ని చూసి ఆనందించేవారు కూడా నాటకంలో నటించి, వారిని మెప్పించిన కళాకారిణిని, కేవలం పదిమంది ముందు నటించిన నటిగానే చూస్తారు తప్ప, అంతకుమించి గౌరవించరు! చాలామంది దృష్టిలో కళాకారిణి అంటే, నైతిక విలువలు కోల్పోయిన మనిషి! ఈ అభిప్రాయం ఏర్పడ్డానికి కొంతమంది నటీమణుల ప్రవర్తన కారణం కావచ్చేమోగాని, రంగువేసుకుని నటించే ప్రతీ నటి, రంగులు మార్చే నెరజాణ అన్న మాట మాత్రం నిజం కాదు! కిరణ్మయి అసాధారణమైన అందగత్తె! ఆమె అందానికి ఆకర్షించబడని మగహృదయం లేదు! అసూయపడని ఆడ మనసు లేదు! అలాంటి కిరణ్మయి వరదరాజులుతో చనువుగా వుంటుందనేసరికి విమర్శలకి కొదవేం వుంటుంది?

"వరదరాజులు కిరణ్మయిని వుంచుకున్నాడట. అందుకే అది పెళ్ళీ పెటాకులు లేకుండా, బరితెగించి మరీ వాడితో తిరుగుతోంది" అని కొందరు వ్యాఖ్యానిస్తే, "కిరణ్మయి తల్చుకుంటే పెద్దపెద్ద కోటీశ్వరులు దాన్ని వుంచుకుంటారు. కానీ ఈ వరదరాజులుగాడితో వుంటే దానికేం ఒరుగుతుంది? సిగరెట్లకి, చిల్లర ఖర్చులకీ దాన్ని అడిగి డబ్బులు తీస్కునే ఈ వరదరాజులుగాణ్ణి వుంచుకుంటే దానికే నష్టం! వూరికే దాని సరదా తీర్చుకోడానికి వాణ్ణి అట్టిపెట్టుకుంది. రేపెవడయినా గొప్పింటోడు తగిల్తే వీణ్ణి జెల్ల కొట్టి తగిలేస్తుంది" అంటూ మరికొందరు వ్యాఖ్యానించారు.

ఈ విమర్శలు, వ్యాఖ్యానాలు కిరణ్మయి వినకపోలేదు. విన్నాక మొదట్లో బాధపడింది తర్వాత ఈ చెవంటవిని ఆ చెవంట వదిలేయడం ఆరంభించింది!

వరదరాజులు ఆమెకు ధైర్యం చెప్పేడు "యుద్ధంలో కెళ్ళినవాడు దెబ్బలకి భయపడకూడదు. అలాగే నటనని వృత్తిగా స్వీకరించినప్పుడు విమర్శలకు చలించకూడదు. దేవాలయంలోకి అడుగుపెట్టినప్పుడు చెప్పుల్ని బయట వదిలేస్తాం. అలాగే పవిత్రమైన నాటకరంగంలోకి అడుగుపెట్టినప్పుడు భయాన్ని వదిలిపెట్టెయ్యాలి! నువ్వు నాటకాల్లో నటిస్తున్నావు కాబట్టి నీకెంత టాలెంటున్నా, నువ్వెంత నీతిగా వున్నా నిన్ను లోకువగా చూస్తున్నారు. అదే నువ్వు సినిమాస్టారువయ్యేవనుకో, నిన్నెంత గౌరవిస్తారో తెలుసా? ఒక పెద్ద సినిమాస్టారు రోజుకో మగాడితో పడుకున్నా సరే, ఆమె




జనం మధ్యకొచ్చేసరికి ఆమెను చూడ్డానికి ఇదే జనం ఎగబడతారు. ఆవిడచేత ఆటో గ్రాఫులు తీస్కుంటారు. ఆవిడ ఎవరి ఇంటి కైనా వెళ్తే, అదో గొప్పకింద ఫీలవుతారే తప్ప, రోజుకొకడితో పడుకునే మనిషిని మనం ఎందుకు గౌరవించాలని ఎవడూ ఆలోచించడు! అదే సినిమాల్లో వున్న గొప్ప తనం! నాటకాల్లో వుండే యిబ్బంది! బండ రాయి రాయిగా వున్నంతకాలం దాన్ని రాయిగానే చూస్తారు. కాలితో తొక్కుతారు. కానీ అదే బండరాయిని భగవంతుడి విగ్ర హంగా మారిస్తే, కాళ్లతో తొక్కినవాళ్ళే దానికి నమస్కారాలు చేసి నైవేద్యాలు పెడ తారు. నువ్విప్పుడు బండరాయిలా వున్నావు. కానీ నువ్వే ఓ శిల్పంగా మారితే? రాయిని శిల్పంగా చెక్కడానికో శిల్పి కావాలి! కానీ, నువ్వు నాటకాల్లో రాయిలా బతకడం మానేసి, అందమైన శిల్పంగా మారి ఆరాధించబడ్డం, గౌరవించ బడ్డం జరగాలంటే... ప్రత్యేకించి వేరే శిల్పి ఎవరూ అక్కర్లేదు! నీ నిర్ణయమే ఓ శిల్పిగామారి నీ రూపురేఖలు మార్చేస్తుంది! ఎటొచ్చీ తెగింపు కావాలి! నీ తెగింపే ఈ చాలీచాలని బతుక్కి ముగింపు!"

ఇలా వరదరాజులు తనకి చేతనైనంత చక్కని మాటలతో ఆమెను ధైర్యపరిచాడు. భవిష్యత్తు గురించి సలహా ఇచ్చేడు.

ఆమె ఆశలకి వూపిరులూదేడు. ఆమె ఆలోచనలకి రెక్కలిచ్చేడు!

ఇలా ఒకసారీ రెండుసార్లూ కాదు, ఆమెతో పరిచయం అయిన మొదటివారం నించి ఇలా వుపదేశిస్తూనే వున్నాడు.

ఎటొచ్చీ కిరణ్మయి యింకా వూగిసలా టలో వుంది.



వరదరాజులు ఇచ్చే సలహా సంగతి ఎలా వున్నా, అతన్తో పరిచయమయేక, కుటుంబ

మిత్రుడిగా మారేక, కిరణ్మయికి ఓ భద్రత కలిగింది. సెక్యూర్టీ ఏర్పడింది.

పొరుగూళ్ళకి నాటకాలకోసం వెళ్లేటప్పుడు మొదట్లో సరోజమ్మే ఆమెకు ఎస్కార్టుగా వెళ్ళేది. కానీ, కిరణ్మయి బాగా బిజీ నటిగా మారిపోయి నెలకి ఏడెనిమిది వూళ్లయినా తిరగాల్సి వచ్చేసరికి కూతురివెంట వూరు తర్వాత వూరు వెళ్ళడానికి ఆమె ఆరోగ్యం అనుమతించలేదు. ఓసారి ఆమె అనారోగ్యంగా వున్నప్పుడు ఎలమంచిలిలో నాటకం వేయాల్సి వచ్చింది. అప్పుడు తన తమ్ముడు కృష్ణని వెంటబెట్టుకు వెళ్ళింది! వాడికి అక్క వెంట వెళ్లడం ఎంతమాత్రం యిష్టంలేదు! కానీ, తల్లి గట్టిగా చెప్పడంవల్ల వెళ్లక తప్పింది కాదు.

దసరా ఉత్సవాలకి ఎలమంచిలి నాయుడుగారనే రైస్‌మిల్లు ఓనరు తన సొంత ఖర్చుమీద ఆ వూర్లో నాటకాలు వేయించడం ఓ ఆనవాయితీ! గతంలో రెండుసార్లు కిరణ్మయి వెళ్ళి రావడం జరిగింది. అప్పుడు సరోజమ్మ ఎస్కార్టుగా వచ్చింది. ఈసారి తమ్ముడు వచ్చేడు! కృష్ణ ఆమె వెంటవచ్చేడన్న మాటేగాని, నాయుడిగారి గెస్టుహౌసులో దిగి, స్నానం చేశాక, సడన్‌గా మాయమైపోయేడు. కిరణ్మయి నాటకం హడావిడిలో పడి వాడు ఎక్కడికి పోయేడో పట్టించుకోలేదు. నాటకం అయిపోయి, మేకప్ తుడుచుకుంటుండగా ఓ మనిషొచ్చి "నాయుడుగారు నిన్ను రమ్మంటున్నారు" అన్నాడు. నాయుడుగారు ఎందుకు రమ్మంటున్నారో ఆమెకు అర్థంకాలేదు. గతరెండు సార్లూ నాటకం అయిపోగానే నాయుడు గారు తనకి కిరాయి పంపించేసాడు తప్ప ఇలా ఎప్పుడూ పిలవలేదు. ఆయన అదే గెస్టుహౌస్‌లో మరో గదిలో వున్నాడని ఆ వ్యక్తి చెప్పేడు. తమ్ముణ్ణి తీస్కుని నాయుడిగారి దగ్గరకి వెళ్దామనుకుందిగాని, ఆ సమయానికి వాడు కనిపించలేదు.





"మా తమ్ముడేడి?" అని అడిగిందా వ్యక్తిని.

"నాకు తెలీదు. నాయుడుగారు నీకోసమే వెయిటింగు, తొందరగా వెళ్ళు" అన్చెప్పి ఆ వ్యక్తి వెళ్లిపోయాడు. మనసులో ధైర్యం నింపుకుని నాయుడుగారున్న రూమ్‌లోకి వెళ్లింది.

ఆ గదిలో నాయుడుగారొక్కరే వున్నారు. ఆయన ముందో టీపాయ్, దానిమీద సగం వరకూ ఖాళీ అయిన స్కాచ్ బాటిలు, చేతిలో గ్లాసు, ముఖంలో మైకం, కళ్ళలో ఎరుపు... ఇవి చూసి కిరణ్మయి అతని పరిస్థితి అర్థంచేస్కుని గుమ్మందగ్గరే నిలబడిపోయింది.

"దా, పార్వతీ కూర్చో... మరేం భయం లేదు" అన్నాడు తాపీగా.

"ఫర్వాలేదు చెప్పండి" ఆమె బిడియంగానే మాట్లాడింది. అతను మరోసారి కూర్చోమని చెప్పేక, సోఫాలో కూర్చోక తప్పింది కాదు.

"మందేసుకుంటావా?" అంటూ ఓ గ్లాసులో మందు వేయబోయేడు.

"వద్దండీ, నాకు అలవాటులేదు"

"అలవాటు లేదా? అహ్హహ్హా... చేపలకి ఈదడం అలవాటు లేదన్నా, పక్షులకి ఎగరడం అలవాటు లేదన్నా, నీలాంటి డ్రామా యాక్టర్లకి మందుకొట్టడం అలవాటులేదన్నా నేను నమ్ముతాననుకున్నావా? శ్రీకాకుళం శివరంజని ఓసారి వినాయక నవరాత్రులకి నాటకం ఆడ్డానికొచ్చింది. మందువేసుకుంటావా అని అడిగితే, ముందు చిచ్చి నేను అలాంటిదాన్ని కాదంది. కాస్త మొహమాట పెట్టేక, ఫుల్ బోటిల్ లాగించేసింది"

ఆ మాటలు కిరణ్మయికి దుర్భరంగాను, జుగుప్సగానూ అనిపించాయి.

"ఆవిడ సంగతి నాకు తెలీదు సార్... నాకు కిరాయి యిప్పిస్తే..." అంటూ గొణిగింది.

"ఆ సంగతి నువ్వు వేరేగా అడగాలా?" అంటూ జేబులోనించి రెండువేల రూపాయి లకట్ట తీసి, టీపాయ్‌మీద పెట్టి, "తీస్కో"

అన్నాడు.

"అంతెందుకుసార్? నా కిరాయి ఏడువందల ఏభయ్యే? "

"నాకు తెల్సుగా! నేను యిచ్చింది దానికీ దీనికీ కలిపిలే!"

"దానికీ దీనికీ అంటే? "

"ఏటీ తెలియనట్టు మాట్లాడతావేటి? శివరంజనికి దానికీ దీనికీ కలిపి వెయ్యినూటపదార్లిస్తే, నా ఒంటినిండా ముద్దులెట్టి మరీ తీసుకెళ్లిపోయింది. గుంటూరు పద్మప్రియ లేదా? పొట్టిగా తెల్లగా వుంటాది, దానికి మందిచ్చి పదిహేను వందలిచ్చేసరికి, నన్ను మీరుంచుకోకూడదా అని ఏకంగా నాతో సెటిల్మెంటు అయిపోడానికే టెండరు ఎట్టీసింది"

కిరణ్మయి నిప్పులమీద నిలబడినట్టుగా దుర్భరంగా ఫీలవుతూ- "క్షమించండి... వాళ్ళు అలా ప్రవర్తించినంతమాత్రాన, నాటకాలాడే ప్రతీ అమ్మాయీ అలాగే చేస్తుందనుకోవడం పొరపాటు" అంది.

"ఓ గుర్రం దాహమేస్తే నీళ్ళు తాగడం, మరో గుర్రానికి దాహమేస్తే పాలు తాగడం అంటూ వుండదు పార్వతీ! రాజస్థాన్ గుర్రమైనా, రావులపాలెంగుర్రమైనా దాహమేసినప్పుడు నీళ్ళే తాగుతాయి. డబ్బుల కోసం నాటకాలాడినోళ్ళు, అంతకంటే ఎక్కువ డబ్బొచ్చే ఈ పనికి ఎందుకొప్పుకోరు? నీకు కావల్సింది డబ్బు! నేనిస్తానంటున్నదీ డబ్బే! ఎన్నో రోజులు రిహార్సల్సు చేసి, ఎంతో మంది ముందు ఏక్టింగ్ చేస్తే నీకొచ్చేదెంత? ఏడొందల యాభై! అదే, ఓ గంట సేపు నన్నీగదిలో ఖుషామత్ చేస్తే నీకొచ్చేది పన్నెండొందల యాభై! నువ్వు మరీ పిటపిటలాడి పోతున్నావు కాబట్టి, నీ బిగువులకారేటు కిట్టుబాటు అవదంటే చెప్పు మరో వెయ్యి పారేస్తాను. ఓకేయేనా? " అంటూ ఆమె భుజంమీద చెయ్యివేసాడు.

ఆ చేతిని విసిరికొట్టింది. దాంతో అతను రెచ్చిపోయి, ఆమెను బలంగా మంచంమీదకి లాగేడు. ఆమె పెనుగులాడింది. అతని పశుబలం ముందు ఆమె శక్తి ఎందుకూ పనికిరాకుండా పోతోంది. చివరికామె తన యావత్ శక్తిని కూడదీసుకుని, తన కుడికాలుతో అతని బీర్జం (టెస్టికల్స్) మీద తన్నింది. అతను 'అమ్మో' అని ఆర్తనాదం చేస్తూ కిందపడిపోయేడు! మైకంవల్ల, ఆమె తన్నినందువల్ల కలిగిన బాధవల్ల అతను వెంటనే లేవలేకపోయేడు. అదే అదనుగా భావించి బైటకి పరుగెత్తి, ఆ తలుపులకి బయట్నించి గడియవేసి, గబగబ తన రూమ్‌కి వచ్చి సూట్‌కేసు తీస్కుని బయటికి పరుగెత్తింది. దూరంగా, పందిట్లో తనతో నాటకం వేసిన నటులు మందు తాగుతూ కూర్చున్నారు. వాళ్ళు తనని గమనించకుండా మరోవైపు పరుగెత్తింది. అర్ధరాత్రివేళ చీకట్లో పొలాలగట్లమీదనించి పరుగెత్తుకుంటూ పరుగెత్తుకుంటూ స్టేషన్‌కి చేరుకుంది. ఆమె తమ్ముడు అక్కడా కనబడలేదు. ఆమె స్టేషన్‌కొచ్చిన రెండు నిమిషాలకే వైజాగ్ వెళ్లే ట్రైన్ వచ్చింది. ఇంకా తమ్ముడి గురించి వెయిట్‌చేస్తే నాయుడిగారి మనుషులు వచ్చినా రావచ్చని అనుమానించి, టిక్కెట్టు తియ్యకుండానే ట్రైన్ ఎక్కేసింది.

మర్నాడు సాయంత్రం కృష్ణ ఎలమంచిలినించి, ఎర్రబడ్డ కళ్లతో, పీక్కుపోయిన ముఖంతో ఇంటికి వచ్చేడు. వాడు వచ్చీరాగానే "నాకు ఎస్కార్టు వచ్చిన వాడివి నాతో వుండకుండా ఎక్కడ చచ్చేవురా? " అంటూ ఫెడీఫెడీమంటూ నాలుగైదు దెబ్బలు కొట్టేసింది. పదిసార్లు అడిగినమీదట వాడు నిజంచెప్పేడు. నాయుడిగారి మనుషులు వాణ్ణి పేకాటలోకి దింపేరట! బలవంతంగా బీరు కూడా తాగించేరట? మైకం ఎక్కువై పడిపోతే ఓ గదిలో పడుకోబెట్టేరట! ఇదంతా విన్నాక ఆ ఎలమంచిలినాయుడు తనని అనుభవించడంకోసం, ఇదంతా ఓ

పథకం ప్రకారమే చేయించాడని గ్రహించింది. "ఇది నీ తప్పు కాదురా, నీలాంటి బేవార్సు వెధవని నా వెంట తీసుకెళ్లడం నా తప్పు" అంటూ తల బాదుకుని ఏడ్చింది. సరోజమ్మ చూస్తే తీవ్రమైన జ్వరంతో మంచాన పడిఉంది. ఆమె స్వస్థత చెందడానికి ఎంత లేదన్నా ఓ పదిరోజులయినా పడుతుంది. ఈ వారంలో ఏలూరు, గుంటూరు వెళ్ళి రెండు నాటకాలాడాలి. ఇప్పుడు తను ఎవర్ని తీసుకువెళ్తుంది?

ఇదంతా తెల్సుకున్న వరదరాజులు- "నీకు అభ్యంతరంలేకపోతే, నీవెంట నేను ఎస్కార్టొస్తాను" అన్నాడు. కిరణ్మయి ఔననిగాని, కాదనిగాని చెప్పలేకపోయింది. ఆ సాయంత్రం, వరదరాజులు ఇలా అన్నాడని, తల్లిచేత కాఫీ తాగిస్తూ చెప్పింది. ఆమె ఎక్కువసేపు ఆలోచించలేదు. వరదరాజులు అప్పటికే ఆమె అభిమానాన్ని, నమ్మకాన్ని సంపాదించేడు. ఆ ఇంటికి అప్పుడప్పుడు మార్కెట్‌నించి సామాన్లు తెస్తున్నాడు. కిరణ్మయి ఎలమంచిలి ప్రోగ్రాముకి వెళ్ళినప్పుడు సరోజమ్మని రిక్షా ఎక్కించి ద్వారకానగర్ దగ్గరున్న డాక్టరు దగ్గరకి తీసుకెళ్ళి చూపించాడు. డాక్టరు రాసిన మందులు తెచ్చి ఆమెకు వేశాడు.

"నువ్వు పరాయివాడివా నాయినా! ఈ ఏడాదిలోనే మా ఇంట్లోని మనిషిలా మారిపోయేవు... కానీ, అమ్మాయి వెంట నువ్వెళ్తే, నలుగురూ నాలుగు రకాలుగా అనుకుంటారనే ఆలోచిస్తున్నాను" అంది సరోజమ్మ.

వరదరాజులు ఆమె పక్కనే మంచంమీద కూర్చుని, "నువ్వు నలుగురూ అనుకునే నాలుగు మాటల గురించే ఆలోచిస్తున్నావు. కానీ, యిప్పుడీ ఎలమంచిలి నాయుడుగాడు చేసినట్టే, రేపు మరో ఎదవ ఇలాంటి పని చేస్తే అప్పుడు కిరణ్మయి బతుకు ఏమవుతుందో ఆలోచించు! అలాంటి మదమెక్కిన వెధవల చేతుల్లో మైలపడ్డం కంటే, నాలుగు మాటలు పడి, వాటిని దులిపేస్కోవడం మంచిదికదమ్మా!" అన్నాడు సిన్సియర్‌గా.

అతని మాటలు మంత్రాల్లా వినిపించి, మందు మాత్రల్లా పనిచేసాయి. సరోజమ్మ ఒప్పుకుంది!

ఆనాట్నించి కిరణ్మయికి ఎస్కార్టుగా వరదరాజులు వెళ్లనారంభించాడు! పరిషత్తుల్లో వాళ్ళిద్దరికీ ఓ రూము ఇచ్చినప్పుడు గూడా ఆమెను కూర్చోబెట్టి, "నువ్వు సినిమా వేషాలకోసం ప్రయత్నించకుండా, యీ నాటకాలకీ, పరిషత్తులకే అంకితమైపోవడం చూస్తుంటే నాకు బాధగా వుంది! ఎంత బాధగా వుందంటే, వజ్రాయుధంతో వంకాయలు కోసుకున్నట్టు, మధుర రాగాలు వినిపించే మురళితో పొయ్యి వూదుకున్నట్టుగా వుంది. నీ జీవితం నాకు నచ్చలేదు. కనీసం నీ జీవితం నీకైనా నచ్చిందా?" అంటూ ఎప్పుడూ చేసే వుపదేశాన్నే మళ్ళీ చేసేవాడు. కాకపోతే ఎటువంటి డిస్టర్బెన్సూ లేదు కాబట్టి మరింత వివరంగా చేసేవాడు! అంతే తప్ప ఏనాడూ ఆమె ఒంటిమీద చెయ్యి వెయ్యలేదు. కనీసం ఆ భావాన్ని ప్రదర్శించే చూపుకూడా చూడలేదు. అందుకే వారిద్దరి గురించి ఎవరెన్ని కూసినా, ఆ కూతుల్ని ఆమె గాలికి వదిలేసింది.

ఆమె గాలికి వదిలేయకుండా, పదిలంగా గుండెల్లో దాచుకున్న అభిప్రాయం మాత్రం ఒకటుంది. "వరదరాజులు నా స్నేహితుడే తప్ప, నా శత్రువు కాదు. అతను నా శ్రేయోభిలాషే తప్ప అవకాశవాది కాదు"

మంచంమీద పడుకున్న కిరణ్మయి మెదడు ఆలోచనల్తో అలిసిపోయింది. నిద్రలోకి జారుకుంటూ, మనసులోనే ఓ మాట అనుకుంది. "వరదరాజులు చెప్పే ప్రతీ మాటా తన భవిష్యత్తు గురించే తప్ప, అతని స్వార్థం కోసం కాదు. అతను అంతలా పదేపదే చెప్తున్నా, తను తన భవిష్యత్తు గురించి ఆలోచించకుండా అశ్రద్ధ




చేస్తూ కాలాన్ని వృథాచేస్తోందా? "

సాయంత్రం ఎప్పుడో బాగా పొద్దుపో యేక నిద్రలేచింది. బడలికంతా తీరిపోయి ఒళ్లంతా తేలిగ్గా వున్నట్టనిపించింది. వంట గదిలోనించి వరదరాజులు గొంతు వినిపి స్తోంది. ఆమె లేవడం గమనించి వరదరా జులు ఆమెగదిలోకొచ్చి, "నేనొచ్చి గంట యింది. నువ్వు మత్తుగా నిద్రపోతున్నావు. డిస్టర్బ్ చెయ్యడమెందుకని మీ అమ్మతో హస్కువేస్తున్నాను" అంటూ మంచంమీద కూర్చున్నాడు.

కిరణ్మయి బాత్‌రూమ్‌లోకెళ్లి ముఖం కడుక్కుని వచ్చింది.

సరోజమ్మ యిద్దరికీ చెరో కప్పు కాఫీ అందించి, "ఆ సుబ్బారావు నీ కిరాయి యివ్వలేదటగా" అంది.

కిరణ్మయి వరదరాజులువైపు చూసింది. అతను మౌనంగా కాఫీ తాగుతూ తల ఎత్త లేదు.

"ఆ వెంకట్రామయ్య అద్దెకోసం పిచ్చికు క్కలా అరుస్తున్నాడని చెప్పేనుగదా! అటు పైన నీ యిష్టం" అంది సరోజమ్మ.

తర్వాత వరదరాజుల్తో అంది, "దీని మెత కదనం చూసే చాలా సమాజాలు ఇలాగే కిరాయిలు ఎగ్గొట్టేసారు నాయినా! అదే ఆ పద్మావతిని చూడు, మనిషి కొండము చ్చులాగున్నా, సమాజాల వాళ్లనించి కిరాయి ఎంత ఖచ్చితంగా వసూలు చేస్తుందో! ఓసారి ఓ డైరెక్టరెవడో వందరూపాయలు ఎగ్గొట్టేస్తే, వెయ్యి రూపాయలు ఖరీదు చేసే టేప్‌రికార్డరు లాక్కొచ్చేసి, నీదిక్కున్న చోట చెప్పుకో అంది! చచ్చినట్టు వాడా డబ్బుయి చ్చేసి తన వస్తువు పట్టుకు పోయేడనుకో... దీన్ని అలాంటి రౌడీపనులు చెయ్యమనడం లేదుగాని, గట్టిగా అడిగి కిరాయి వసూలు చెయ్యవే అంటున్నాను. ఎవరో పేద కళాకా రుల సహాయార్థం ఆ నారాయణమూర్తి మూడు ప్రదర్శనలు యిస్తే ఆ మూడిం ట్లోనూ ఒక్క పైసా కూడా తీస్కోకుండా, సొంత ఖర్చులతో రిక్షా మీద వెళ్లిమరీ ఏక్ట్ చేసింది. మరో పేద ఆర్టిస్టు కోసం మనం కిరాయిలు త్యాగం చెయ్యడానికి మనం ఏమైనా కుప్పలమీద కూర్చున్న కోటీశ్వరు లమా? మనం యిన్నిసాయాలు చేసినా మనకో వంద రూపాయలు సాయం చెయ్య మంటే చెయ్యరుగదా! యివన్నీ తెల్సితెల్సి... మరో గత్యంతరం లేక నాటకాలు వేయడం... నలుగుర్లోనూ లోకువ కావడం... యిదే మా బతుకులకి మిగి లింది."

ఆఖరి మాటలంటున్నప్పుడు ఆమెగొంతు గద్గదమై ఖాళీ కాఫీ కప్పుల్ని తీస్కుని అక్క డనించి వెళ్లిపోయింది.

"అలా పెరట్లో కూర్చుందాంపదా" అంటూ వరదరాజులు ఓ డొక్కుకుర్చీని తీస్కుని పెరట్లోకి నడిచాడు. అలాంటిదే మరో కుర్చీ తీస్కుని కిరణ్మయి కూడా అను సరించింది. అప్పటికి సూర్యాస్తమయమయి పోయి చాలా సేపయింది. చంద్రుడు చంటి బిడ్డలా పాక్కుంటూ పాక్కుంటూ ఆకాశం మధ్యలోకి రావడానికి ప్రయత్నిస్తున్నాడు. వాతావరణం చాలా ఆహ్లాదకరంగా వుంది.

"నువ్వివాళ చాలా అందంగా వున్నావు" అన్నాడు వరదరాజులు చిన్నగా నవ్వుతూ. ఆమెకు ఆమాట ఆనందం కలిగించకపోగా, కాస్త చిరాకు కలిగించింది. "నా అందం గురించి తప్ప నువ్వు మాట్లాడ్డానికి మరో టాపిక్కేం దొరకదా? " అంది.

"టాపిక్కు లేకేం వుంది. కానీ దాన్ని ప్రస్తావించేముందు వుపోద్ఘాతంగా ఆ డైలాగ్ అన్నాననుకో... నేను చెప్పిన విష యమేం ఆలోచించావ్? "అన్నాడు చాలా ఆసక్తిగా ఆమె ముఖంలోకి చూస్తూ.

"ఏ విషయం? "

"అంటే నేను చెప్పిందంతా మర్చిపోయే వన్న మాట! నీ భవిష్యత్తు గురించి నువ్వు ఏమాత్రం ఆలోచించడంలేదు. పోనీ ఆ

విషయం నేను ఆలోచించి నీకు చెప్పినా పట్టించుకోవడంలేదు. చూడు కిరణ్మయీ, జీవితం చాలా తియ్యనయింది. అందు లోనూ యవ్వనం మరీ తియ్యనయింది. విలువయింది కూడా! ప్రతి మనిషీ వందేళ్లూ బతకాలనే కోరుకుంటాడు. బతి కిన ఆ వందేళ్లూ యవ్వనంలో వుండాలనే కోరుకుంటాడు. అయితే అది సాధ్యమయిన పని కాదనుకో! బాల్యంలో మనకేమీ తెలి యదు కాబట్టి ఏమీ చెయ్యలేం! వృద్ధా ప్యంలో మనకి అన్నీ తెలిసినా, జవసత్వాలు డిగిపోవడంవల్ల చాలా పనులు చెయ్యాలను కున్నా చెయ్యలేం. ఇంక మిగిలిందల్లా యవ్వనం! మనకుండే టాలెంటుని కేష్ చేస్కోవాలన్నా, ఏష్ చేస్కోవాలన్నా, అంటే బూడిద చేస్కోవాలన్నా, అదంతా యవ్వ నంలోనే చేస్కోవాలి. యవ్వనం ఓ అయి సుక్రూట్ లాంటిది. అది కరిగి నీరైపోక ముందే మనం దాన్ని ఎంజాయ్ చెయ్యాలి"

యవ్వనం గురించి అతను ఎందుకంత ప్రత్యేకంగా వివరిస్తున్నాడో అర్థం కానట్టుగా చూసింది.

ఆ చూపుకి అతను ఖంగుతిన్నా, దాన్ని వ్యక్తం చేయకుండా, తను చెప్పిందాన్ని ఆమెకు వర్తింపజేస్తూ మళ్లీ చెప్పేడు. "నువ్వు యవ్వనంలో వున్నావు. అందంగా వున్నావు. వుత్తమ నటిగా మంచి పేరులో వున్నావు. ఇలాంటప్పుడే నువ్వు సినిమాల్లో కెళ్లి, కీర్తి, డబ్బు ఎందుకు సంపాదించకూ డదు? నీబోటి దానికిది అత్యాశకాదు, గొంతెమ్మ కోరికాకాదు. నీ కాలిగోటికి కూడా పనికిరాని వనజ యివాళ ఎన్ని సినిమాల్లో యాక్ట్ చేస్తోందో చూడు! దాంతో కంపేర్ చేస్తున్నానని నువ్వేం ఫీలవకు!

మెడ్రాసులో నాకు తెల్సిన కొందరు ప్రొడ్యూసర్లు, డైరెక్టర్లూ వున్నారు. వాళ్ల దగ్గ రకెళ్లి ప్రయత్నిద్దాం! చెట్టుకి పదిరాళ్లు విసి రితే, ఒక్క కాయ అయినా రాలకపో తుందా? ఏకొమ్ములు తిరిగిన డైరెక్టరుకి నిన్ను చూపించినా, యిన్నాళ్లూ యింత అందమయిన టాలెంటుని మాకు చూపించ కుండా నువ్వేం చేస్తున్నావయ్యా అంటూ నన్ను తిడతారేగాని, నీకు వేషం యివ్వడం మానరు. నువ్వు ఒక్క పిక్చర్లో వేస్తేచాలు. మర్నాడు నీ యింటి దగ్గరకి వందకార్లు వచ్చి ఆగుతాయి. నాదీ గ్యారంటీ..." అంటూ వూపిరి సలపకుండా చెప్తూ, జేబు లోనించి ఓ పేపరు కటింగ్ తీసి చూపిం చాడు.

అదో కొత్త సినిమా కంపెనీవాళ్ళ 'నూతన నటీనటులు కావలెను' అని వేసిన ప్రకటన! రంగస్థలంమీద అనుభవం వున్న వారికి ప్రిఫరెన్సు యిస్తామని అండర్‌లైన్ చేసి మరీ రాశారు.

కిరణ్మయి ఆ ప్రకటన చూసి "చూద్దాంలే" అంది నిరాసక్తంగా!

"చూద్దాంలే అంటే కాదు, ఈ కంపెనీకి నీ ఫొటోలు, నా ఫొటోలు కూడా పంపించే శాను" అంటూ పగలబడి నవ్వేడు.

ఆమె అతన్ని ఆశ్చర్యంగా చూడలేదు. ఏదో ఆలోచిస్తూ శూన్యంలోకి చూస్తూ వుండిపోయింది. వరదరాజులు తనని ప్రోత్సహిస్తూ మాట్లాడ్డం యివాళేమీ కొత్త కాదు. ఆ మాటలు విన్నప్పుడల్లా మనసు పొయ్యిమీద పెట్టిన పాలులా పొంగు తుంది. దారంకట్టి ఎగరేసిన గాలిపటంలా ఆకాశంలోకి ఎగురుతుంది. కానీ మళ్లీ ఏదో భయంవేసి, నీళ్లు జల్లిన పాలులా వెనక్కి తగ్గిపోతుంది. ఎగురుతున్న గాలిపటానికి దారం టుపుక్కున తెగిపోతుంది.

ఏం చెయ్యడం.

ఓ పది నిమిషాలు నిశ్శబ్దంగానే గడిచి పోయేయి! అతను ఆమె ముఖకవళికల్నే శ్రద్ధగా గమనిస్తున్నాడు. చివరకి కిరణ్మయే అంది "చాలామంది చెప్తుంటే విన్నాను. సిన్మా ఫీల్డులో రాణించడానికి మనిషిలోని టాలెంటుకంటే, అదృష్టమే ప్రధానమం




టారు"

ఏదో ఓ రోజు ఆమె ఆ ప్రశ్న అడుగుతుందని వూహించే సమాధానాన్ని సిద్ధంగా వుంచుకున్నాడు. "యూ ఆర్ కరక్ట్! అక్కడ అదృష్టమే ముఖ్యం! అయితే ఆ అదృష్టం ఎలా వస్తుంది? మనం కూర్చున్న చోట నించి కదలకుండా వుంటే, అది మన ఎడ్రస్ వెతుక్కుంటూ వస్తుందా? లాటరీలో మనకి డబ్బు వస్తుందో, లేదో టెస్టు చేస్కోవాలంటే, ముందు మనమో లాటరీ టిక్కెట్టు కొనాలి గదా! టిక్కెట్టు కొనకుండా మనకి లాటరీ తగలాలంటే ఎలా? అదృష్టం అవతలిగట్టున నిలబడి నిన్ను, రా రా అంటూ పిలుస్తున్నప్పుడు నువ్వు బోటుమీదో, లాంచీ మీదో ఇవేవీ దొరక్కపోతే ఈదుకుంటూనో నువ్వా ఒడ్డుకి వెళ్ళిపోవాలి! ఇవాళ సినిమా ఫీల్డులో టాప్ పొజీషన్లో వున్న వాళ్ళంతా ఆకాశంనించి దిగొచ్చేరా? తమ అదృష్టాన్ని పరీక్షించుకోడానికి తలా ఓ వూరునించి అక్కడకి చేరుకున్న వారేకదా! అలా వచ్చిన వాళ్ళంతా షైనైపోయేరా? అంటే అవరు. రన్నింగ్ రేసులో పదిమంది పరుగెడితే, అందులో ఫస్టు, సెకెండ్, థర్డు అంటూ ముగ్గురే ప్రైజులందుకుంటారు. మనమూ ఆ ముగ్గురిలాగే ప్రైజుకొట్టడానికి ప్రయత్నించాలిగాని, ఓడిపోయిన ఏడుగురితో మనమెందుకు పోల్చుకోవాలి? "

కిరణ్మయి మీద ఈ మాటలు, ఈ వుదాహరణలు ఎలా పనిచేశాయో గమనించడానికి అతను కొన్ని క్షణాలపాటు ఆగేడు. జేబులోనించి త్రిబుల్ ఫైవ్ సిగరెట్ పేకెట్ తీసి, ఓ సిగరెట్ నోట్లో పెట్టుకుని అగ్గిపెట్టె తీసి ఓ పుల్లగీసి, సిగరెట్టుని వెలిగించాడు. "ఈ సిగరెట్ ఖరీదు డబ్బయ్యయిదు పైసలు! దీన్ని వెలిగించిన ఈ అగ్గిపుల్ల ఖరీదు ఒక్క పైసాకంటే తక్కువ! అయినా ఈ అగ్గిపుల్ల వుంటే తప్ప యింత ఖరీదైన సిగరెట్టూ వెలగలేదు. అదృష్టం కలిసొస్తే నిన్ను అందలమెక్కించడానికి, అతి మామూలు మనిషినైన నేను చాలు సుమా అని చెప్పడానికే యీ సిగరెట్టు, అగ్గిపుల్ల వుదాహరణ చెప్పేను"

అయినా కిరణ్మయి ఆలోచిస్తూ వుండిపోయిందే తప్ప ఏమీ జవాబు చెప్పలేదు. చీకటి క్రమంగా చిక్కబడుతుండడంవల్ల ఆమె ముఖంలోని భావాలు అతనికి స్పష్టంగా తెలియడంలేదు! అయినా అతను నిరుత్సాహపడకుండా తను చెప్పాల్సిన ఆఖరు మాటలు చెప్పేశాడు. "నీ మనస్తత్వం నాకు బాగా తెలుసు! పరుగెత్తి పాలు తాగడంకంటే నిలబడి నీళ్ళు తాగడమే మంచిదని నీ వుద్దేశ్యం. కానీ పరుగులు తీయగలిగిన వాడే పాలు తాగగలుగుతాడు. వున్నతమైన పదవుల్ని అందుకోగలుగుతాడు. నిలబడి నీళ్ళు తాగుతూ నక్షత్రాల్ని లెక్కపెడుతూ కాలక్షేపం చేసేవాడు, ఎప్పటికీ ఆ నీళ్ళే తాగుతూ నీళ్ళు గారిపోతాడు. కాకిలాగ కలకాలం బతికే బదులు, హంసలాగ ఆర్నెల్లు బతకడం వుత్తమం అని అంటారు. డ్రామాల్లో నటిస్తూ కలకాలం బతికేకన్నా సినిమాస్టారుగా ఆరు సంవత్సరాలు బతకడం మంచిదని నేనంటాను.

నువ్వు ఎన్నాళ్ళు నాటకాలు వేసినా నీ బతుకు పిట్టని కొట్టడం, పొయ్యిలో పెట్టడం లాగే వుంటుంది తప్ప, నీ జవసత్వాలుడిగి, నీకు నాటకాల్లో బుకింగులు తగ్గేటప్పటికి నువ్వో లక్ష రూపాయిలయినా వెనకేస్కోగలవా? వేస్కోలేవని నేను గ్యారంటీగా చెప్పగలను. అదే సినిమా ఫీల్డులో ఒక్క పది సంవత్సరాలు లేదా ఒక్క అయిదు సంవత్సరాల పాటు ఓ వెలుగు వెలిగేవనుకో నీకో అయిదు తరాలకి సరిపడే సిరిసంపదలు వచ్చిపడిపోతాయి. ఇప్పుణ్ణువ్వు డబ్బు లేకపోతే ఎలా బతకడమని బాధ పడుతున్నావు. కానీ నువ్వు సినిమా స్టారువైపోతే వస్తున్న లక్షలూ, కోటుల్ని ఎక్కడ దాచాలి? ఏం చెయ్యాలి అని బాధపడిపో



తావు. ఈ రెండు బాధల్లో దేంట్లో సుఖం వుందో నువ్వే యీ రాత్రంతా ఆలోచించు"

వరదరాజులు ఎన్నాళ్లో రిహార్సల్సు చేసి అప్పగించిన డైలాగుల్లాగ ఈ మాటలన్నీ చెప్పేసి, తన డ్యూటీ అయిపోయినట్టుగా తృప్తిపడి, వెళ్లిపోయేడు.

కానీ కిరణ్మయి అక్కడ నించి లేవలేదు. వరదరాజులు చెప్పిన ఒక్కోమాట ఒక్కో గొలుసుగామారి, ఆమెను ఆ కుర్చీలో బంధించేశాయి. ఆకాశం వైపు చూసింది. ఎన్నో నక్షత్రాలు మెరుస్తున్నా అవి నక్షత్రాల్లా కనిపించడం లేదు.

వరదరాజులు చెప్పిన ఒక్కో వాక్యం ఒక్కో నక్షత్రంలా కనిపిస్తున్నాయి.

ఆ నక్షత్రాల మధ్య వెలుగుతున్న చంద్రుడు వరదరాజులులాగే కనిపిస్తున్నాడు.

ఆమె అలా ఆకాశానికేసి ఎంతసేపు చూసేదోగాని, యింట్లోనించి ఏవో కేకలు వినిపిస్తుంటే గబగబా యింట్లోకి వెళ్లింది.

ఇంటి ఓనరు వెంకట్రామయ్య సరోజమ్మ మీద గయ్‌గయ్ లాడుతున్నాడు.

"నీ కూతురు పరిషత్తునించి రాగానే నా అద్దె నా ముఖాన కొడతానన్నావు! నీ కూతురు వచ్చింది, కానీ నా అద్దె నా ముఖాన కొట్టలేదేం? కొట్టమ్మా కొట్టు" అంటూ అరుస్తూ గెంతులేస్తున్నాడు.

"వెంకట్రామయ్యగారూ" అంటూ కిరణ్మయి గట్టిగా గద్దించేసరికి అతను తగ్గేడు. పరిషత్తువాళ్లు నాకు కేష్ యివ్వకుండా చెక్కు యిచ్చేరు. నేను వూర్నించి వచ్చేసరికి బేంకు టైము అయిపోయింది. రేపు మధ్యాహ్నం మీ డబ్బు మీకు యిచ్చేస్తాను. మీరు మర్యాదగా వెళ్లండి"అంది.

"సరే, అదీ చూస్తాను" అంటూ వెంకట్రామయ్య వెళ్లిపోయేడు.

సరోజమ్మ ఏదో చెప్పబోతే కిరణ్మయి వినకుండా, గదిలో వున్న నులకమంచం, ఓ




దిండు తీస్కుని పెరట్లోకెళ్లి మంచం వేసి దానిమీద పడుకుని, ఆకాశంవైపు చూస్తూ మళ్లీ ఆలోచనలో పడింది.

వరదరాజులు చెప్పిన ప్రకారం నడుచుకుంటే కీర్తికి కీర్తి లక్షలకి లక్షలు వస్తాయి.

తన సంకోచాలు, తన భయాల్తో వెనకాడి యీ నాటక రంగాన్నే అంటిపెట్టుకునుండిపోతే యింటద్దె బాకీపడడాలు, తనకి కేష్‌కి బదులు చెక్కు యిచ్చేరని అబద్ధాలు చెప్పడాలు, రేపు మధ్యాహ్నం ఆ అబద్ధం బయటపడగానే వెంకట్రామయ్య చేత తిట్లు తినడాలు...

ఏమిటీ జీవితం?

ఎన్నోసార్లు ఈ ప్రశ్న వేసుకుంది.

ఆ ప్రశ్నకి సమాధానంగా "ఇలా వుండాలి జీవితం" అంటూ ఏనాడూ జవాబు చెప్పుకోలేకపోయింది. తన జీవితం ఎలా వుండాలన్నది యిప్పుడే ఆలోచించనారంభించింది!

ప్రతీ మనిషికి తిండి, బట్ట, ఇల్లు ప్రధానావసరాలు! కానీ యిప్పుడా అవసరాల్లో సినిమా కూడా చేరిపోయింది. సినిమా తారలకి ప్రజలు బ్రహ్మరథం పడుతున్నారు. వ్యాపార ప్రకటనలకీ వాళ్లనే వుపయోగిస్తున్నారు. రాజకీయ పార్టీలు ఎలక్షన్ ప్రచారాల్లోనూ ప్రముఖ సినీ నటీనటుల చేతనే వుపన్యాసాలు ఇప్పిస్తున్నారు. సినిమా హీరో వేషాలువేసి ప్రజాభిమానం పుష్కలంగా సంపాదించిన వాళ్లు రాష్ట్రాలకి ముఖ్యమంత్రులవుతున్నారు.

సినిమా ప్రభావం ప్రజల మీద అంతగాఢంగా వుంది.

అటువంటి సినిమాల్లోకి వెళ్లమని వరదరాజులు పదేపదే చెప్తున్నాడు.

తెలుగురానివాళ్లు, డబ్బింగ్ మీద ఆధారపడి నటిస్తున్న కొందరు తెలుగు హీరోయిన్లు, ముఖంలో ఏ భావాన్నీ పలికించలేని వాళ్లుగూడా టాప్ హీరోయిన్లుగా చెలామణీ అయిపోతున్నప్పుడు... తనకేం?

సహజమైన అందం వుంది! ఎనభై ఏడు

సార్లు వుత్తమనటి అవార్డులందుకున్న చరిత్రవుంది. మధురమయిన కంఠం వుంది. తన డైలాగ్ మాడ్యులేషన్‌కో ప్రత్యేకమైన గుర్తింపు వుంది.

తను సినిమాల్లోకి వెళ్లాలని ఆశించడంలో తప్పులేదు. వెళ్లకూడదని వెనకాడ్డమే తప్పవుతుంది.

అర్హతలు ఇలా వున్నాయికాబట్టి, ఇంక అదృష్టం సంగతి!

అర్హతలున్న చోటుకి అదృష్టం, తల్లిని వెదుక్కుంటూ వచ్చే లేగదూడలా చెంగుచెంగుమంటూ గెంతులేస్తూ వస్తుంది! తనకా నమ్మకం వుంది! ఎటొచ్చీ యిప్పుడు కావలసింది తెగింపు.

వరదరాజులు చెప్పినట్టు, లాట్రీటిక్కెట్టు కొనకుండా లాట్రీ తగలాలంటే ఎలా?

రిస్కు తీస్కోని వ్యాపారం, తెగింపు లేని జీవితం రాణించవు.

తను సినిమారంగంలో అడుగు పెడితే చాలు! ఆ తర్వాత ఏమవుతుందో తనకి బాగా తెలుసు! తను నాటకరంగంలోకి వచ్చీరాగానే అప్పటికి నాటకరంగంలో ప్రసిద్ధులుగా ఉన్న ఎంతమంది నటీమణుల్ని వెనక్కి నెట్టేసి తను నెంబర్‌ఒన్ స్థానానికి రాలేదు?

సినిమాల్లోనూ అంతే జరుగుతుంది.

తను ఒక్కసారి తెగిస్తే యిన్నాళ్లూ తన కుతాను వేస్కునే 'ఏమిటీ జీవితం' అనే ప్రశ్న జీవితంలో ఎప్పుడూ వేస్కునే అవసరమేవుండదు.

నేనీ జీవితంతో రాజీపడలేను!

కొత్త జీవితం నన్ను ఆహ్వానిస్తున్నప్పుడు, పాత జీవితానికి గుడ్‌బై కొట్టకతప్పదు.

తను మద్రాసు వెళ్లిపోవాలి, వెళ్లిపోవాలి, వెళ్లిపోవాలి! ఆమె ఆలోచనలు ఓ కొలిక్కి వచ్చాక, అంతవరకు ఆమె మనసులో హోరు పెడుతున్న వుప్పెన వుపశమించింది. నిద్ర ఆమెను ఆవహించింది.





★ ★ ★

మర్నాడు వుదయం కిరణ్మయి టిఫిన్ తింటుండగా వరదరాజులు వచ్చేడు. సరోజమ్మ అతన్ని కూడా టిఫిన్ తినమంటే, టిఫిన్‌వద్దని చెప్పి టీ మాత్రం తీసుకున్నాడు. "మీరు మాట్లాడుతుండండి. నేను మార్కెట్‌కెళ్లి కూరగాయలు కొనుక్కొస్తాను" అంటూ వెళ్లబోతుంటే,

"రాత్రి నాన్నొచ్చేడా? " కిరణ్మయి వేసిన ప్రశ్నకి సరోజమ్మ ఆగింది.

"లేదు"

"తమ్ముడు? "

"వాడూ రాలేదు"

"వెదికి తీసుకురాలేకపోయేవా? "

"వాడి తిక్క నీకు తెల్సిందేగా! వాడికి బుద్ధి కుదిరితే వాడే వస్తాడు"

తను అడగబోయే ప్రశ్నలకి సరోజమ్మ అక్కడ వుండడం, ఓ పెద్ద అవరోధంలా ఫీలయేడు వరదరాజులు! "కృష్ణగాడి సంగతి నేను చూస్తానుగాని, నువ్వు మార్కెట్‌కెళ్లి రామ్మా" అన్నాడు సౌమ్యంగా.

సరోజమ్మ వెళ్లిపోయింది. వరదరాజులు సిగరెట్ వెలిగించి ఓ దమ్ములాగి, కిరణ్మయిని అడిగాడు.

"ఏం ఆలోచించేవ్? "

"ఎప్పుడూ నీకు నా ధ్యాసేనా? "

"యస్!"

"నీ భవిష్యత్తు గురించి ఆలోచించవా? "

"ఆలోచించడం లేదని ఎందుకనుకుంటున్నావ్? నా వూపిరి నేను పీల్చుకున్నాకనే నా పక్కవాడు బతుకుతున్నాడా, లేదా అని ఆలోచిస్తాను. ఎందుకంటే నేను సామాన్యమైన మనిషిని"

"నేను అడుగుతున్నది నీ భవిష్యత్తు గురించి"

"నేను చెప్తున్నదీ అదే! నా భవిష్యత్తు నీ భవిష్యత్తుతో ముడిపడివుంది"

కిరణ్మయి తృళ్లిపడింది. అతని సమాధానంలో ఏదో అపశృతి ధ్వనించినట్టయింది.

"అంటే? " క్లారిఫికేషన్ కోరుతున్నట్టుగా

చూసింది.

కానీ ఆమె ఆశ్చర్యాన్ని అవలీలగా పక్కకి నెట్టి జవాబు చెప్పేడతను.

"వెరీసింపుల్! నువ్వు నీ వేషాలకోసం ప్రయత్నిస్తావు. నేను నా వేషాల కోసం ప్రయత్నిస్తాను. నా గురించి వదిలిపెట్టి, నీ గురించి మాత్రమే ప్రయత్నించడానికి నేనేం మహానుభావుణ్ణికాదు. నేను విశాలహృదయుణ్ణని చెప్పి నిన్ను నమ్మించొచ్చు! కానీ అబద్ధాలాడ్డం నాకిష్టంలేదు. ముఖ్యంగా నీ దగ్గర! నా సంగతి వదిలేసి, నీ సంగతి చెప్పు. ఏం ఆలోచించావు? మద్రాసు వస్తావా?"

"రావాలనే వుంది"

"వుందంటేకాదు, యిప్పటికే ఆలస్యం చేశావ్! ఆ లేట్ కవర్ చెయ్యడానికి మనం వురుకులూ పరుగులూ తియ్యాలి"

"తీద్దాం"

వరదరాజులు హుషారుగా భుజాలు ఎగరేసి, "యావదాంధ్రదేశాన్ని వుర్రూతలూపబోయే ఈ నటీ శిరోమణిగారికి యిప్పటికైనా పంజరం వదలి పైకి ఎగరాలనిపించినందుకు ఆంధ్రులందరి తరపునా ధన్యవాదాలు తెలియజేస్తున్నాను. గబగబా పెట్టేబేడా సర్దేయ్"

కిరణ్మయి వులికిపడింది, "ఇప్పుడేనా?" అంది.

"శుభకార్యాన్ని ఎప్పుడూ లేట్ చెయ్యకూడదు. మనం ఇప్పుడే బయలుదేరాలి"

"లేడికి లేచిందే పరుగని యిప్పటికిప్పుడు పారిపోదామంటే ఎలా? అమ్మ వచ్చాక అన్ని సంగతులూ మాట్లాడి..."

ఆమె ఏదో తప్పు మాట మాట్లాడినట్టుగా వరదరాజులు తల అడ్డంగా ఆడించి, "నోనోనో! భవిష్యత్తు కోరుకునేవాళ్లు భవబంధాలకి దూరంకావాలి. అంటే నా వుద్దేశ్యం మనం మద్రాసు వెళ్లి అక్కడో యిల్లు చూస్కుని ఓ రెండు మూడు పిక్చర్లు చేతిలో పెట్టుకుని అప్పుడు మీ అమ్మని తీసుకు వెళితే అందంగా వుంటుంది. హుందాగా ఉంటుంది. అప్పుడు మీ అమ్మనేకాదు, మీ నాన్నని, మీ తమ్ముణ్ణి కూడా తీసుకుపోదాం. అంతేగాని, ఆలూచూలూ లేకుండా మీ అమ్మనీ, తమ్ముణ్ణి కూడా తీసుకు వెళ్తే మనం సినిమా ఏక్టర్లం అవడానికొచ్చాదు, అక్కడున్న సినిమాయాక్టర్లని చూడ్డానికెళ్లినట్టుంటుంది"

అతను చెప్పిందేమీ ఆమెకు నచ్చలేదు! ఒంట్లో ఒణుకు ప్రారంభమయింది! తల్లికి చెప్పకుండా వరదరాజులుతో మద్రాసు వెళ్లిపోవడమా? అదీ ఒకటి రెండు రోజుల ట్రిప్పుకాదు. ఎన్నాళ్లు వుండాలో, ఎన్నేళ్లు వుండాలో అసలు చచ్చేంతవరకూ అక్కడే వుండాలో...

"వద్దు వరదా! అమ్మ లేకుండా నేను మద్రాసు రాలేను" అనేసింది కిరణ్మయి.

వరదరాజులుకి ఆమె వాదన నచ్చలేదు! వీధిలోకి చూసాడు. సరోజమ్మ రావడం లేదు.

కిరణ్మయికి మరింత దగ్గరగా వచ్చి ఆమెకు నచ్చజెప్తున్నట్లుగా అన్నాడు. "నువ్వు మొన్నటి వరకు పార్వతివి! ఇప్పుడు కిరణ్మయివి. మొన్నటికీ యిప్పటికీ నీ పేరు మారింది. రేపటినుంచీ నీ వూరు మారుతుంది. ఈనాటి వరకు నాటకాలాడిన అమ్మాయి రేపట్నించీ సినిమాస్టార్ కాబోతోంది. నీ దశ మారిపోయి, దరిద్రం వదిలిపోతున్నప్పుడు నీ ఆలోచనలూ మారాలి! మనకి ఎంత దశ తిరుగుతున్నా, వెళ్లిన వెంటనే అదృష్ట దేవత వచ్చి నీ మెడలో దండవేసెయ్యదుగదా! మనమూ కొన్నాళ్లు, కేవలం కొన్నాళ్లపాటు యిబ్బందిపడాలి! మనకో ధ్యేయం వుంది, మన ఒంట్లో ఓపికుంది కాబట్టి ఆ యిబ్బందులేవో మనం పడగలం! కానీ మీ అమ్మ ముసలావిడ! పైగా ఆవిడ ఆరోగ్యం కూడా అంతంత మాత్రం... మనం ఆవిణ్ణి మద్రాసు తీసుకెళ్లి సుఖపెడితే బాగుంటుందిగాని, అక్కడకి

తీసుకెళ్ళికూడా కష్టపెడితే ఏం బాగుం టుంది? "

కిరణ్మయి అతను చెప్పే ఏ మాటనీ ఖండించలేకపోతోంది! అన్నీ నిజాలే, అన్నీ తన క్షేమం, తన తల్లి క్షేమం కోరి చెప్తున్నవే!

"మనం మద్రాసు వెళ్తున్నామని చెప్తే ఆవిడ కంగారుపడొచ్చు, వెళ్లొద్దనొచ్చు లేదా తనూ నీ వెంట వస్తాననొచ్చు. అంచేత నీకు గూడూరులో సడన్‌గా నాటకం తగిలిందని చెప్పు! నీకు ఎస్కార్టుగా నేను వస్తున్నానని చెప్తే కాస్త నిబ్బరంగా వుంటుంది. మనం మద్రాసు వెళ్లగానే, పరిస్థితులన్నీ వివరిస్తూ ఆవిడకి పెద్ద పుత్తరం రాయొచ్చు! వుత్తరం చదివాక ఓ గంటో, రెండు గంటలో బాధపడినా, నువ్వు సాధించబోయే ఘన విజయాన్ని తల్చుకుని సంబరపడిపోతుంది. ఎంతయినా తల్లికదా..."

కిరణ్మయి మనసులోని ఆందోళన తగ్గినట్టనిపించిందిగాని తగ్గలేదు! వరదరాజులు యిప్పుడు వుపదేశం మానేసి కర్తవ్యబోధన ఆరంభించాడు. "నీ బేంకులో వున్నదంతా విత్‌డ్రా చేసేసి మీ ఇంటి ఓనర్ గాడికి పాతబాకీ ముఖాన కొట్టేయ్! దాంతోపాటు మరో రెండునెల్ల అద్దె ఎడ్వాన్సుగా వాడి ముఖాన కొట్టేవనుకో వాడు ఓ రెండు నెలలదాకా మీ అమ్మ ముఖం చూడడు! మీ అమ్మ యింటి ఖర్చులకి కూడా ఎంతో కొంత యిచ్చెయ్! అది గూడా డైరెక్ట్‌గా యిస్తే ఆవిడకి అనుమానం రావచ్చు అంచేత ఏ బీరువాలోనో ఏ తలగడకిందో పెట్టెయ్"

కిరణ్మయి అలాగే అంటూ తల వూపుతుందనుకున్నాడుగాని ఆమె తలవూపలేదు, కాదని గూడా అనలేదుకాబట్టి ఆమె మానసిక పరిస్థితి తనకి అనుకూలంగానే వుందని గ్రహించి మరింత ధైర్యం కలగడానికి మరో మాట కూడా చెప్పేడు. "మహామహా నటులు, నటీమణులంతా యిలా అర్థాంతరంగా జెండా ఎత్తేసి సినిమా ఫీల్డ్‌లో జెండా ఎగరేసిన వాళ్లే. కిందటి సంవత్సరం ఆస్కార్ అవార్డుకొట్టేసిన జపాన్ హీరోయిన్ సినిమాల్లోకి ఎలా వెళ్లిందనుకున్నావ్? అక్షరాలా యిలాగే..."

వరదరాజులు మాటల్లో ఏదో మంత్రశక్తి వుంది! దానికి ఎవరైనా ముగ్ధులు కావాల్సిందే! ఆ మాటల్లో కనిపించని నాగస్వరం వుంది. దాని నాదానికి ఎవరైనా తల ఆడించాల్సిందే.

సరోజమ్మ వచ్చింది. గూడూరు పరిషత్తువారు అర్జంటుగా రమ్మని తనకి టెలిగ్రాము యిచ్చేరని చెప్పి జేబులోనించి ఏదో పాత టెలిగ్రాము పైకి తీసేడు వరదరాజులు.

మర్నాడు వుదయం కిరణ్మయి దీర్ఘాలోచనలో వుంది.

చికాకు కలిగించే ఆలోచనల్తో ఆమె మనసు కీకారణ్యంలా తయారయింది. ఆమె యిప్పుడు ఆలోచిస్తున్నది తల్లిని తీసుకెళ్లకుండా మద్రాసు ఎలా వెళ్లాలన్న విషయమే!

ఆమెకో రెణ్ణెల్ల ఖర్చులకి సరిపడే డబ్బుని బీరువాలో పెడుతుంది. అద్దె విషయం గూడా సెటిల్ చేసే వెళ్తుంది.. కానీ కానీ ఆమెకు ఎవరు తోడుంటారు?

తన తండ్రి ఈ యింటికిరాడు! వచ్చినా ప్రేమగా చూడడు! తమ్ముడు కృష్ణ కూడా అంతే! తను యింట్లో లేకపోతే వాడు నాలుగు కాళ్లతో పరుగెత్తే మనిషి... తను వూళ్లో లేనప్పుడు తల్లికి ఏ జబ్బో, జ్వరమో వస్తే చూసేనాధుడేడీ? "

ఆలోచనల్తో విసుగొచ్చి మంచం మీదున్న ఓ సినిమా పత్రిక తీసి పేజీలు తిరగేసింది.

'ప్రఖ్యాత సినీ తార అమెరికా పర్యటన అనుభవాలు' అంటూ సినీనటి వనజశ్రీ ఫొటోలు వేశారు. అందులో ఆమె వెల్లడించిన అభిప్రాయాలతో పాటు కొంతమంది హాలీవుడ్ నటీనటులతో తీయించుకున్న




ఫొటోలు కూడా ప్రచురించారు.

వనజశ్రీది విజయనగరం! ఆమె అసలు పేరు రవణమ్మ! మొదట్లో రికార్డింగ్ డాన్సులు చేసింది. బుర్రకథలు చెప్పింది. తర్వాత ఎమ్యూజ్‌మెంట్ పార్కులో కేబరే డేన్స్ పేరుతో అశ్లీలకరమైన డేన్సులు చేస్తుంటే పోలీసులు అరెస్టు చేయడం, జరీమానా కట్టి బయటపడ్డం జరిగింది. ఇవన్నీ తనకి తెలిసిన విషయాలే! సినిమా వేషాల కోసం అడ్డమైన వారి కాళ్లూ పట్టింది, మంచాలూ ఎక్కింది, పార్టీలూ యిచ్చిందని గూడా తను విన్న విషయాలే! కొన్ని సినిమాల్లో గ్రూప్ డేన్సరుగా, తర్వాత క్లబ్ డేన్సరుగా డేన్సులు చేశాక, మెల్లగా హీరోయిన్ వేషాలదాకా వచ్చింది. ఆవిడకి నటన అనే మాటే తెలియదు! ఆమెది బొంగురు గొంతు కావడంవల్ల ఆవిడకి మరో డబ్బింగ్ ఆర్టిస్టు చేత డైలాగులు చెప్పిస్తున్నారు. ఆవిడిప్పుడు ప్రఖ్యాత సినీనటి.

అమెరికా ప్రయాణం, ఇంగ్లీషు పిక్చర్స్‌లో నటించమంటూ నాలుగు ఆఫర్లు వచ్చినా, తల్లివంటి తెలుగు సినిమారంగానికి ద్రోహం చెయ్యడం యిష్టంలేక తిరస్కరించానంటూ ఆమె కోతలు కోయడం, ఆ కోతలకి పత్రికలవాళ్లు ప్రత్యేకంగా బాక్సు కట్టి ప్రచురించడం, కాబోయే హీరోయిన్లకి ఆవిడ యిచ్చే సలహాలంటూ, రకరకాల సబ్‌హెడ్డింగుల్తో, ఆవిడిచ్చిన సలహాల్ని ప్రచురించారు! ఆ పత్రిక మీద గూడా ఆవిడ ఫొటోనే ముఖచిత్రంగా వేశారు.

వరదరాజులు చెప్పిన వుపదేశానికి స్పందించి ఆలోచించిందానికంటే, వనజలాంటి ఓ గులకరాయి, ఓ కోహినూరు వజ్రంలా చెలామణీ కావడం కిరణ్మయిని మరింత ఆలోచింపజేసింది! తను తన టాలెంటుని నిరూపించుకోవాలంటే తప్పకుండా మద్రాసు వెళ్లాలి! అందుకోసం తాత్కాలికంగా కొన్నాళ్లపాటు తల్లికి దూరం కాక తప్పదన్న నిర్ణయానికి కూడా వచ్చేస్తుండగా, సరోజమ్మ వచ్చి, ఇంటి ఓనరు వెంకట్రామయ్యకివ్వాల్సిన అద్దె విషయం గుర్తుచేసింది. "ఆ సుబ్బారావు నీకింకా కిరాయి యివ్వలేదుగదా దాన్ని వసూలు చేసుకొచ్చి వాడి మొఖాన కొట్టకూడదటే" అంది.

కిరణ్మయి సంశయాలు తీరిపోయి, ఆమె నిర్ణయానికో బలం వచ్చేసింది కాబట్టి గబగబా బట్టలు మార్చుకుని, బీరువాలోనించి పాస్‌బుక్ తీసి, హేండ్‌బేగ్‌లో పెట్టుకుని, గాగుల్స్ తగిలించుకుని "నేను సుబ్బారావు గారింటికెళ్తున్నాను" అంటూ బయటికి నడిచింది! అప్పటికే పన్నెండు దాటింది. చెంగల్రావుపేట జంక్షన్‌లోని రిక్షావాళ్లందరికీ ఆమె తెలుసు! ఆమె ఎప్పుడు ఏ రిహార్సల్సుకి వెళ్ళినా రిక్షామీదే వెళ్తుంది కాబట్టి, ఆమెను చూడగానే యిద్దరు ముగ్గురు రిక్షావాళ్ళు తమ రిక్షాల్ని ముందుకు తీసుకొచ్చేరు. ఆమె రాములు అనే రిక్షావాడి రిక్షా ఎక్కి కూర్చుని "ఆంధ్రా బ్యాంకుకి పోనియ్" అంది.

ఆంధ్రాబ్యాంకులో, కిరణ్మయితోపాటు నాటకాలు వేసిన నటులు కొందరున్నారు! వారి సహకారంవల్ల ఆమెకు విత్‌డ్రాయల్ పనంతా పదినిమిషాల్లోనే అయిపోయింది! మళ్ళీ, అదే రిక్షా ఎక్కి సుబ్బారావు ఇంటి ఎడ్రస్‌చెప్పి అక్కడకి పోనివ్వమంది. కానీ రిక్షా వెళ్తుండగా ఆమెకో అనుమానం వచ్చింది. ఈవేళప్పుడు సుబ్బారావు ఇంట్లో వుంటాడు. వుంటే డబ్బు యిచ్చెయ్యొచ్చు ఒకవేళ యివ్వకపోయినా సౌమ్యంగా సమాధానం చెప్పి పంపిస్తాడు! అలా కాకుండా ఆయనకి బదులు ఆయన మూడోపెళ్ళాం నీలమణి వుంటే డబ్బు యివ్వకపోగా లక్షా తొంభై ప్రశ్నలు వేస్తుంది! మేం డబ్బు ఇవ్వకుండా వైజాగ్‌నించి పారిపోతామని రిక్షా వేస్కుని మరీ మా ఇంటికొచ్చేవా? అని అరుస్తుంది! పైగా సుబ్బారావు కాకినాడ పరిషత్తుకోసం రిహార్సల్సుకి రావాల్సిన తేదీలు చెప్పేడు. ఆ తారీఖుల్లో తాను రాలే

నని చెప్తే, మరీ గయ్‌మంటూ లేస్తుంది. తనని వీధిలో నిలబెట్టి మరీ అల్లరి చేస్తుంది అంచేత సుబ్బారావు ఇంటికి వెళ్ల కుండా ఈసారికి ఆ కిరాయికి నీళ్ళువదిలె య్యడమే మంచిదనిపించి, రిక్షాని వెనక్కి తిప్పి, ఇంటికి పోనివ్వమంది.

రిక్షా ఇంటిదారికి మళ్ళుతుండగా, ఆమెకు సడన్‌గా తండ్రి గుర్తుకొచ్చాడు! తను మద్రాసు వెళ్ళిపోతోంది, మళ్ళీ ఎన్నాళ్ళకి తిరిగొస్తుందో తెలీదు! ఓసారి తండ్రిని చూసి వెళ్దామనిపించి, రిక్షాని కోటవీధివైపు తిప్పించింది. తండ్రి వుంచుకున్న రాజేశ్వరి ఇల్లు ఆమెకు గుర్తే. గతంలో ఒకటి రెండు సార్లొచ్చింది. ఆ ఇంటికి ఓ పది అడుగుల దూరంలో రిక్షా ఆపించి, రిక్షాదిగి ఆ ఇంటి దగ్గరకి వెళ్ళింది.

ఇంటి ముంగిట్లోనే ఎవరో స్త్రీకి తల దువ్వుతూ, పేలు తీస్తున్న రాజేశ్వరి రిక్షా ఆగడం, కిరణ్మయి రావడం అంతా గమ నించి, కిరణ్మయి ఏమీ అడక్కముందే బిగ్గ రగా, కర్కశంగా,

"ఎందుకొచ్చేవ్? అతగాడులేడు" అంటూ అరిచింది!

అది చిన్న వీధి కావడంవల్ల రాజేశ్వరి బిగ్గరగా అరిచిన అరుపుకి ఆ వీధిలోని ఆడా, మగా తలలుతిప్పి అటువైపు చూశారు.

కిరణ్మయి మొదటి జవాబుతోనే కాస్త యిరకాటంలోపడి "ఎప్పుడొస్తాడు? " అని మెల్లగా అడిగింది.

"ఏమో, ఎవులికి తెల్సు! తాగుబోతు ఎదవలు ఎప్పుడు కొంపకి చేరుకుంటారో, ఎవుడికి తెలుస్తాది? వస్తే ఓ గంట తర్వా తరావచ్చు, లేదా ఓ వారం పదిరోజుల్దాకా రాకపోవచ్చు"

కిరణ్మయికి రాజేశ్వరిలాంటి గయ్యాళితో మాట్లాడ్డానికి కాస్త బెరుగ్గావున్నా, తన తండ్రిని ఆమె మరీ అంత సంస్కారహీ నంగా మాట్లాడేసరికి ఆమెకూ కాస్త కోపం వచ్చి "భర్తనలా అమర్యాదగా మాట్లాడ్డం భావ్యం కాదు" అంది.

"ఓయబ్బో, భర్తటభర్త? మీ బాబుకి మరీ అంత మర్యాదిచ్చెయ్యడానికి అతగాడే వైనా జిల్లాకలట్రా? గవున్నేరా? నా జీత మంతా నీకే ముట్టజెప్తానే రాజేశ్వరీ అని నాకు మాయమాటల్చెప్పి, నన్నీయింట్లో తగ లెట్టేడు. అయితే, ఏం లాభం? తెచ్చిం దాంట్లో సగానికి సగం నువ్వూ, మీ అమ్మా ఒలిచేసుకుంటున్నారు. మిగిలిందంతా సారా కొట్టుకి జమకట్టేస్తున్నాడు. మీ యిల్లు గడ వడానికి, టేజీమీద నువ్వేం నాటకాలాడత న్నావో, టేజీ ఎనక ఏం నాటకాలాడత న్నావో గాని, నీ సంపాదన్తో నీ ఇల్లు బాగానే తగలడుతోంది! కానీ మీరంతా కలిసి నన్నే ముష్టిదాన్ని చేసేసేరు, నేను నీలాగ నాటకాలూ ఆడలేను, రంగుల రాట్నం లాగ తిరుగుళ్లూ తిరగలేను"

రాజేశ్వరి బిగ్గరగా మాట్లాడ్డంతోపాటు పూనకం వచ్చిందానిలా గెంతులు కూడా వేస్తుండేసరికి చాలామంది జనం దగ్గరకొచ్చి చూడనారంభించారు. కిరణ్మయి తను నిప్పు లగుండంమీద నిల్చున్నట్టుగా కొన్ని క్షణాల పాటు అక్కడ నిలబడి యింక నిలబడలేక గబగబా రిక్షా దగ్గరకొచ్చి ఎక్కి కూర్చుని "పోనియ్ రాములూ" అంది రిక్షావాడితో. కానీ రాజేశ్వరి జనాన్ని తప్పించుకుని పరు గెత్తుకుంటూ వచ్చి రిక్షాకి అడ్డంగా నిలబడి కిరణ్మయికి వార్నింగ్ యిచ్చింది.

"మళ్ళీ నా మొగుడి గురించి ఆరాలు తియ్యడానికి నువ్వొచ్చినా, మీ అమ్మ వచ్చినా ఈసారి పేడనీళ్లు మీ మొఖాన కొడ తానని గుర్తెట్టుకో" అంది.

రిక్షా కదిలింది!

"అదెవుర్తమ్మా! రాచ్చసిలా అలా రంకెలేస్త న్నది? అదేం ఆడ పుట్టక పుట్టినట్టు లేదే! పక్కా భటాచోరుముండలా అవుపిస్తున్నాది" అంటూ రిక్షా తొక్కుతున్నాడు రాములు.




కిరణ్మయికి ఏం సమాధానం చెప్పాలో తెలియక మౌనం వహించింది! తన తండ్రి ఎన్నిసార్లు కొట్టినా, తిట్టినా తన తల్లి ఏనాడూ ఎదురు చెప్పడం తను చూడలేదు! అలాంటిది, తన తండ్రి, తన తల్లిని వదిలేసి యిలాంటి రౌడీ మనిషితో కాపురం ఎందుకు పెట్టాడా? అని ఆలోచనలో పడింది! ఆలోచన తెగకముందే ఇంటి ఓనరు వెంకట్రామయ్య ఇల్లు వచ్చేసింది. ఆ ఇల్లు తన ఇంటికి పక్క వీధిలో వుంది గనుక రిక్షా దిగి, రాములుకి డబ్బులు ఇచ్చేసి వెళ్లిపొమ్మని చెప్పి, ఆ ఇంట్లోకి నడిచింది.

ఆమె బాకీ పడిన అద్దెతోపాటు మరో రెణ్ణెళ్లు అద్దె యిచ్చేసరికి వెంకట్రామయ్యకి ఆనందంకంటే, ఆశ్చర్యమే ఎక్కువ కలిగి, టపటపమంటూ నాలుగైదు ప్రశ్నలు వేసాడు. అన్నింటికీ కలిపి కిరణ్మయి ఒక్కటే సమాధానం చెప్పింది "ఎందుకిచ్చేనో, ఈ డబ్బు నాకెలాగొచ్చిందో మీకు అనవసరం. మరో రెండు నెల్లదాకా, అద్దె కోసం మీరు మా ఇంటి గుమ్మం తొక్కడానికి వీల్లేదు" అంటూ వార్నింగిచ్చి, అక్కడ నించి ఇంటికి నడుచుకొచ్చింది.

కిరణ్మయి ఇంటికొచ్చేసరికి సరోజమ్మ నేల మీద చీరచెంగు పరుచుకుని మూగన్నుగా నిద్రపోతోంది! ఆమెకి నిద్రాభంగం కాకుండా వంటింట్లోకెళ్ళి ఏదో యింత ఎంగిలిపడి బయటకొచ్చి, హేండ్‌బేగ్‌లోనించి ఓ మూడు వందలు తీసి, తల్లి బట్టలు పెట్టుకునే ట్రంకు పెట్టెలో పెట్టింది! తను మద్రాసు బయలుదేరడానికి అన్ని పనులూ పూర్తిచేసేసుకున్నట్టే అనుకుంటుండగా, తమ్ముడు కృష్ణ జ్ఞాపకం వచ్చేడు.

తమ్ముడి వివరాలు ఆ వీధి చివర్లో వున్న కిళ్లీ దుకాణం సూర్యారావుని అడిగితే తెలుస్తుందని గబగబా చెప్పులు వేస్కుని ఆ కిళ్లీ దుకాణానికెళ్లి వాకబు చేసింది. "మీ తమ్ముడు విజయనగరం పండక్కి వెళ్లాడు. మరో రెండు రోజుల్దాకారాడు" అన్నాడు సూర్యారావు! ఇంటికి తిరిగొచ్చి, అప్పటికే సర్దేసుకున్న తన పెట్టెలో తన ఆల్బమ్, పరిషత్తుల్లో యిచ్చిన సర్టిఫికేట్లు కూడా పెట్టింది!

మరో అరగంటలో వరదరాజులు సూట్‌కేసు పట్టుకుని రిక్షాలో వచ్చేడు. "రెడీ అయేవా లేదా?" అంటూ అతను వస్తూనే కిరణ్మయిని హడావిడి పెట్టేడు. "అమ్మాయి రెడీగానే వుంది. కానీ, మాటిమాటికీ నిన్నే శ్రమపెడుతున్నాం బాబూ! యిప్పుడు నా ఒంట్లో కులాసాగానే వుందిగా, ఈసారికి నేనే అమ్మాయి వెంట వెళ్తాన్లే" అంటున్న సరోజమ్మ మాటలకి వరదరాజులు గతుక్కుమన్నాడు. "ఇందులో నాకు శ్రమేం వుందక్కయ్యా! అది నా బాధ్యత! ఈసారి నేను ఆ పరిషత్తులో వుపన్యాసం కూడా యివ్వాలని టెలిగ్రాములో రాసేరు. నేను కిరణ్మయి వెంట వెళ్తే నా పనీ అయిపోయినట్టుంటుంది. తన పనీ అయిపోయినట్టుంటుంది. ఈ ఒక్కసారికీ నేను వెళ్ళొస్తాలే" అంటూ ఆమెను ఒప్పించేశాడు.

కిరణ్మయి, వరదరాజులూ రిక్షామీద బయలుదేరారు. ఎప్పుడూలేంది, యింటి గుమ్మందాటుతుండగా, కిరణ్మయి కళ్లంట నీళ్ళొచ్చినా, తల్లి చూడకుండా రుమాలుతో కళ్ళు ఒత్తుకుంది!

రిక్షా స్టేషన్ వైపు కదిలింది!



మద్రాస్ సెంట్రల్ స్టేషన్‌లో దిగి వరద

రాజులు ఆటోవాడితో తమిళంలోనే మాట్లాడి, కిరణ్మయిని తీస్కుని పాండీబజార్లో వున్న భార్గవీ లాడ్జి దగ్గర ఆటో దిగేడు!

అదృష్టవశాత్తు ఒకే ఒక్కడబుల్ రూమ్ ఖాళీగా వుంది. ఆరూమ్ నెంబర్ సెవెన్! "సెవెన్ ఈజ్ మై లక్కీ నెంబర్! చూసేవా అప్పుడే శుభసూచకాలు ఆరంభమయ్యేయి!" అన్నాడు వరదరాజులు హుషారుగా!

కిరణ్మయికి మద్రాసు మరీ కొత్తేమీ కాదు! కళాసాగర్ యిత్యాది సంస్థలవారు నిర్వహించిన సాంస్కృతిక కార్యక్రమాల్లో, ఆంధ్రనాటక సమాజాల తరపున వచ్చి నాటకాలు వేసింది. అలా వేసినప్పుడు, వాళ్ళే స్టేషన్‌కి వేన్ పంపించి రిసీవ్‌చేస్కోడం, ఏదో కల్యాణ మండపంలో బసచేయించడం, థియేటర్లో నాటకం వేసాక, మళ్లీ స్టేషన్ కొచ్చి విశాఖపట్నానికి ఏ ట్రేనుంటే, ఆ ట్రేను ఎక్కిస్తే వచ్చేయడం మినహా, అంతకుమించి మద్రాసు నగరంతో పరిచయం లేదు!

స్నానాలు అయేక టిఫిన్లు చేస్తుండగా వరదరాజులు- "చూడ్డానికిది చాలా చిన్న లాడ్జీలాగున్నా యిది చాలా సిరి అయిన లాడ్జీ! పెద్దపెద్ద స్టార్లయిన వాళ్ళలో చాలామంది మొదట ఈ లాడ్జీలోనే దిగేరట! అందులోనూ, మరీ పెద్ద పొజిషన్ కొచ్చిన వార్లో చాలామంది యిదే రూమ్‌లో దిగేరు. మనమూ ఈ రూమ్‌లోనే దిగేం!" అంటూ ఆ లాడ్జి గురించి, తమకు తిరగబోయేదశ గురించి చెప్పుకుపోతున్నాడు.

కిరణ్మయి చెవులు ఆ మాటలు వింటున్నా మనసు మాత్రం యింకా విశాఖపట్నంలోనే, పరిభ్రమిస్తోంది!

ఆమె మనోభావాల్ని గమనించి "కిరణ్... నీ వైజాగ్ జీవితాన్ని వాల్తేరు దాటగానే వదిలేయాలి! ఇది మరో ప్రపంచం! సినీ ప్రపంచం! ఈరోజునించి నువ్వు ఏది ఆలోచించినా డ్రామెటిగ్గాకాదు, సినిమాటిగ్గా ఆలోచించాలి" అన్నాడు. కిరణ్మయి ఏమీ బదులు చెప్పకుండా, టిఫిన్ చెయ్యడం ముగించి చెయ్యి కడుక్కుంది!

"ఇంతకీ ఎంత తీసుకొచ్చేవ్?"

ఓ పావుగంట తర్వాత వరదరాజులు సడన్‌గా అడిగిన ప్రశ్నకి ఆమె వులిక్కిపడింది. పెట్టి తెరచి డబ్బు లెక్కపెట్టింది. బ్యాంకునించి విత్‌డ్రా చేసిందాంట్లో ఇప్పుడు లాడ్జీకిచ్చిన అడ్వాన్సు వైజాగ్‌లో చేసిన ఖర్చులుపోను, చేతిలో వున్నది పదిహేను వందల చిల్లర! ఆమాట వినగానే వరదరాజుల్లోని హుషారు చాలావరకు తగ్గిపోయింది! అయినా, తన నిరుత్సాహాన్ని ఓ నవ్వు వెనక దాచేస్తూ "ఆల్‌రైట్ బడ్జెట్ తక్కువగా వుంది కాబట్టి, పొదుపుగా ఖర్చు చేద్దాం" అన్నాడు.

"ఈ లాడ్జీలో మనం ఎన్నాళ్లుండాలి?"

"అట్టే రోజులుండక్కర్లేదు. మూర్తి అని మా ఫ్రెండొకడు, ఈ ప్రాంతంలోనే వున్నాడు. వాణ్ణి కల్సుకుంటే వాడే మనకేదో చిన్న ఇల్లు ఏర్పాటుచేస్తాడులే" అన్నాడు ధీమాగా. కిరణ్మయి నిస్త్రాణగా ఫీలవుతూ, మంచంమీద వాలింది.

"వెరీగుడ్! యివాళంతా నువ్వు చెయ్యాల్సిన పని యిదే! నువ్వు రెస్ట్ తీస్కో! నేను ఈలోగా మా మూర్తిగాడికోసం వేటాడి పట్టేస్తాను" అంటూ కిరణ్మయి పెట్టెలోనించి కొంతడబ్బు తీస్కుని బయటకి నడిచాడు.

తలుపు గడియ పెడదామనుకుంటూనే, కిరణ్మయి బడలికవల్ల మంచంమీదనించి లేవలేక, అలాగే నిద్రలోకి జారిపోయింది.

రాత్రి తొమ్మిది దాటేక, వరదరాజులు రూమ్ చేరుకున్నాడు. తలుపు గడియ వేసుందేమోనని తలుపు తట్టబోయేడుగాని, యిలా చేత్తో తాకగానే తలుపులు తెరుచుకున్నాయి. మధ్యాహ్నం వేసిన లైటు అలాగే వెలుగుతోంది. కిరణ్మయి మత్తుగా నిద్రపోతూనే వుంది. ఆ వెలుతుర్లో, మంచంమీద కిరణ్మయి వెల్లికిలా పడుకుని వుంది. ఆమె





ఒంటి మీదున్న తెల్లచీర పిక్కలదాకా ఎగిసి వుంది. ఎగిసివున్న చీర ఆమె తెల్లని బలమైన కాళ్ల అందాల్ని చూపించడానికి సాయపడుతోంది. పైట కూడా తొలగడంవల్ల ఆమె ఎత్తయిన స్థనద్వయం పైకీ కిందకీ ఎగిసిపడుతూ వరదరాజులు మనసుని తియ్యగా నులిమింది. ఆమె ముఖంలో చందమామ మెరుస్తోంటే, పెదవుల్లో సంధ్యారాగం శోభిస్తోంది. అతని మనసు వణికింది. మనిషి వణికాడు. తనూ ఆమె ఎన్నో వూళ్లు తిరిగారు. ఎంతో చనువుగా మసిలారు. కానీ బయటవాళ్లంతా అనుకుంటున్నట్టుగా ఇంతవరకు తమ యిద్దరిమధ్య శారీరక సంబంధంలేదు. కనీసం ప్రేమ చిహ్నంగా ఒక్కసారీ ముద్దుపెట్టుకోలేదు. ఆమె అందుకు ఎప్పుడూ అవకాశమివ్వలేదు, తనూ ప్రయత్నించలేదు. ఒణుకుతున్న మనసుని, శరీరాన్ని అదుపులోకి తెచ్చుకుని మెల్లగా వెళ్ళి తలుపు గడియవేసి, లైటు ఆర్పి, బెడ్‌లైటు వేసాడు. బెడ్‌లైటు వెలుతుర్లో ఆమె అందం మరీ చిత్రంగా, మరీ ఆకర్షణీయంగా కనిపిస్తోంది. మెల్లగా ఆమెను చేరుకున్నాడు.

తన పెదవులమీద ఏదో స్పర్శ, ఒంటి మీద ఏదో బరువు పడుతుండేసరికి, కిరణ్మయికి మెలకువ వచ్చింది. కళ్లు తెరిచింది. ముఖానికి ముఖం రాస్తూ వరదరాజులు... ఏం జరుగుతోందో క్షణాలమీద అర్థం చేసుకుని, గభీమని అతన్ని వెనక్కి నెట్టి, ఆమె మంచంమీదనించి లేచి నిలబడింది.

"సారీ... నీకూ యిష్టం వుంటుందనుకున్నాను" వరదరాజులు మెల్లగా గొణిగాడు.

"ఇష్టాయిష్టాల సంగతి గురించి కాదు. మనం ఇక్కడకొచ్చింది దీనికోసం కాదుగా"

కిరణ్మయి మాటల్లో కఠినత్వం కనబడకపోయినా, అయిష్టతమాత్రం స్పష్టంగా కనిపించేసరికి వరదరాజులు మరేమీ మాట్లాడకుండా, తలుపులు తెరచి, బోయ్‌ని పిల్చి

కేరియర్ తెప్పించే ఏర్పాట్లలో పడ్డాడు.

★ ★ ★

మర్నాడు వరదరాజులు, కిరణ్మయి నిన్న రాత్రి జరగబోతూ ఆగిపోయిన సంఘటన గురించి ఒక్క మాటా మాట్లాడుకోలేదు. కిరణ్మయి మనస్తత్వం గురించి తనకి పూర్తిగా తెలుసునని భావిస్తున్న వరదరాజులు మాత్రం "ఈమె నాకు సగమే అర్థమయింది" అని మనసులోనే అనుకున్నాడు. ఆరోజు కూడా ఆమెను గదిలోనే వుంచి, సాయంత్రంవరకు ఎక్కడెక్కడో తిరిగి, సాయంత్రం ఆరుగంటలప్పుడు ఓ చీటిపట్టుకుని వచ్చేడు. అందులో మూడు నాలుగు పేర్లున్నాయి. అవి ఏమిటని అడిగింది "తేనాంపేటలో రంగరాజపిళ్లే అని ఓ గొప్ప న్యూమరాలజిష్టున్నాడు. అతను సంఖ్యా శాస్త్రం ప్రకారం స్టడీచేసి, ఎవరు ఏ పేరు పెట్టుకుంటే సినిమా ఫీల్డులో రాణిస్తారో చెప్పగలడు. ఇవాళ టాప్ పొజీషన్లో వున్న చాలామంది అతని చేత పేర్లు పెట్టించుకున్నవాళ్లే! కొంతమంది వాళ్ల సొంతపేర్లతో షైన్ అయినా, ఎక్కువమంది యీయన పెట్టిన పేరుతోనే సర్రమంటూ తారాపథానికి ఎదిగిపోయేరు. నీ పుట్టిన తేదీ, నీ నక్షత్రం, నీ రాసి అన్నీ ఆయనకి చెప్తే వందరూపాయలు ఫీజు తీస్కుని, ఈ మూడు పేరుల్లో ఏది పెట్టుకున్నా నువ్వు టాప్‌స్టార్‌వవడం ఖాయం అని చెప్పేడు" అన్నాడు వరదరాజులు.

చీటి అందుకుని కిరణ్మయి చదివింది, "పూజిత, ప్రేమశ్రీ, సింధుశ్రీ" ఆ పేర్లు చదివి ఆ చీటిని నిరాసక్తంగా నలిపి పారేసింది.

"అదేమిటి? " అన్నాడు వరదరాజులు చిరాగ్గా!

"ఈ పేరుల్నిబట్టి మనిషి అదృష్టం అనే మాటని నేను నమ్మను వరదా! ఇలా, న్యూమరాలజీ ప్రకారం పేర్లు పెట్టుకున్నంత మాత్రాన షైన్ అవుతారనిగాని, సొంత పేరుతో వున్నవాళ్ళు షైన్ అవరని గాని ఏమీలేదు. అదంతా, మన తలరాతనిబట్టి ఆధారపడి వుంటుంది. పైగా పేరు మార్చుకోవడంలోనే సరదా వుందనుకుంటే, నా పేరు కూడా మారిందిగదా! మా అమ్మా, నాన్నా నాకు పార్వతీ అని పేరుపెడితే, ప్రజల సమక్షంలో మంత్రిగారు నాకు కిరణ్మయి అని పేరు మార్చేరు. నాకు ఆ పేరే ముచ్చటగా వుంది! ఎందుకంటే నాకు పార్వతీ అని పేరు పెట్టినప్పుడు నా బారసాలకి ఎంతమందొచ్చేరో నాకు తెలీదు. కానీ నాకు కిరణ్మయి అని పేరు పెట్టినప్పుడు వేలాదిజనం వున్నారు. అందులో ఎందరో ప్రముఖులున్నారు, ప్రఖ్యాత రచయితలున్నారు, గొప్ప గొప్పనటులు, నటీమణులున్నారు. వాళ్ళంతా ఆమోదించిన పేరుని మార్చుకోవడం నాకిష్టంలేదు. పైగా కిరణ్మయి అనేది నా శక్తి సామర్థ్యాలతో నేను మూడుసార్లు సాధించిన అవార్డు పేరు! దాన్ని దయచేసి మార్చాలని ప్రయత్నించకు"

కిరణ్మయి చెప్పిన మాటల్ని వరదరాజులు ఖండించలేకపోయేడు. కిరణ్మయి మళ్లీ అంది, "మన దగ్గర డబ్బు చాలా తక్కువగా వుంది. యిలాంటి న్యూమరాలజీలు, హరోస్కోపులకోసం ఆ డబ్బుని ఖర్చుచేసేస్తుంటే, మనం పేర్లు కాదు ఈ వూరు మారి, మనవూరు వెళ్ళిపోవాల్సుంటుంది". కిరణ్మయి ఆమాట నవ్వుతూనే అన్నా అది అతనికి హెచ్చరికలాగే వినిపించింది. ఓ రెండు నిమిషాలతర్వాత "కాఫీ తాగుదామా? " అంది కిరణ్మయి. వరదరాజులు టైమ్ చూస్కుని "ఏడుకావస్తోంది, మన దగ్గర డబ్బులు తక్కువగా వున్నాయని నువ్వే అన్నావుగా! మరో గంటాగితే కారియర్ తెప్పించుకుని భోంచేసేద్దాం" అన్నాడు కాస్త అలిగినట్టుగా.

కిరణ్మయి అతని అలకని పట్టించుకో





కుండా- "మీ(ఫెండు మూర్తెవరో మనకి యిల్లు చూస్తాడన్నావుగా! ఆ సంగతేమ యింది? " అంది.

"వాడి యింటి అడ్రస్ పట్టేసాను. కానీ, వాడేదో వూరెల్లేడట. రేపు సాయంత్రం వస్తాడట. ఈలోగా రేపు ఉదయం మనం ఓ ప్రొడక్షన్ ఆఫీసుకి వెళ్లాలి. అదీ రేపటి మన ప్రోగ్రాం. అదే మన తొలి ప్రయత్నం. వేగంగా భోంచేసి పడుకోకపోతే, నీ ముఖం పీక్కుపోతుంది. గ్లామర్ దెబ్బతింటుంది" అంటూ కేరియర్ తెప్పించడానికి బోయ్‌ని పిలిచాడు వరదరాజులు!

★ ★ ★

మర్నాడు ఉదయం కిరణ్మయిని, ఆమె ఆల్బమ్‌ని తీసుకుని, వరదరాజులు వుస్మాన్ రోడ్లో వున్న ఓ ప్రొడక్షన్ ఆఫీసుకి వెళ్లాడు. ఆ కంపెనీ వాళ్ళు గతంలో పదిపన్నెండు సినిమాలు తీసిన వాళ్లేనని దార్లో ఆమెతో చెప్పేడు. వారిద్దరూ విజిటర్సు రూమ్‌లోకి అడుగుపెట్టగానే, ఓ వైపు నించి ప్రొడక్షన్ మేనేజర్ నాగేశ్వర్రావు పాన్‌పరాగ్ నములుతూ వచ్చి వరదరాజుల్ని ఎంతో పరిచయం వున్నవాడిలా పలకరించాడు. వరదరాజులూ అంత చనువుగానే పలకరించాడు.

"ఏంవోయ్ దొరా, మళ్లీ దిగబడ్డావన్న మాట" అన్నాడు నాగేశ్వరరావు అతని భుజంమీద చరుస్తూ.

"మళ్ళీ వస్తానని చెప్పే వెళ్లేగా" అంటూ కిరణ్మయిని పరిచయం చేసాడు. ఆమె నమస్కారం చేస్తే అతను షేక్‌హేండ్ కోసం చెయ్యిచాపేడు. ఆమె షేక్‌హేండ్ యిచ్చింది. వరదరాజులు అతనికి ఆల్బమ్ చూపించాడు. అందులోని ఫొటోల్ని, కిరణ్మయిని మార్చిమార్చి చూసి, చాలా బావుందన్నట్టుగా భుజాలు ఎగరేసాడు. అక్కడున్న సోఫాలో కిరణ్మయిని కూర్చోమని చెప్పి, బోయ్ చేత ఆమెకు కాఫీ తెప్పించాడు. తర్వాత వాళ్ళిద్దరూ కాస్త దూరంగా వెళ్ళి మాట్లాడుకున్నారు.

ఒకప్పుడు "చంద్రన్" అనే సాంస్కృతికసంస్థ అధిపతి దగ్గర బ్రోకర్‌లాంటి పని చేశాక, వరదరాజులు మద్రాసువచ్చి కొన్నాళ్లపాటు గడిపింది యీ నాగేశ్వరరావు లాంటి వాళ్లతోనే! ఆ పరిచయంతోనే, నాగేశ్వరరావు కూడా చనువుగా మాట్లాడుతున్నాడు.

వరదరాజులు కావాలనే గొంతు తగ్గించి మెల్లగా మాట్లాడుతున్నాడు. ఎందుకంటే అతను కిరణ్మయికి చెప్పకుండా దాచిన గత చరిత్ర నాగేశ్వరరావువల్ల బయటపడిపోతుందేమోనని భయపడుతున్నాడు. కానీ నాగేశ్వరరావు మాత్రం బిగ్గరగానే మాట్లాడుతున్నాడు. ఆ మాటలు కిరణ్మయికి విని పిస్తూనే వున్నాయి. నాగేశ్వరరావు వరదరాజులు మద్రాసులో పుడ్డుకి లాటరీ కొట్టిన విషయం, అప్పట్లో తనే మీల్స్ టిక్కెట్లిచ్చి ఆదుకున్న విషయం చెప్తుంటే, ఆ మాటలు కిరణ్మయికి వినబడకుండా వుండడానికి, టాపిక్ మార్చాలని ప్రయత్నిస్తున్నాడు. విజిటర్స్ రూమ్‌లో పెట్టిన కొన్ని స్టిల్సుని చూస్తూన్న కిరణ్మయికి, ఓ మాట వినిపించి తక్కుమని వెనుదిరిగి చూసింది.

"అయితే నేను చెప్పిన చిట్కాని అమలు చెయ్యడానికి నీకిన్నాళ్లు పట్టిందన్నమాట! ఏం మగాడివయ్యా నువ్వు? "

ఇది నాగేశ్వర్రావు అన్నమాట!

"వుష్... మెల్లగా మాట్లాడు గురూ, ఆవిడకి వినబడుతుంది" అంటూ వరదరాజులు నాగేశ్వర్రావుని కంట్రోల్ చెయ్యడానికి ప్రయత్నించాడు. అయినా నాగేశ్వర్రావు తన ధోరణిలోనే బిగ్గరగా మాట్లాడుతున్నాడు.

"వుష్షూలేదు గిష్షూలేదు, నువ్విక్కణ్ణించి వెళ్ళిపోయేక ఈ ఇండస్ట్రీ ఏమైనా మారిపోయిందనుకున్నావా? నీబోటి వాళ్లు నాలుగు వేషాలు సంపాదించాలన్నా, నాలుగు డబ్బులు సంపాదించాలన్నా, నేను నీకు

చెప్పిన చిట్కాయే యిప్పటికీ పనిచేస్తోంది"

ఈ మాటల్ని కిరణ్మయి వింటుందేమో నని అనుమానం వచ్చి వరదరాజులు ఆమె వైపు ఓసారి చూశాడు! అది గమనించి కిర ణ్మయి తన ముఖాన్ని ఫొటోకార్డ్సువైపు తిప్పేసుకుంది! అయినా ఆమెలో అప్పుడే ఓ సందేహం పుట్టుకొచ్చింది.

"వరదరాజులు వేషాలు సంపాదించడా నికి అతనికి నాగేశ్వర్రావు చెప్పిన చిట్కా ఏమైవుంటుంది? "

ఆ ప్రశ్న గురించి ఎక్కువగా ఆలోచించ డానికి వ్యవధిలేకుండా లోపల్నించి బెల్ మోగడం, నాగేశ్వర్రావు పాన్‌పరాగ్ వుమ్మేసి, లోపలకి పరుగెత్తి, రెండు నిమి షాల తర్వాత బయటకొచ్చి "రాగురూ క్విక్" అన్నాడు.

వరదరాజులు అతని వెంట వెళ్తుంటే, కిర ణ్మయీ అతన్తో పాటు వెళ్లబోయింది. "నువ్వొద్దు, యిది చాలు" అంటూ ఆమె చేతిలోని ఆల్బమ్‌ని తీసుకుని హడావిడిగా ప్రొడ్యూసర్‌రూమ్‌లోకి పరుగెత్తాడు.

ఓ పావుగంట తర్వాత అతను ఆల్బమ్ పట్టుకుని, తిరిగొచ్చేడు! అయితే, లోపల కెళ్ళినప్పుడున్న వుత్సాహం బయటికొచ్చిన ప్పుడు లేదనిపించింది, తర్వాత నాగేశ్వ ర్రావు కూడా వారిదగ్గరకొచ్చాడు. అతను పాన్‌పరాగ్ పొట్లంచింపి నోట్లో వేసు కుంటూ మునుపున్నంత హుషారుగానే వున్నాడు.

"పదా" అన్నాడు వరదరాజులు కాస్త నీర సంగా!

లోపల ఏం జరిగిందో తెలియకపోయినా, మర్యాదకోసం చిరునవ్వు చిందిస్తూ, "మరి మేం వెళ్లొస్తామండి" అంది నాగేశ్వర్రావుతో! అలాగేనంటూ ఆమెకు చెప్పి వరదరాజుల్తో మాత్రం-

"అదీ సంగతి... అటుపైన నీయిష్టం" అన్నాడు.

వరదరాజులు ఏమీ మాట్లాడకుండా కిర ణ్మయిని తీస్కుని బయటకొచ్చేసాడు! ఆఫీ సుదాటి ఓ పది గజాలు నడిచాక, కుతూ హలాన్ని అణచుకోలేక "ఏమన్నారు? " అని అడిగేసింది.

"నీ ఆల్బమ్ చూశారు"

"ఏమన్నారు? "

"ప్రొడ్యూసరు వూళ్లో లేడట... ఆయనొ చ్చేక చెప్తామన్నారు"

"ప్రొడ్యూసర్ వూళ్లో లేకపోతే, యింత సేపూ నువ్వు ఎవర్తో మాట్లాడినట్టు? "

"ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్‌తో"

కాస్సేపు నిశ్శబ్దంగా మరికాస్త దూరం నడిచాక- "ఆ నాగేశ్వర్రావు నీతో అదీ సంగతి, అటుపైన నీయిష్టం అన్నాడు, ఏవిటా యిష్టం? " అని కిరణ్మయి ఆసక్తిగా అడిగింది.

వరదరాజులు జవాబు చెప్పలేదు!

లాడ్జీ కొచ్చి భోజనాలు చేస్తుండగా, వర దరాజులు ఫ్రెండు మూర్తి వచ్చేడు. "వీడిగు రించే నేను చెప్పింది" అంటూ మూర్తిని కిర ణ్మయికి పరిచయం చేశాడు. కిరణ్మయిని కూడా పరిచయం చేశాక "చాలా గొప్ప స్టార్‌నే పరిచయం చేస్తున్నావు. ఫిలిమ్ ఇండస్ట్రీ నీకు రుణపడుంటుంది లేరా" అన్నాడు మూర్తి!

అతను సన్నగా, పొడవుగా, ప్రాణం వున్న పొట్లకాయలా వున్నాడు. అతన్ని చూడగానే నవ్వొస్తుందే తప్ప, గౌరవభావం కలగదు. వరదరాజులు, తమక్కో ఇల్లు చూడమని చెప్పేడు. మూర్తి క్షణంకూడా ఆలోచించ కుండా- "మీరు చాలా లక్కీఫెలోస్‌రా! రెండు రోజులు క్రితమే త్రిమూర్తి స్ట్రీట్‌లో ఓ యిల్లు ఖాళీ అయింది. మీరు ఎంత అద్దెలో కావాలనుకుంటున్నారో, దానికంటే జస్ట్ ఓ పాతికరూపాయిలే ఎక్కువ! అయినా మీరు వెనకాడకండి. టీనగర్ ఏరి యాలో, ఈ మాత్రం అద్దెకి ఓ వరండా కూడా దొరకదు. ఆలోచించడానికి ఎక్కువ టైము తీస్కుంటే ఆ ఇల్లుని మరొకరు





తన్నుకుపోయే ప్రమాదం వుంది" అన్నాడు మూర్తి. అతనలా చెప్పగానే కిరణ్మయికి అంతకంటే ఎక్కువగా వరదరాజులుకి ఆసక్తి కలిగింది! గబగబా భోజనాలు ముగించి త్రిమూర్తి స్ట్రీట్ కి బయలుదేరారు. పాండీబజారుకి చాలా దగ్గరే కాబట్టి నడుచుకుని వెళ్ళారు.

ఆ ఇల్లు ఫర్వాలేదు బాగానే వుందనిపించింది. ఆ వీధిలో సినిమాల్లో ఓ మాదిరి వేషాలు వేసేవాళ్ళు చాలామందుంటున్నారు. వాళ్ళని ఆ యింటి దగ్గర నిలబెట్టి పక్క వీధిలో వున్న ఆ ఇంటి ఓనరుని తీసుకొచ్చాడు మూర్తి! అతను విశ్వనాథన్ అని తెలుగు చాలా బాగా తెలిసిన తమిళుడు! వరదరాజులు, కిరణ్మయి విశాఖపట్నంవారని తెలిసాక చాలాసంతోషించాడు. అతనూ విశాఖపట్నంలో ఎనిమిది సంవత్సరాలపాటు వుద్యోగంచేశాడట, అక్కయ్యపాలెంలో ఓ అద్దెఇంట్లో వుండేవాడట! అతనికి విశాఖపట్నం చాలా బాగా నచ్చిందట! వారిద్దరూ విశాఖపట్నం వారని తెలియడంవల్ల వారికి లాభమే కలిగింది. "నేను మా ఇంటిని సాధారణంగా సినిమావాళ్ళకి, ముఖ్యంగా వేషాలకోసం ప్రయత్నించే లేడీస్ కి అద్దెకివ్వను. ఓసారి ఓ అమ్మాయికిచ్చి, పోలీసురైడింగులు, ఆ గొడవల్తో చాలా యిబ్బందిపడ్డాను. అఫ్ కోర్స్ వేషాలకోసం ప్రయత్నించే వాళ్లంతా అలాంటివారని కాదు. పైగా మీరు వైజాగ్ నించి వచ్చేరు. సో, మీరు డెఫినెట్ గా మంచివాళ్లే అయుంటారు" అంటూ ప్రశంసించాడు. అంతేకాకుండా, అడ్వాన్సుగా ఏమీ యివ్వక్కర్లేదన్నాడు. నెలనెలా అద్దె మాత్రం ఖచ్చితంగా కట్టేస్తే చాలన్నాడు. ఆఖరుగా "విష్ యూ ఆల్ ద బెస్ట్" అంటూ దీవించి విశ్వనాథన్ వెళ్ళిపోయేడు. వరదరాజులు మహదానంద పడిపోయేడు.

"పార్వతీ! మన భవిష్యత్తు బంగారం అయిపోతుందని చెప్పడానికి, ఎన్నెన్ని శుభ సూచనలు కనిపించేస్తున్నాయో చూడు. ఈ ఇంటి ఓనరు కొన్నాళ్లపాటు విశాఖపట్నంలో వుండటమేవిటి? మద్రాసులాంటి మహానగరంలో అడ్వాన్సు లేకుండా ఇల్లు అద్దెకివ్వడమేమిటి? ఇదంతా మన అదృష్టం కాకపోతే మరేవిటి? "

వరదరాజులు మహదానంద పడుతుండడం చూసి కిరణ్మయి కూడా సంతోషించకుండా వుండలేకపోయింది.



విశాఖపట్నంనించి మద్రాసుకి, నాటకరంగంనించి సినిమాలోకంలోకి, లాడ్జీలోనించి త్రిమూర్తి స్ట్రీట్ లోకి వచ్చింది తను. ఇంకా ఎక్కడికెళ్లాలో? ఏం జరగనుందో... అని వంటచేస్తూ ఆలోచిస్తోంది కిరణ్మయి. వీటన్నింటికంటే ఎక్కువగా, మొన్న ప్రొడక్షన్ మేనేజరు వరదరాజులుతో "అదీ సంగతి అటుపైన నీ ఇష్టం" అని అన్నాడు. ఆ మాటకి అర్థం ఏవిటా అనే ఆలోచిస్తోంది. వరదరాజులు ఓ నులకమంచం, ఓ దుప్పటి, కాయగూరలు వగైరా పట్టుకొచ్చాడు. వాటి గురించి కిరణ్మయి అడగబోతుంటే "ఇప్పుడు మనం మాట్లాడుకోవాల్సింది వీటి గురించి కాదు. మనం ఇప్పుడో కంపెనీకి అర్జంటుగా వెళ్లాలి. బయల్దేరు" అంటూ ఆమెను తొందరపెట్టాడు.



రజనీ ఆర్ట్ ఫిలింస్ వారు ఓ కొత్త తరహా సినిమాని, నూతన నటీనటులతో నిర్మించడానికి ఏర్పాట్లు చేస్తూ పత్రికల్లో ఆర్టిస్టుల కోసం ప్రకటన కూడా చేశారు. గతంలో వరదరాజులు కిరణ్మయి ఫొటోల్ని పంపించింది కూడా ఈ కంపెనీకే. కిరణ్మయిని తీసుకుని వరదరాజులు వెళ్లేసరికి ప్రొడ్యూసర్ అచ్యుతరావు, అతని కొడుకు దయానంద ఆఫీసులో ఖాళీగానే కూర్చున్నారు. దయానంద వయసు ఇరవైనాలుగు దాటకపోయినా, ఇరవైఎనిమిదేళ్లవాడిలా కనిపి

స్తాడు. అతను సన్నగా వున్నాడే తప్ప చలాకీగా లేడు. అప్పుడే ఏదో మత్తునించి తేరుకుంటున్నవాడిలా చూస్తున్నాడు. అచ్యుతంగారు కిరణ్మయిని చూసి సంతోషించారు. "కొంతమంది మామూలుగా చూస్తే బాగోరు కానీ, ఫొటోల్లో బాగుంటారు. కొంతమంది ఫొటోల్లో చూస్తే బాగోరుగాని మామూలుగా చూస్తే బావుంటారు. కానీ నువ్వు ఫొటోలోనూ బాగున్నావు, మామూలుగానూ బాగున్నావు" అంటుండగా ఆ పిక్చర్ డైరక్టు చేయబోయే డైరెక్టరు సత్యప్రసాద్ వచ్చాడు. అతనికి పరిచయం చేశారు అచ్యుతరావు. సత్యప్రసాద్ పాప్యులర్ డైరెక్టర్. అతని పేరు వరదరాజులు చాలా సార్లు విన్నాడు. కిరణ్మయిని చూసి అతను సదభిప్రాయాన్నే వ్యక్తం చేశాడు. దయానంద మునిపళ్లతో గోళ్లు గిల్లుకుంటూ తండ్రివైపు చూసి కళ్లతో ఏదో సంజ్ఞ చేశాడు. దానర్థం ఆ తండ్రికే తెల్సింది తప్ప మిగతావారికి అర్థం కాలేదు. అచ్యుతరావు సిగరెట్ వెలిగించి దమ్ము లాగుతూ-

"మా పిక్చర్లో మాధవి అనే ఓ మహత్తరమైన వేషం వుంది. మిగతా వేషాలకి ఆర్టిస్టులు ఫిక్స్ అయిపోయినా, ఆ మాధవి వేషానికే సరైన ఆర్టిస్టు దొరకడంలేదు. అఫ్ కోర్స్ నలుగురైదుగురు ఆర్టిస్టుల్ని సెలక్ట్ చేసి పెండింగ్‌లో పెట్టుంచామనుకోండి. కానీ వాళ్లకంటే ఈ అమ్మాయి బావుంటుందేమోననిపిస్తోంది. పైగా చాలా డ్రామా అనుభవం వుందంటున్నారుకదా. రేపోసారి అమ్మాయికి మేకప్ టెస్ట్ చేద్దాం" అన్నాడు అచ్యుతం డైరక్టరువైపు చూస్తూ! అలాగే అలాగే అన్నట్టుగా తల వూపేడు డైరెక్టరు.

కిరణ్మయి మనసు ఒక్కసారిగా సంతోషమనే గాలి నింపుకున్న రబ్బరు బెలూన్‌లా గాలిలో తేలిపోయింది.

కానీ వరదరాజులు మనసు మాత్రం అలా గాలిలో తేలలేదు. ఏకంగా తనే బొందితోసహా ఆకాశంలోకి ఎగిరిపోయినట్టు ఫీలయ్యాడు.

"అమ్మాయిని మీ ఇంటికి పంపించెయ్యండి. మనం కూర్చుని మిగతా విషయాలు మాట్లాడుకుందాం" అన్నాడు డైరెక్టరు. బహుశా పారితోషికం విషయమై వుంటుందనుకున్నాడు వరదరాజులు.

ప్రొడక్షన్ మేనేజర్‌ని పిల్చి "కారులో అమ్మాయిని పంపించు" అన్నాడు అచ్యుతం.

"మరేం ఫర్వాలేదు వెళ్లు" అన్నాడు వరదరాజులు.

కిరణ్మయి బయటికి వెళ్ళిపోయింది. అచ్యుతరావు ఏదో అనబోతుండగా దయానంద లేచి బయటకు వెళ్ళిపోయాడు.

దయానంద మేడ మెట్లెక్కుతూ అక్కడే వున్న ప్రొడక్షన్ మేనేజర్ని కళ్లతోనే రమ్మని సంజ్ఞచేసి వాడి పేరేమిటి? " అన్నాడు.

"ఎవడి పేరండి? "

"అదే... ఆ అమ్మాయిని తీసుకొచ్చేడే వాడు..."

"వరదరాజులటండి"

"నాన్నగారితో మాట్లాడాక వాణ్ణోసారి నా రూముకి రమ్మని చెప్పు" అంటూ ఆర్డర్‌వేసి మేడమీదున్న తన రూములోకి వెళ్ళిపోయాడు.

నిర్మాత, దర్శకుడికి, వరదరాజులకీ మధ్య అసలు సంభాషణ ఇప్పుడు ఆరంభమయింది.

"మేం ఫస్ట్ టైము సినిమా తీస్తున్నా, మాకు ఫిలిమ్ డిస్ట్రిబ్యూషన్లో చాలా సంవత్సరాల అనుభవం వుంది"

"యస్సార్" వరదరాజులు తలవూపేడు.

"మేం కొత్త ఆర్టిస్టులతో సినిమా తీస్తున్నా, టెక్నీషియన్లని మాత్రం నెంబర్ వన్ వాళ్లనే పెడుతున్నాం"

"యస్సార్"

"మేం ఈ పిక్చర్‌ని సహకార పద్ధతిలో సమిష్టి కృషితో తీయాలనుకుంటున్నాం. అంటే ఇందులో పనిచేసే ప్రతీ ఆర్టిస్టు ప్రతీ





టెక్నీషియనూ, మా ప్రొడక్షన్లో భాగస్థుడి కిందే లెక్క"

"య...స్సా...ర్"

"మా పిక్చరుకి డైరక్టరు దగ్గర్నించి బోయ్ దాకా అందరూ పారితోషికాలు తీస్కోకుం డానే పనిచేస్తున్నారు. అంటే వాళ్ళకేమీ ఇవ్వమని కాదు అర్థం. మా పిక్చరు సేల్ అయిపోయాక ఎవరికివ్వాల్సిన పారితోషి కాలు వాళ్లకి పువ్వుల్లో పెట్టి ఇచ్చేస్తామన్న మాట"

"మరేం ఫర్వాలేదు మాకూ అలాగే ఇవ్వండ్సార్" క్షణం గూడా ఆలోచించకుండా వరదరాజులు ఆమాట అనేశాడు.

అచ్యుతం చిన్నగా నవ్వి- "ఆ పద్ధతి కేవలం టెక్నీషియన్లకే వర్తిస్తుంది. ఆర్టిస్టుల విషయంలో మేం ఫాలో అవుతున్న పద్ధతి వేరు. వేషాల ప్రాధాన్యతని బట్టి, వారు కొంత డబ్బు పెట్టుబడి పెట్టాలి. అది కూడా పిక్చర్ సేల్ అయిపోయాక తిరిగి ఇచ్చేస్తాం. అలాగని మేం డాక్యుమెంట్సు కూడా రాసిస్తాం. మేం పెట్టిన కండీషన్కి అంగీకరించిన ఆర్టిస్టులంతా ఆల్ రెడీ బుక్క యిపోయారు. మిగిలిందల్లా ఒక్క హీరో యిన్ వేషం ఒక్కటే. దానిక్కూడా నలుగు రైదుగురమ్మాయిలు డబ్బుతోసహా రెడీగా వున్నార్లెండి. అందులో వెంకటరెడ్డిగారి కూతురు రమణి అయితే మరీ తొందరపె డుతోంది. డబ్బు ఎప్పుడిమ్మంటారు? షూటింగెప్పుడూ అంటూ ఫోన్లమీద ఫోన్లు చేస్తోంది. నిన్న రాత్రివరకు ఆ అమ్మాయినే సెలక్టు చేసేద్దామనే అభిప్రాయంలో వున్నాం. కానీ ఇప్పుడు కిరణ్మయిని చూశాక, మేం మా అభిప్రాయాన్ని మార్చుకోక తప్ప డంలేదు" అన్నాడు.

"థాంక్యూ సార్"

"విషయం తేలకుండా మీ థాంక్యూలు, మా నోమెన్లన్లు ఎందుకండీ? మీరు మా కండీషన్కి ఒప్పుకున్నట్టేనా? " అన్నాడు డైర క్టరు.

"ఎంత ఇవ్వాల్సుంటుంది? " వరదరా జులు గొణిగాడు.

"హీరోయిన్ వేషానికి లక్ష రూపాయలు పెట్టేం"

"లక్షా? " వరదరాజులు నాలికమీద తడి ఆరిపోయింది. మెల్లగా ధైర్యం తెచ్చుకుని "క్షమించాలి, మేం రంగస్థలంమీదనించి అనుభవాన్ని తేగలిగేం కాని, డబ్బుని తేలే కపోయాం సార్" అన్నాడు.

"ఆ అమ్మాయి లక్ష ఇవ్వక్కర్లేదు. ఆమెకు నాటకానుభవం బాగా వుంది కాబట్టి మా సినిమాలోని పాత్రకి న్యాయం చెయ్యగల దన్న నమ్మకం వుంది కాబట్టి ఓ పాతిక వేలు తగ్గిస్తున్నాం. డెబ్బయ్యయిదు వేలు ఏర్పాటు చేస్కోండి"

"అది కూడా మాకు కష్టమే సార్"

"డైరక్టుగా హీరోయిన్ వేషం రావడమూ కష్టమేగా! పోనీ ఆ వేషానికి సరైనవాళ్లు దొరక్కపోతే మేం చెప్పిన డబ్బు ఇవ్వలేక పోతే, మీ కిరణ్మయి గురించి మేం స్పెష ల్గా ఆలోచించేవాళ్లమేమో! అవతల వెంక టరెడ్డిగారి కూతురు డబ్బుతోసహా రెడీగా వున్నప్పుడు ఈవిడ గురించి ఆలోచించా ల్సిన అవసరం మాకేం వుంది"

అచ్యుతంగారు ఖచ్చితంగా చెప్పేసి, న్యూస్పేపరు చదవడంలో నిమగ్నమైపో యినట్టు నటించేసరికి వరదరాజులుకి బయటికి నడవక తప్పలేదు. బయటకొస్తుం డగా అతని భుజంమీద చెయ్యిపడింది. తలెత్తి చూస్తే ఎదురుగా ప్రొడక్షన్ మేనే జరు నిలబడి వున్నాడు.

"చినబాబుగారు నీ కోసం మేడమీద గదిలో వెయిట్ చేస్తున్నారు వెళ్లు" అన్నాడు.

"చినబాబుగారెవరు? "

"ప్రొడ్యూసర్గారి ఏకైక కుమారరత్నం. ఇందాకటిదాకా ఆఫీసుగదిలో కూర్చున్నాడే ఆయనే"

"నన్ను దేనికి పిలుస్తున్నారు? "

"ఏమో! ప్రొడ్యూసరుగారు జిల్లా కోర్టు అయితే చినబాబుగారు హైకోర్టు. నిన్నే పంపించమన్నారు. వెళ్లి కనిపించు"

వరదరాజులు రెండుక్షణాలు ఆలోచించి, మేడమెట్లు ఎక్కాడు.

★ ★ ★

చినబాబు అనబడే దయానంద గదిలో కూర్చుని స్కాచ్‌విస్కీలో బీరు కలుపుకుని తాగుతున్నాడు. గుమ్మం దగ్గర నిలబడ్డ వరదరాజుల్ని చూసి "రండి, కూర్చోండి" అన్నాడు. వరదరాజులు మెల్లగా వచ్చి వినయంగా సోఫాలో కూర్చున్నాడు. విస్కీని మరో గ్లాసులో వేసి "తాగండి" అన్నాడు. "వద్దండి" అన్నాడు కాస్త మొహమాటపడుతూ.

"నేను ఇచ్చాక తాగాలి. తాగండి" చినబాబు రూపమే కాదు, మాట కూడా అదోలాగే వుంది. మందు తాగి చాలా రోజులయింది. అది కూడా ఇప్పుడిస్తున్నది స్కాచ్ విస్కీ. పైగా ప్రొడ్యూసర్‌గారి కొడుకు ఇస్తున్నాడు. మరేం అనకుండా గ్లాసు అందుకున్నాడు.

"కిరణ్మయి చాలా బాగుందండి"

"థాంక్యూ సార్"

"మీ ఆవిడా? "

ఆ ప్రశ్నకి వరదరాజులుకి పొలమారింది ఒక్కసారి! ఏమని చెప్పాలి? ఓ ఆడదానికి పెళ్లయితే సమాజంలో మర్యాద, కాస్త సెక్యూర్టీ వుంటుంది. కానీ సినిమాల్లోకొచ్చే అమ్మాయిలకి పెళ్లయిపోతే అదో పెద్ద అనర్థతయిపోతుందని అతనికి తెలుసు. అయినా కిరణ్మయి తన భార్య కాదు. మరో సంబంధమేదైనా వుందనుకున్నా, ఆమె ఒంటిమీద చెయ్యి కూడా వెయ్యనివ్వడం లేదు.

"లేదండి" అన్నాడు మెల్లగా.

"మరి... వుంచుకున్నారా? "

"ఛిఛ్ఛి అదేంలేదండి. అసలు, మేం..."

"ఇంకేం చెప్పక్కర్లేదు లేవయ్యా, నీ కేసు నాకు అర్థమైపోయింది" అన్నాడు చినబాబు జీడిపప్పు నముల్తూ.

కిరణ్మయి తనకి ఏమీకాదని తెల్సినవెంటనే చినబాబు మర్యాద తగ్గించేసి మీరు అనే మాటని 'నువ్వ'గా మార్చేసాడు. అయినా ఫర్వాలేదు. తను అనుకున్నవి జరగాలేగాని ఈ వెధవ మర్యాదలదేం వుందని చాలా స్పోర్టివ్‌గా తీసుకున్నాడు.

"మా నాన్నేం అన్నాడు? "

"మా కిరణ్మయి నచ్చిందన్నారు"

దయానంద మెల్లగా తూలుకుంటూ వెళ్లి బీరువాలోనించి ఓ కవరు తీసుకొచ్చి వరదరాజులు ముందు పడేశాడు. "హీరోయిన్ వేషం కోసం ఏడు వందల చిల్లర ఫొటోలు వస్తే, అందులో మా ముసిలాడు, ఆ డైరెక్టరుగాడు, ఈ ముప్ఫయ్యారుమందినీ సెలక్టు చేసి ఫైనల్ సెలక్షన్ కోసం నాకీ ఫొటోలు పంపించారు. కానీ నాకు ఒక్కర్తీ నచ్చలేదు. కవరు ఓపెన్‌చేసి చూడు. అన్ని ఫొటోల మీద ఇంటూ మార్కులు పెట్టేశాను. అదెవర్తో వెంకటరెడ్డి కూతుర్ని ఓకే చేద్దాం అన్నారు. ఇవాళ నేను యస్సనో, నో అనో చెప్పాలి. ఈలోగా నువ్వు కిరణ్మయిని తీసుకొచ్చేవు. దాని ఫొటోలు ఏ సన్నాసిగాడు తీశాడయ్యా! నేను ఇంటూ పెట్టేసిన ఫొటోల్లో దాని ఫొటో కూడా వుంది. కానీ దాన్ని ఇందాక చూశాక స్టన్ అయిపోయి ఓకే చేసేశాను. నాకు నచ్చిన విషయం ఇంకా మా ముసిలోడికి చెప్పలేదు. అఫ్‌కోర్స్ నచ్చలేదని కూడా ఇందాక చెప్పలేదులే. సైలెంట్‌గా మేడమీదకొచ్చేశాను" దయానంద్ మాటల్లో మందు ప్రభావం బాగానే పనిచేస్తున్నట్టనిపించింది.

"థాంక్యూ సార్" అంతకంటే ఏమనాలో తెలీక, అలా అన్నాడు వరదరాజులు.

"అసలు విషయం ఇంకా చెప్పకుండానే థాంక్సు అంటావేటి? " అంటూ చిరాకుప





డ్డాడు దయానంద.

"సారీ సార్ చెప్పండి"

"ఈ సినిమా తీస్తున్నది మా ముసిలోడు కాదు, నేను! నాకు నచ్చిన ఆర్టిస్టుల్తో సినిమా తీస్తే నిర్మాతగా మా ముసిలోడి పేరు వేస్తాను. లేదూ, నాకు తిక్కరేగిందంటే ఆ పేరూ వెయ్యను. ఎందుకంటే ఇప్పుడు ఆస్తంతా మన పేరు మీదుంది"

"యస్సార్"

"ఇంతకీ మా ముసిలోడు ఏమన్నాడు?

వరదరాజులు జరిగిన సంభాషణంతా చెప్పాడు.

"మా నాన్న ముసిలోడుకదా- ఎవరి దగ్గర డబ్బు పుచ్చుకుని వేషం ఇవ్వాలో, ఎవరికి మనమే డబ్బిచ్చి వేషం వేయించాలో మా వాడికి తెలీదులే"

"యస్సార్"

దయానంద రెండు నిమిషాలపాటు తాగడంలోనే నిమగ్నమయ్యాక, "ఇంతకీ నీ హిస్టరీ ఏవిటి?" అని అడిగాడు. అలాంటి అవకాశం కోసమే ఎదురుచూస్తున్న వరదరాజులు తన జీవితాశయం గురించి చెప్పాడు. దాన్ని నెరవేర్చుకోడానికి తను పడిన కష్టాల గురించి చెప్పాడు. "ఇంత జరిగినా నా ఆశయంమీద నా మమకారం ఇంకా చావలేదు సార్" అనే మాటని ఒత్తి ఒత్తి నొక్కినొక్కి మరీ చెప్పాడు. అదంతా విన్నాక వరదరాజులు గ్లాసులో రెండు లార్జ్ పెగ్గులు పోసి- "డైరక్టుగా మింగెయ్" అన్నాడు అతను అలాగే మింగేశాడు.

"నీకు విలన్ వేషం ఇస్తాను"

"యస్సార్"

"దానికి హీరోయిన్ వేషం ఇస్తాను"

"యస్సార్"

"అదేం మాకు పెట్టుబడి పెట్టక్కర్లేదు. పిక్చర్ పూర్తయ్యాక నేనే ఓ పాతికవేలు ఇస్తాను"

"యస్సార్"

"ప్రతీదానికీ యస్సార్ యస్సార్ అంటే కాదు. నేనెప్పుడు లేడీతో జల్సా చేసినా పగటిపూటే చేస్తాను. రేపు ఉదయం పదిగంటల్నించి రాత్రి తొమ్మిదిదాకా నేను ప్రెసిడెంట్ హోటల్లో రూమ్‌నెంబర్ ఫోర్ ఒన్ టూలో వుంటాను. కిరణ్మయిని అక్కడికి పంపించు. ఆ తర్వాత నేను పంపమన్నప్పుడల్లా..."

"యస్సార్" అనబోయి వరదరాజులు ఠక్కున ఆగిపోయాడు.

"ఏం? అన్నింటికీ యస్సార్ అన్నవాడివి, ఈ పాయింటుకి సైలెంట్ అయిపోయావేం?" దయానంద కాస్త అధికారం చెలాయిస్తున్నట్టుగా దబాయించి అడిగాడు.

"కిరణ్మయి... కిరణ్మయి..." అంత మత్తులోనూ నీళ్లు నమిలేడు వరదరాజులు.

"నువ్వు నీళ్లు నమలడానికది- నీ పెళ్లమా?"

వరదరాజులు మౌనం వహించాడు.

"నువ్వు జవాబు చెప్పకపోతే, నిన్నీ సీసాతో కొడతాను రాస్కెల్. జవాబు చెప్పు"

"యస్సార్" అన్నాడు కాస్త బిక్కచచ్చిపోయి.

"చెప్పరా... అది నీ పెళ్లామా?

"కాదు సార్"

"దాన్ని నువ్వుంచుకున్నావా?"

"నో సార్"

"మీది లవ్ కేసా?"

"కాదు సార్"

"మరి దాన్ని ఎందుకు వేషాలకోసం తీసుకొచ్చేవ్?" వరదరాజులుకి ఎలా చెప్పాలో అర్థం కాలేదు.

"నువ్వెందుకు దాన్ని తీసుకొచ్చేవో నన్ను చెప్పమంటావా? దానికి వేషాలు ఇప్పించి నట్టే ఇప్పించి, దాన్ని నాలాంటివాళ్ళకి ఎర వేసి, పన్లోపనిగా నువ్వూ వేషాలు కొట్టెయ్యడానికి దాన్ని లేపుకొచ్చేవ్?"

"ఛిఛి అదేంలేదు సార్"

"అబద్ధాలాడేవంటే ఈ సీసాతో నీ బుర్ర



బద్ధలగొట్టేస్తాను" అంటూ విస్కీసీసా తీసి చేత్తో పట్టుకున్నాడు.

"యస్సార్"

"చూడరబ్బాయ్! ఇది లక్షలు, కోట్లుతో సంబంధించిన వ్యాపారం! నేను దానికో అదృష్టాన్నిస్తున్నప్పుడు, అదీ నాకో ఆనందాన్నివ్వాలా? లేదా? బాగా ఆలోచించుకో. అందులోనూ అది నాటకాలు ఆడీ ఆడీ వచ్చిందే తప్ప అదేమీ సతీసావిత్రి కాదని తెల్సు. అదే సతీసావిత్రి అయితే అక్కడ నాటకాలెందుకాడుతుంది? ఇక్కడ సినిమాల కెందుకొస్తుంది" దయానంద అలా ముద్దముద్దగా మాట్లాడుతూనే సోఫాలో పడుకుని నిద్రపోయాడు.

★ ★ ★

దయానంద ఇచ్చిన మందు కాస్త ఎక్కువే అయినా, అతను తన జాతకాన్ని అక్షరం అబద్ధం లేకుండా చెప్పేసరికి తలకెక్కిన మందు కాస్తా అరికాల్లోకి దిగిపోయినట్లయింది. ఇంటికి వస్తూ వస్తూ ఓ హాఫ్‌బోటిల్ విస్కీ తెచ్చుకుని తాగుతూ ఆలోచించ నారంభించాడు. అతను తాగుతుండగా చూడ్డం కిరణ్మయికిదే మొదటిసారి! "వాళ్లేమన్నారు?" అని ఆత్రంగా అడిగింది. "ఇప్పుడు కాదు సాయంత్రం చెప్తాను. అంతవరకు నన్ను డిస్టర్బ్ చెయ్యకు" అంటూ సీరియస్‌గానే చెప్పాడు.

"నా కోసం నువ్వు వెయిట్ చెయ్యకుండా భోంచేసేయ్. నేను తర్వాత భోంచేసి పడుకుంటాను" అనేసరికి కిరణ్మయి మాట్లాడకుండా అక్షరాలా అలాగే చేసింది. అతని మనసులో అమితమైన ఆనందమో, అపారమైన నిరాశో నిండివుండాలి. ఎలాగూ ఆ విషయం సాయంత్రం చెప్తానంటున్నాడుకదాని సంతృప్తిపడి ఆమె నిద్రపోయింది.

వరదరాజులు మనసులో వెయ్యి ఆలోచనలు, లక్ష రెక్కలతో విచ్చలవిడిగా రెచ్చిపోయి తిరుగుతూ అతన్ని అశాంతికి గురిచేశాయి. దయానందగాడు పాతికేళ్లు దాటని గుంటడయితే అయాడుగాని, సిన్మాఫీల్డు గురించి ఎంత కరక్టుగా చెప్పేశాడు? ముఖ్యంగా తన మనసులోని ఆలోచనలకి ఎంత సులభంగా ఎక్స్‌రే తీసెయ్యగలిగాడు? వాడు తనతో చెప్పిన మాటల్నే తనూ కిరణ్మయికి చెప్పాలనుకున్నాడు! కానీ విశాఖపట్నంలో వున్నప్పుడు చెప్తే ఆమె తనని అసహ్యించుకుని, చెప్పుతో కొట్టి తగిలేస్తుందని సంశయించాడు. కేవలం తమ మధ్య స్నేహం పెరిగితే చాలనుకున్నాడు. పెరిగింది. ఆవిడ మనసులోని కోరికలకి రెక్కలిచ్చి సినిమా జీవితంమీద వ్యామోహం పెంచాలనుకున్నాడు. అదీ సాధించాడు. మద్రాసు తీసుకొచ్చాక, ఇక్కడ వేషాలు సంపాదించడానికి ఆడది ఏం మదుపు పెట్టాలన్న విషయం చెప్పాలనుకున్నాడు. కానీ ఇంకా చెప్పలేదు. ఆమెను విశాఖపట్నంలోగాని, మరో వూర్లోగాని అనుభవించలేదు. కానీ తన మాటమీద విశ్వాసంతో తల్లితో అబద్ధం చెప్పి, వేషాలకోసం మద్రాసు వచ్చేశాక ఆమెను అనుభవించడం అతిసులభం అనుకున్నాడుగాని, ఆమె తనని ఆ విషయంలో ఇక్కడా దూరంగానే వుంచింది. తమ ఇద్దరి మధ్య ఆ శారీరకమైన సంబంధం కూడా కుదిరిపోతే ఆమె మీద తనకి చాలా అధికారం వచ్చుండేది కానీ... ఆమె అందుకు తిరస్కరించడంవల్ల, తమ ఇద్దరి స్నేహం ఆంధ్ర రాష్ట్రం సరిహద్దులు దాటి తమిళనాడు వచ్చిందే తప్ప తను ఆశించినది మాత్రం జరగలేదు. నాటకాలమ్మాయిల విషయంలో దయానందగాడు జెనరల్‌గా చెప్పేసేడుగాని, రాక్షసవంశంలో కూడా ప్రహ్లాదుళ్ళు, విభీషణుళ్లూ వున్నట్టు నైతిక విలువల్ని గౌరవించని నాటకాలమ్మాయిల్లో కూడా కిరణ్మయిలాంటి వాళ్లుంటారని వాడు గ్రహించలేకపోయాడు. ఔను మరి... కిరణ్మయితో వాడికున్న పరిచయమెంత? ఆమె గురించి సర్వం తెలి





సున్న తనుకూడా కిరణ్మయి ఏదో ఒకరోజు, ఎక్కడో ఒకచోట, ఎవడితోనో ఒకడితో "చెడి"పోక తప్పదనే నమ్మకంతో వున్నాడు.

అంతకుమించి ఆవిడ చెడిపోవడమంటూ జరిగితే, అది తనవల్లే జరుగుతుందనే ప్రగాఢ విశ్వాసంతో వున్నాడు. కానీ అది జరిగేటట్టు లేదు. ఇంత పరిచయం, ఇంత నమ్మకం వున్న తనకే ఆమె తన శరీరాన్ని అర్పించనప్పుడు, ఇక్కడ సినిమావాళ్ల కోసం అర్పిస్తుందా?

అర్పిస్తుందా? అర్పించదా?

అర్పిస్తుందా? అర్పించదా? అతను వేసుకున్న ప్రశ్నలకి అతనే సమాధానాలు చెప్పుకోలేక, మరింత స్పీడుగా తాగనారంభించాడు.

మంచంమీద నిద్రపోతున్న కిరణ్మయిని చూశాడు. బ్రహ్మదేవుడికి ఎవరూ పూజాపునస్కారాలు చెయ్యకపోయినా, ఆడదాని అందాన్ని వూహించడంలో ఆ బ్రహ్మ అంతటి రసికుడు మరొకడుండడేమో. తన సొంతానికి చేసుకున్న బొమ్మలాగా కిరణ్మయిని ఇంత అందంగా సృష్టించాడు.

కానీ ఆవిడ నుదుట్న తన అందాన్ని కేష్ చేసుకునే గీత ఎందుకు గీయలేదోనని కాస్సేపు ఆలోచించాడు. ఆమె అందం గురించి ఆమెను అందరూ పొగిడేరు కాబట్టి ఆ విషయం ఆవిడకి తెలుసు. ఆవిడకి తెలియని సినిమారంగం గురించి తను వూదరగొట్టి వుబ్బించి మరీ వైజాగ్‌నించి మద్రాసు తీసుకురాగలిగాడు. కానీ, ఆమె ఆశల్ని ఆశయాల్ని నెరవేర్చుకోడానికిక్కడేం చెయ్యాలో మాత్రం తను ఇంకా చెప్పలేదు.

ఇప్పటికే లేట్ అయింది కాబట్టి, ఎప్పుడైనా చెప్పెయ్యాలి? చెప్పెయ్యడం కాదు- చెప్పి ఒప్పించెయ్యాలి!

నిన్న వెళ్లిన సినిమా కంపెనీలో ప్రొడ్యూసరు కిరణ్మయిని వి.జి.పి గార్డెన్స్కి తీసుకురమ్మన్నాడు. తీసుకువస్తేనే హీరోయిన్ వేషం ఇస్తానన్నాడు.

"అదీ సంగతి అటుపైన నీ ఇష్టం" అని ప్రొడక్షన్ మేనేజరు నాగేశ్వరరావు చెప్పిన మాటకి అర్థం ఏమిటని కిరణ్మయి అడిగినప్పుడు, జవాబు చెప్పలేదు. ప్రొడ్యూసర్ వూళ్లో లేడని ఏదో అబద్ధం చెప్పేశాడు.

ఇప్పుడు దయానందగాడూ కిరణ్మయినే పంపించమంటున్నాడు. వాడు కాస్త నంగిరి పింగిరి వెధవలా కనిపిస్తున్నా, అలాంటివాళ్లకి కావలసినవి సప్లయ్ చేస్తే ముందు ముందు చాలా లాభాలుంటాయి. వాడు కోరిన కోర్కెకి తను జవాబయితే చెప్పలేదు గాని కిరణ్మయిని ఒప్పించి, మొదటిసారిగా విసిరితే వాడిమీదికే విసరాలి! అందువల్ల తనకీ లాభం వుంటుంది. అంచేత-

కిరణ్మయిని ఎలాగైనా ఎలాగైనా ఒప్పించెయ్యాలి.



సాయంత్రం అయిదుగంటలవరకు తాగి, భోజనం చెయ్యకుండానే నిద్రపోయాడు. రాత్రెప్పుడో పదకొండు దాటాక కొద్దిగా మెలకువ వచ్చి బాత్రూమ్‌కెళ్లొచ్చాడు.

అతను లేస్తే రాత్రయినా, ఇంత భోంచేస్తాడని కిరణ్మయి రాత్రికి కూడా భోజనం వండింది. ప్లేటులో భోజనం పెట్టింది.

తినాలని లేకపోయినా, ఆమె సంతృప్తికోసమన్నట్టుగా రెండు మెతుకులు కెలికాడు.

"వాళ్లేమన్నారు? " కిరణ్మయి మధ్యాహ్నం కంటే ఆసక్తిగా అడిగింది.

కానీ అతను తల ఎత్తకుండానే "ఇప్పుడు కాదు రేపు" అనేసి ప్లేటులోనే చెయ్యి కడిగేసి, అలాగే మంచంమీదపడి నిద్రపోయాడు.

అతను సమాధానం చెప్పలేక పోవడానిక్కారణం, అతను ఎక్కువగా తాగడంవల్ల నోరు సరిగా తిరక్కపోవడమేనని సరిపెట్టుకుంది. రేపట్నించి అతన్ని తాగొద్దని గట్టిగా వార్నింగివ్వాలి అనుకుంటుండగా, తను

మద్రాసు వచ్చేక తల్లికి ఉత్తరం రాయలేదన్న విషయం గుర్తొచ్చింది. రేపు ఎలాగైనా రాసెయ్యాలని నిశ్చయించుకుని తలుపులు గడియపెట్టి, లైటు ఆఫ్‌చేసి నేలమీద పడుకుంది.



మర్నాడువుదయమే పెట్టెలోనించి ఇన్‌లేండ్ లెటరు తీసి తల్లికి ఉత్తరం రాస్తూ ముందుగానే రెండు అబద్ధాలు రాసింది.

గూడూరు పరిషత్తులో నటిస్తుండగా, ఓ పెద్ద సినిమా ప్రొడ్యూసరు ఆ నాటకం చూసి, తన పిక్చర్లో చాలా ముఖ్యమైన వేషం ఇస్తానని తనతోపాటు మద్రాసు తీసుకువెళ్ళాడని రాసింది.

రెండో అబద్ధం ఇక్కడ తనకి డబ్బులకేమీ ఇబ్బంది లేదని, సర్వఖర్చులూ ప్రొడ్యూసర్ భరిస్తున్నాడని, వరదరాజులు తన పక్కనే వుండడంవల్ల నువ్వు మరేమీ భయపడొద్దని రాసింది.

ఆ తర్వాత "నిన్ను మద్రాసు రమ్మని నేను ఉత్తరం రాసేదాకా నువ్వు విశాఖపట్నం వదిలిపెట్టి మద్రాసు రావద్దు" అని రాసి, రెండుసార్లు అండర్‌లైన్ చేసింది.

ఉత్తరంమీద కావాలనే తన అడ్రస్ రాయకుండా జాగ్రత్తపడి దగ్గర్లో వున్న పోస్టుబాక్సులో ఉత్తరం వేసొచ్చింది.

తొమ్మిదిగంటలు దాటాక వరదరాజులు లేచి స్నానంచేసిన కిరణ్మయిని మంచంమీద కూర్చోబెట్టి వాళ్లేమన్నారు? అని ఆమెను మళ్లీ అడగనివ్వకుండా, వాళ్లు ఏమన్నదీ, తనూ ఏం చెప్పదల్చుకున్నదీ ధైర్యంగా చెప్పనారంభించాడు. చెప్పేముందు,

"దయచేసి నేను చెప్పేది పూర్తిగా విను, మధ్యలో ప్రశ్నలు అడగాలనిపించినా అడక్కు. అంతా విన్నాక, వెంటనే తొందరపడి జవాబు చెప్పెయ్యకు. ఒకటి రెండురోజులపాటు బాగా ఆలోచించి జవాబు చెప్పు.

ఇది ఎవరి సమస్యో కాదు, నీ సమస్య! కేవలం నీ సమస్యన్న విషయం గుర్తుపెట్టుకుని మరీ జవాబు చెప్పు.

నిన్ను తారాపథానికి తీసుకువెళ్ళినా, తిరిగి నిన్ను విశాఖపట్నంలో నాటకాలాడించినా అదంతా నీ నిర్ణయంమీదే ఆధారపడి వుంటుందని బాగా గుర్తుపెట్టుకుని మరీ ఆలోచించు.

ఇప్పుడు నేను చెప్పబోయేవి నా అభిప్రాయాలు కావు. ఈ ఇండస్ట్రీ తాలూకా అభిప్రాయాలు మాత్రమే. అవి నువ్వు వినలేదు. నేను విన్నాను. కాబట్టి నేను విన్నవే చెప్తున్నాను" అన్నాడు.

నిజానికి తను చెయ్యవలసిన ఉపదేశమంతా చేశాక ముగింపు మాటలుగా చెప్పాల్సిన మాటలు అవి. కానీ, ఉపదేశం చేశాక ఆమె మూడ్ ఎలా వుంటుందో అతని ఊహకి అందకే, ఆ ముగింపు వాక్యాల్ని ముందుగానే చెప్పేశాడు.

కిరణ్మయి ఎటువంటి ప్రత్యేకమైన భావాన్నీ ముఖంలో ప్రదర్శించకుండా 'చెప్పు' అని మాత్రం అంది.

వరదరాజులు ప్రొడ్యూసర్లు చెప్పింది చెప్పాడు. అందులో తన అభిప్రాయాల్ని కూడా కలిపేసి, అవి కూడా వారు చెప్పినట్టుగానే చెప్పేడు. ప్రతీ నాలుగయిదు వాక్యాలకొకసారి, "మనకి వాళ్లేదో అదృష్టం కలిగిస్తున్నపుడు, మనం కూడా మనకి అందుబాటులో వున్న ఆనందాన్ని కలిగించా





లికదా" అనే మాటని కంపల్సరీగా కలుపుతూ తన ఉపదేశాన్ని కొనసాగించాడు.

"మరో విషయం చెప్పనా? నువ్వింకా కన్యగా వున్నావంటే వాళ్లు నమ్మడంలేదు. ఇక్కడకొచ్చే ప్రతీ ఆడదీ అలాగే చెప్తుందిలే వయ్యా అంటూ నన్ను వెటకారం చేస్తున్నారు. చేస్తున్నారంటేఅది వాళ్ల తప్పుకాదు. మనం కొత్త జీవితాన్ని ఆరంభించాలనుకున్నప్పుడు కొన్ని కొత్త విషయాల్ని కూడా అలవాటు చేస్కోవాలి" అంటూ ఏకబిగిని ఒక గంటసేపు చెప్పేక, తన ఉపదేశం ఏమైనా పనిచేసిందో లేదోనని ఆమెను ఓర కంట చూసాడు.

ఆమె ఆ మాటల్ని వినకముందు ఎలా వుందో ఇప్పుడూ అలాగేవుంది.

"బాగా ఆలోచించుకుని రెండుమూడు రోజుల్లో సమాధానంచెప్పు" అంటూ ఎక్కడికో వెళ్లడానికి చెప్పుల్లో కాలు పెట్టబోయేడు. కానీ ఆమె సూటిగా, సీరియస్‌గా, సిన్సియర్‌గా అడిగిన ప్రశ్నతో అతని కాళ్లు చెప్పుల్లోనించి బయటకొచ్చేశాయి.

"ఇప్పుడు నువ్వు చెప్పిందంతా కేవలం వాళ్ల అభిప్రాయమేనా?"

"సెంట్ పెర్సంట్"

"ఆ అభిప్రాయంమీద నీ అభిప్రాయం ఏవిటి?"

"పదుగురాడుమాట పాటియై ధరజెల్లూ అన్నారు పెద్దలు. ప్రొడ్యూసర్లు చెప్పింది తప్పుకాదనిపించింది"

"ఇది వాళ్లు నీకు చెప్పింతర్వాతొచ్చిన అభిప్రాయమా? లేక నన్ను ఇక్కడికి తీసుకొచ్చే ముందే నువ్వు ఏర్పర్చుకున్న అభిప్రాయమా?"

వరదరాజులు జవాబుకోసం కొన్ని క్షణాలపాటు తడుముకున్నాడు. ఆమే మళ్లీ అడిగింది, "వాళ్లు చెప్పిన పద్ధతి నాకు నచ్చలేదని, నేను మళ్లీ వైజాగ్ వెళ్లిపోయి నాటకాలు ఆడుకున్నాననుకో... అప్పుడు నువ్వు నా గురించి ఏమనుకుంటావు?"

"నీ అంత మూర్ఖురాలు ఈ ప్రపంచంలో మరొకరు లేరనుకుంటాను" చాలా ఆవేశంగా జవాబు చెప్పి చెప్పులు తొడుక్కుని బైటకి వెళ్లబోయేడు.

"ఒక్క నిముషం..."

అతను ఆగేడు. "నీ వేషాల గురించి ఏమన్నారు? ఇస్తామన్నారా?"

"చాలా పెద్ద వేషాలే ఇస్తామన్నారు"

"ఇంతకుముందు నువ్వు అన్నేళ్లు ఇక్కడుండి ట్రై చేసినపుడు నీకెందుకంత పెద్ద వేషాలు ఇవ్వలేదు?"

అతనిలో చిన్నగా వణుకు ఆరంభమయింది.

"ఇపుడెందుకిస్తామంటున్నారు? ఆ ప్రొడక్షన్ మేనేజర్ నీకు చెప్పిన చిట్కా ఇప్పుడ్నీకు దొరికిందనా?"

కిరణ్మయి తన ఉపదేశం విన్నాక, వేషాలకోసం తననితాను అర్పించుకోవడమా, మానడమా అనే ఆలోచిస్తుందనుకున్నాడు. కానీ తన మనసులోని వికృతాన్ని కనిపెట్టి, ఇలా నిలదీసి ప్రశ్నిస్తుందని అతను ఊహించలేదు. అయినా తను తగ్గిపోకుండా, జారిపోకుండా ఏదో చెప్పాలికాబట్టి "ఇప్పుడు నువ్వు ఆలోచించవలసింది నీ గురించి, నీ వేషాల గురించి తప్ప నాకిప్పుడెందుకు వేషాలొస్తున్నాయనికాదు" అన్నాడు.

"నువు నన్ను తారని చెయ్యడానికి తీసుకొచ్చేవా? లేక ప్రొడ్యూసర్లకి తార్చడానికి తీసుకొచ్చేవా?"

కిరణ్మయి అడిగిన ఆ ప్రశ్నతో వారిద్దరి మధ్యనున్న స్నేహబంధమనే తాడు కాస్తా తెగేస్థాయికొచ్చింది.

"చూడు పార్వతీ! ఈ లోకం అనే మార్కెట్లో ఎవరి లాభాలు వాళ్లు చూస్కోడంలో తప్పులేదు. మనం ఒకరికోసం ఒకరు త్యాగాలు చేస్కోనక్కర్లేదు. ఒకర్ని ఉపయోగించుకుని మరొకరు లాభం పొందడానికి చూడాలి. నాలాంటి వాడు

ఎవడో ప్రయత్నించకపోతే నీలాంటిది తారా పథం చేరదు. నీలాంటిదాన్ని ఎవర్నినో అడ్డం పెట్టుకుంటే తప్ప నా బోటివాడు తన ఆశలు నెరవేర్చుకోలేడు"

వరదరాజులు ఆవేశంగా మాట్లాడ్డంలో తనలోవున్న రెండవ మనిషిని ఆమెకు దర్శింపజేసాడు.

వాదన పెరిగేకొద్దీ అతన్లోని రెండో మనిషిమీద ఆమెకు ఆవేశం, అసహ్యం కలుగుతున్నాయి. ఇలాంటివాడి మాటలకా పొంగిపోయి లొంగిపోయి ఇక్కడ కొచ్చేననే ఆవేదన కలుగుతోంది.

"నా అందంతోనే వ్యాపారం చెయ్యాలనుకుంటే, దానికి నేను విశాఖపట్నం వదిలి మద్రాసే రానక్కర్లేదు. నాటకాలు వదిలి సినిమాల కోసం ప్రాకులాడక్కర్లేదు"

కిరణ్మయి ఆత్మాభిమానంతో మాట్లాడిన మాటల్లోని ఓ రెండు వాక్యాలివి!

"నువ్వు నీతిమంతురాలివిగానే గుర్తించబడాలనుకున్నపుడు నువ్వు నాటకాల్లోకే దిగకూడదు. నువ్వు గ్లామర్ జీవితం మీద మోజు లేదనుకున్నప్పుడు నాతో నువ్వు మద్రాసు రానేకూడదు. కానీ వచ్చేవు. వచ్చేక నువ్విక్కడ శీలవతివి, సతీఅనసూయవీ అంటే నమ్మే వెధవలెవరూ లేరిక్కడ. ఆఫ్టరాల్ థియేటర్లో ఆడే సినిమా చూడ్డానికే టిక్కెట్టు కొనుక్కుని మరీ హాల్లోకి అడుగు పెట్టాలి. అలాంటిది సినిమా హీరోయిన్‌గా మారాలన్నపుడు నువ్వు చెయ్యాల్సిన పని నువ్వూ చెయ్యాలి. లేకపోతే నీ బతుకింతే"

వరదరాజులు ఎంత ఆవేశంగా చేప్పేడో అంత ఆవేశంగానే బయటికి వెళ్లిపోయేడు. కిరణ్మయి నులక మంచంమీద పడుకుని భోరుమని ఏడ్చింది. గుండెలు అవిసేలా దుఃఖించింది. తనకింత అందాన్ని, నటనా కౌశలాన్ని ఇచ్చినందుకు ఎన్నోసార్లు దేవుడికి ధన్యవాదాలు అర్పించింది.





కానీ వాటిని అడ్డం పెట్టి పైకి రావాలనుకునే మనస్తత్వం ఇవ్వనందుకు ఇప్పుడు మళ్లీ దేవుడికి ధన్యవాదాలు అర్పించాలో లేక ఆ దేవుడిని తిట్టాలో అర్థంకాలేదు.

ఆమె అలా ఏడుస్తూనే వుంది.

ఏడుస్తూ ఆలోచిస్తూనే వుంది.

ఏడుస్తూ ఆలోచిస్తూ గంటల కొద్దీ కాలక్షేపం చేస్తూనేవుంది.

వరదరాజులు మధ్యాహ్నం భోజనానికి రాలేదు. రాత్రికి తప్పకుండా వస్తాడనుకుంది కానీ రాత్రీ రాలేదు.

మర్నాడు ఉదయమూ రాలేదు.

ఆమె తొలిసారిగా ఆందోళన చెందింది. ఇప్పుడేం చెయ్యడం? అతన్ని ఎక్కడ వెదకడం? అతన్ని వెదికి పట్టుకోడానికి అతను దారి తెలియని మనిషికాదు. మద్రాసులో వున్న రోడ్లన్నీ తెల్సిన మనిషి. మద్రాసులోని సినిమాల్లో బతకడానికి ఎన్ని దారులున్నాయో, అన్నిదారులూ తెల్సిన మనిషి. తనమీద కోపంతో తనని వదిలేసి వెళ్లిపోయేడా? అదే నిజమయితే ఏంచెయ్యాలి?

తను ఇక్కడో వేషం వేసేస్తున్నానని, సర్వఖర్చులూ ప్రొడ్యూసరే భరించేస్తున్నాడని తన తల్లికి రెండురోజుల క్రితమే ఉత్తరం రాసేసింది. ఇప్పుడెలా?

ఇంటి ఓనర్ విశ్వనాథ్ దగ్గరకెళ్లి చెప్తే?

ఛీఛీ... తామిద్దరూ వైజాగ్‌నించి వచ్చేరన్న ఒకేఒక్క కారణంగా ఎడ్వాన్సు కూడా తీస్కోకుండా ఇల్లు అద్దెకిచ్చిన పెద్ద మనిషి! నాలుగు రోజుల్లోనే తమమధ్య ఇలాంటి పొరపొచ్చాలొచ్చేయని తెలిస్తే అతను తనని అవమానించొచ్చు

వరదరాజులు ఫ్రెండు మూర్తిని కల్సుకుని సలహా అడిగితే? అతని ఇల్లెక్కడో తెలీదు. తెల్సినా వాడి మొహం వాడేం సాయం చేస్తాడు? ఇన్నాళ్లుగా తనతో నీడలాగ తిరిగి నేస్తంలాగ మసలిన వరదరాజులే తనని అర్థంచేస్కోలేక అంతర్ధానమైనపుడు కొత్తగా కాస్సేపు మాత్రమే పరిచయం కలిగిన మూర్తి ఏం సాయం

చేస్తాడు? ... పెట్టె తెరచి డబ్బు ఎంతుందో చూసింది....

ముప్పై ఏడు రూపాయల డెబ్బై పైసలు న్నాయి.

ఆమెకు అప్రయత్నంగానే ఏడుపొచ్చేసింది. తిరిగి ఇంటికి వెళ్ళిపోదామన్నా టిక్కెట్టుక్కూడా చాలని డబ్బు.

ఏంచెయ్యాలి? ఏంచెయ్యాలి?

ఆలోచనలు సాగుతున్నవేళ, మధ్యాహ్నం ఎండ ఫెళ్లుమంటున్న సమయంలో తన ఇంటి ముందో ఆటో రిక్షా ఆగింది.

అందులోనించి నడివయసులో వున్న ఒకామె దిగి, తన గుమ్మం దగ్గరకొచ్చి, కిరణ్మయిని ఓసారి రెప్పార్పకుండా చూసి, "నోడౌట్ - నువ్వే కిరణ్మయివి" అంటూ చొరవగా లోపలకొచ్చి మంచంమీద కూర్చుంది.

ఆమె ముఖం ఎక్కడో బాగా ఎరిగినట్టే వుంది. రెండుమూడు క్షణాల తర్వాత గుర్తొచ్చింది. ఆమె పేరు తెలీదుగాని, ఆమె చాలా సినిమాల్లో నటించిన జూనియర్ ఆర్టిస్టు.

తన పేరు సరస్వతి అని, ఆంధ్రా ప్రేక్షకులకి తన ఫేసు కొద్దో గొప్పో తెల్సు తప్ప, పేరు మాత్రం తెలీదని, జూనియర్ ఆర్టిస్టుల పేర్లు తెరమీద వెయ్యరు కదా? ఎలా వేస్తారు? వేస్తే మా పేర్లతోనే నాలుగు రీళ్లు నిండిపోతాయికదా? అంటూ ఆవిడే ప్రశ్న వేసుకుంటూ ఆవిడే జవాబు కూడా చెప్పేస్కుంటోంది. కిరణ్మయికి మాట్లాడే అవకాశం ఇవ్వకుండా తనే దడదడమంటూ చెప్పుకుపోతోంది.

ఆవిడ చాలా సీనియార్టీ వున్న జూనియర్ ఆర్టిస్టు. ఆర్టిస్టు మాత్రమే కాకుండా తెలుగు సినిమాలకు తమిళ సినిమాలకు కూడా జూనియర్ ఆర్టిస్టు సప్లయరట. అయితే జూనియర్ ఆర్టిస్టు సప్లయర్‌గా ఓ ఆడది బతికితే, ఇక్కడున్న మగ సప్లయర్లు ఉడుక్కుంటారట. అంచేత తన మొగుడి పేరనే ఈ వ్యాపారం చేస్తోందట. "ప్రొడక్షన్ మేనేజర్ నాగేశ్వర్రావు మొన్న కల్సినప్పుడు ఎవడో వరదరాజులు నిన్ను పట్టుకొచ్చేడని చెప్పేడు. నువ్వో ఆర్నెల్లపాటు తిరిగాక, వేషాలు దొరకవన్న నిరాశ కలిగినపుడు, నిన్ను పిలిపించి నా ట్రూపులోకి లాగుదామనుకున్నాను. కానీ నువ్విక్కడకొచ్చిన నాలుగురోజులకే ఆ వరదరాజులుగాడు నిన్నొదిలి పారిపోయేడని తెల్సి వెంటనే ఆటో వేసుకొచ్చేశాను" అంది.

కిరణ్మయికంతా అయోమయంగా వుంది. వరదరాజులు తనని వదిలి వెళ్లిపోయినట్టుగా తను ఇప్పుడే గ్రహించింది. కానీ ఇంకా ఎవర్తోనూ అనలేదు. కానీ ఇంతలోనే ఈ విషయం ఈవిడకి తెల్సిపోవడం, ఇల్లు వెదుక్కుంటూ వచ్చేయడం కూడా జరిగిపోయింది.

ఇదెలా సాధ్యం?

ఈ ప్రశ్నని అడగకుండా వుండలేకపోయింది.

ఆ ప్రశ్నకి ఆమె పిచ్చి నవ్వు నవ్వింది.

"పిచ్చిపిల్లా, నీలాంటోళ్లు మద్రాసులోకి దిగీదిగ్గానే మా నోటీసులోకి వచ్చేస్తారు. ఎలా వచ్చేస్తారని అడక్కు! జానపద సినిమాల్లో మాంత్రికుడు వేషం ఏసేవోడు, ఓ బొమ్మ దగ్గరకెళ్లి ఫలానా ఫలానా లచ్చణాలున్న ఆడగుంట ఎక్కడుందో చెప్పూ అనగానే, ఆ బొమ్మ కిచకిచమని నవ్వుతూ, ఫలానా ఫలానా చోట వున్నదని చెప్పగానే డైరెక్టరు మనకి హీరోయిన్ బొమ్మని సూపెడతాడు. ఆ మాంత్రికుడికాడ అందమైన అమ్మాయిల అడ్రస్సులు చెప్పే బొమ్మ ఒక్కటే వుంటాదిగాని, నాలాంటి సప్లయర్ల కాడ నాలుగైదు బొమ్మలుంటాయి. బొమ్మలంటే బొమ్మలు కాదనుకో. ఆడ బ్రోకర్లు, మగబ్రోకర్లన్న మాట. ఎటొచ్చీ నేను సప్లయర్‌నేగాని మాంత్రికురాల్ని కాదు" అంటూ మళ్లీ పిచ్చిగా నవ్వి బొడ్లోనించి జర్దా కిళ్లీ తీసివేసుకుంది.

ఆవిడ ఎందుకొచ్చిందో మొదట కిరణ్మయికి అర్థంకాలేదుగాని, ఓ పదినిమిషాల తర్వాత అర్థమైపోయింది. ఆవిడ ట్రూపులో తనని జూనియర్ ఆర్టిస్టుగా జాయినవమని చెప్పింది. జూనియర్ ఆర్టిస్టులకి కాల్‌షీటుకి ఎంతిస్తారో చెప్పింది. డైలాగ్ చెప్పే వేషానికైతే ఎంత ఎగస్ట్రా యిస్తారో చెప్పింది.

స్టూడియోలో షూటింగు జరిగితే ఎంతిస్తారో, స్టూడియో బయట షూటింగు జరిగితే ఎంత ఇస్తారో చెప్పింది.

పొద్దుట టిఫిన్లు, మధ్యాహ్నం భోజనాలు కంపెనీవాళ్లే పెడతారని చెప్పింది. సాయంకాలం ఆరు గంటల తర్వాత షూటింగ్ జరిగితే అదనంగా డబ్బు ఇవ్వడంతోపాటు టిఫిన్లు కూడా యిస్తారని... ఇలా జూనియర్ ఆర్టిస్టులకొచ్చే ఆదాయాల గురించి చెప్పింది.

ఈ మాటలు కిరణ్మయి ఆసక్తిగా వినలేదు. అసహ్యాపడుతూనే విన్నది. "ఆంధ్ర రాష్ట్రంలో ఎనభయ్యేడుసార్లు ఉత్తమ నటిగా బహుమతులందుకుని, మూడుసార్లు అత్యంత ప్రతిష్టాకరమైన కిరణ్మయి అవార్డును పొంది, మూడుసార్లు వెండి కిరీటాన్ని శిరసుమీద అలంకరించుకున్న తను... అదే శిరస్సుని పరిస్థితులముందు ఒంచి, గుంపులో ఒకరిగా కనిపించే జూనియర్ ఆర్టిస్టువేషం వేయడమా? నెవర్ అని మనసులో అనుకుంటున్నమాటని ఆమె ముఖమ్మీదే అనేసింది.

ఆ మాటకామె సీరియస్సు అవలేదు. మళ్లీ పిచ్చి నవ్వు నవ్వి, బయటకెళ్లి కిళ్లీ వుమ్మని తుపుక్కుమని వుమ్మి తిరిగొచ్చింది.

"చూడు పిల్లా ఇలాంటి కష్టాలు మనకొస్తాయనే, మన చిన్నతనంలో మనచేత హరిశ్చంద్రుడి కథ, పాండవులకథ మనచేత బడుల్లో చదివిస్తారు. హరిశ్చంద్రుడెవడు? మహారాజు! కిరణ్మయి అవార్డుని మూడుసార్లు నీ తలకాయ మోసిందీ మోసిందీ అంటున్నావ్! నీ మూడు వెండి కిరీటాలూ కలిసి, హరిశ్చంద్రుడి కిరీటంలో అంగుళంపాటి విలువ చేస్తాయా? నీ పేరూ ప్రతిష్టా హరిశ్చంద్రుడి కీర్తితో పోలిస్తే ఏపాటిది చెప్పు! అట్టాంటి మారాజే గ్రహచారం బాగులేక రాజ్యం ఒగ్గేసి, ఫేమిలీతో సహా ఫారెస్టులకెళ్లిపోయేడు. పెళ్లాన్ని సైతం బజార్లో పెట్టి సంతలో పశువుని అమ్మేసినట్టు అమ్మేశాడు. అట్టాంటిది డ్రామా ఏక్టరుగా నీకున్న కాస్తంత పేరునీ యిక్కడ ఒగ్గేస్తే తప్పేటి? పాండవులంతటోళ్లు గ్రహచారంచాలక విరాటరాజు కొలువులో మారు ఏషాలు ఏస్కుని వుజ్జోగస్తులుగా కుదురుకున్నారు. ద్రౌపది అంతటి మహారాణి మరోచోట రాణీ దగ్గర చాకిరీచేసింది. ద్రౌపది వైభవం దగ్గర నీ గొప్పెంత? నా గొప్పెంత? అయితే ఆళ్ల గ్రహచారం మళ్లీ బాగుపడి రాజ్యాలు ఏలలేదా? అలాగే నీకూ మంచి టైము కలిసొస్తే నువ్వూ హీరోయిన్‌వై పోతావేమో! చిలకశ్రీ యీనాడు తెలుగులోనూ తమిళంలోనూ హీరోయిన్‌గా దున్నేస్తోందిగాని, అదీ ఒకప్పుడు నా ట్రూపులో ఎగస్ట్రా వేషాలు ఏసిందేగదా... ఏమో నీకు దానికంటే అందంచందం ఎక్కువగానే వున్నాయి. బాగా ఆలోసించుకో! నువ్వెక్కడో వుంటే నిన్ను ఎతుక్కుంటూ అదృష్టం నీ దగ్గరకి రాడానికి, అదృష్టానికి దగ్గరగా నువ్వుండడానికీ మధ్య చాలా తేడావుంది! టూత్‌పేస్టున్నాది చూశావా? ట్యూబ్‌ని కిసుక్కుమనిపిండితే పుసుక్కుమంటూ పేస్టు బయటికొస్తాది. గాని ఆ పేస్టుని మళ్లీ ఆ ట్యూబ్‌లోకి తోసెయ్యాలంటే మాత్రం మన ఒల్లకాదు. ఒకసారి వూరు విడిచి, యిల్లు విడిచి, యీ సినిమా రంగంలో కాలుపెట్టేసాక, మళ్లీ ఎనక్కి తిరిగి వెళ్లిపోవడం కూడా అలాంటిదే! ఇందా, ఈ వందా వుంచు. ఎందుకైనా పనికొస్తాది! రేపు మా బుచ్చిబాబు గాడొచ్చి నీకు ప్రోగ్రాములు




గురించి చెప్తాడు"

కిరణ్మయి మంత్రముగ్ధలా వింటూ వుండి పోయింది. సరస్వతి ఆమె చేతిలో పెట్టిన వందనోటునిగాని, ఆమె తిరిగి వెళ్లిపోవడం గాని ఆమె గమనించలేదు. తర్వాత తేరుకుని, మంచంమీద పడుకుని తీరిగ్గా, తీవ్రంగా ఆలోచించింది.

ఈ సినిమారంగం గురించి క్షుణ్ణంగా తెల్సిన వారందరకీ ఎదుటివాళ్లని మాటల్తో కట్టిపడవేసే వాక్చాతుర్యం సహజంగానే అబ్బుతుందా? మద్రాసువచ్చే వరకు వరద రాజులూ యిలాగే తన వాక్చాతుర్యంతో, తన మనసుకి గంతలు కట్టేసి దానికి మరో దారి కనబడకుండా కేవలం సినిమా ప్రపంచం ఒక్కటే కనబడేలా చేశాడు. ఆ అనుభవం యింకా జీర్ణం కాకముందే సరస్వతి తన జీవితంలోకి ప్రవేశించి, యిక్కడ బతకడానికి కేవలం యిక్కడే బతకడానికో మార్గం చూపించింది. అందులో కూడా సుఖం వుందంటోంది. చిలకశ్రీకి లభించినట్టే తనకీ ఓ మంచి భవిష్యత్తు కలగొచ్చనే ఆశకి అంకురార్పణ చేస్తోంది. ఇంటికి వెళ్లిపోదామనుకుంటుండగా, మళ్లీ తనకి ఓ సంకెల తగుల్కుంది.

వరదరాజులు తనకి పగ్గాలు బిగించి యిక్కడకిలాక్కొచ్చేడు.

సరస్వతి సంకెళ్లు బిగించి యిక్కణ్ణించి కదలకుండా చేస్తోంది.

ఇలా ఆలోచించాక ఆమెకు మళ్లీ ఎన్నాళ్టి నించో తనకుతాను వేసుకునే ప్రశ్నే గుర్తొచ్చింది.

'ఏమిటీ జీవితం?'



ఆంధ్ర నాటకరంగంలో జైత్రయాత్ర ఆరంభించి, ప్రేక్షకులను తన నటనాపటిమతో వుర్రూతలూగించి, యువతరం గుండెల్ని వురుకులూ పరుగులూ తీయించి మూడు సార్లు కిరణ్మయి అవార్డు పొందిన పార్వతి, ఎలియాస్ కిరణ్మయి మద్రాసు సినిమారంగంలో వున్న వందలాది వేలాది మంది

జూనియర్ ఆర్టిస్టుల్లో ఒకరిగా మారిపో యింది.

అయితే ఆమె అందం ఆమెకు కొన్ని చిత్ర మైన అనుభవాలని కలిగించింది. నాలు గైదు సినిమాల్లో గ్రామీణ వాతావరణంలో అనాగరికమైన మనుషుల వేషాలకి జూని యర్ ఆర్టిస్టులు కావల్సొచ్చినప్పుడు ఓ వందమంది ఆర్టిస్టుల్ని సరస్వతి తీసుకె ళ్లింది. అందులో ఓ అమాయిక పల్లెపడుచు ఆ వూరికామందుని ఎదిరించి ఆవేశంగా మాట్లాడవలసిన సీన్ ఒకటుంది. అసోసి యేట్ డైరెక్టరు ఆర్టిస్టులందర్నీ చూసి "మీలో పెద్ద డైలాగు ఎవరు చెప్పగలరు?" అని అడిగితే ఓ పదిమందిదాకా "మేం చెప్తాం మేం చెప్తాం" అంటూ ముందుకు వచ్చేరు. కిరణ్మయి మాత్రం ముందుకు రాలేదు. ఆంధ్ర నాటకరంగంమీద తన చరిత్ర ఏమిటి? ఎవరైనా డైలాగ్ చెప్పగ లరా అని అడిగితే చెప్పగలం చెప్పగలం అంటూ ఎగబడిన పదిమందితోపాటు పద కొండో మనిషిగా తను వెళ్లడం ఏమిటీ? అని ఆగిపోయింది. ఆమె ఆత్మాభిమానమే ఆమెకు అడ్డుగోడగా నిలబడింది. అసోసి యేట్ డైరెక్టరు పదిమంది అమ్మాయిలచేత ఆ డైలాగులు చదివించేడేగాని ఒక్కరూ ఆయన్ని సంతృప్తి పరచలేదు. అనుకో కుండా అతని దృష్టి కిరణ్మయి మీదపడి ఆమెను ముందుకు పిలిచాడు. సీన్ పేప రిచ్చి డైలాగు చదవమన్నాడు. ఆమె సంశ యిస్తుంటే పక్కనేవున్న సరస్వతమ్మ ఆమె భావాన్ని గమనించి 'నిండా మునిగినోడికి చలేటి' అంటూ మందలింపు ధోరణిలో ప్రోత్సహించింది. కిరణ్మయి ఓసారి డైలా గుని మనసులో చదువుకుని వెంటనే తన బాణీలో ఆ డైలాగ్‌ని బయటికి చదివింది. అసోసియేట్ డైరెక్టరు అదిరిపోయి "యీ డైలాగ్ నువ్వే చెప్పు" అంటూ సీన్ పేప రిచ్చి వెళ్లిపోయేడు.

షాట్ ఆరంభమయింది. కిరణ్మయి మొదటి టేక్‌లోనే ఆ డైలాగ్‌ని బాగా చేసింది. ఆమె నటనని ప్రత్యక్షంగా చూసిన చాలామంది చప్పట్లు కొట్టకుండా వుండలేక పోయేరు.

కొట్టకుండా వున్న వారిలో ముఖ్యుడు ఆ సినిమా డైరెక్టర్ వెంకట్! నెక్స్ట్ షాట్ ఏమిటో చెప్పకుండా కిరణ్మయిని అసోసియే ట్‌ని తన దగ్గరకి పిలిచాడు. ఆమెను నఖ శిఖపర్యంతం, ఓసారి కాదు, నాలుగైదుసార్లు చూశాక, తన అసోసియేట్‌మీద గయ్ మంటూ ఎగిరాడు. "నీకేమైనా బుద్ధుందా? యీసీన్‌లో వుండాల్సిన మనుషులెవరు? కామందుల దోపిడీకి గురయిపోతున్న గ్రామీణ జనం! అమాయకులు, అక్షరజ్ఞానం లేనివాళ్లు. ఈ అమ్మాయి ఏమైనా అలా కని పిస్తోందా? మారువేషం వేసుకున్న జిల్లా కలక్టరులాగో, దాసీ వేషం వేసుకున్న యువ రాణీలాగో కనిపిస్తోంది. పైగా డైలాగ్ ఎంత వండర్‌ఫుల్‌గా చెప్పింది? ఇలాంటి బెస్ట్ ఆర్టిస్టుల్ని ఇలా గుంపుతో కలిపేస్తే ఎలాగయ్యా? యిందులో అమెరికానించొచ్చే కామందుగారి కూతురు వేషం వుందిగదా! పదిపన్నెండు సీనుల్దాకా వుంటుంది. ఆ వేషం యిద్దాం! యీవిణ్ణి లేబర్ వేషానికి కేన్సిల్‌చేసి ఆ వేషానికి ఫిక్స్‌చెయ్" అన్నాడు.

"అలాగేసార్! కానీ యింత డైలాగ్ చెప్ప గలిగే మరో జూనియర్ ఆర్టిస్టు ఎవరూ యిక్కడ లేరుసార్" అన్నాడు అసోసియేట్.

"అయితే ఆ డైలాగ్‌ని బిట్స్ కింద కట్ చేసి ఒక్కో ఆర్టిస్టు చేత ఒక్కో వాక్యం చెప్పించు" అంటూ డైరెక్టరు ఆర్డరు వేశాడు.

తన దశ తిరగబోతోంది. తన సామర్థ్యా నికో గుర్తింపు రాబోతోందని లోలోపల సంతోషించింది కిరణ్మయి.

★ ★ ★

మద్రాసుకి నూటముప్పైకిలోమీటర్ల దూరంలో వున్న గ్రామంలో జరుగుతోందా షూటింగు! రోజూ మద్రాసునించి అక్కడకి




వెళ్లి రావడం యిబ్బందిగా వుంటుందని, ఆ గ్రామానికి కాస్త దగ్గరగా వున్న వూళ్లో చిన్న చిన్న లాడ్జీలు బుక్‌చేశారు. ముఖ్యమైన ఆర్టిస్టులు, టెక్నీషియన్లూ వాటిలో వుంటున్నారు. జూనియర్ ఆర్టిస్టులందర్నీ ఓ సత్రంలో పెట్టేరు. ఆ రోజు రాత్రి పదిదాటేక కిరణ్మయి నేలమీద చాప పరుచుకుని పడుకోబోతుండగా సరస్వతి వచ్చి "నిన్ను డైరెక్టరు గారు రమ్మంటున్నారు" అంది.

"ఎందుకు? " అంది కిరణ్మయి. ఆ ప్రశ్నలో ఆశ్చర్యంలేదు.

"ఈ సినిమాలో నీకు కామందు కూతురు వేషం యివ్వడమా? లేక అంతకంటే పెద్దదైన సెకెండ్ హీరోయిన్ వేషం యివ్వడమా అన్నది నీతో డిస్కస్ చేస్తారట"

"ఇప్పుడా? "

"లేడీ ఆర్టిస్టుల్తో డైరెక్టర్లు డిస్కషన్ చేసేది ఈ టైములోనే కదా? "

"వేషం ఇవ్వడమా ఇవ్వకపోవడమా అన్న విషయాన్ని డైరెక్టరు డిస్కస్ చెయ్యవలసింది ప్రొడ్యూసర్‌తోగాని, నాతోకాదు"

సరస్వతి ఆమాటలకి మండిపడుతూ, "చెబితే అర్థం చేస్కోవేం? " అంటూ ఏదో చెప్పబోతే ఆమెను ఒక్కచూపుతో కిరణ్మయి ఆపుచేసింది. "నేను యీ దార్లోనే వేషాలు సంపాదించుకోవాలనుకుంటే ఈపాటికి ఏనాడో నేను టాప్ హీరోయిన్ని అయ్యేదాన్ని. నేనాయనగదికి వెళ్లను, వెళ్లకపోతే ఏమవుతుందో నువ్వు చెప్పక్కర్లేదు! నాకా కామందు కూతురు వేషం, సెకెండ్ హీరోయిన్ వేషం కాదుగదా నాకిచ్చిన జూనియర్ ఆర్టిస్టు వేషం కూడా లేకుండా రేప్పొద్దుటే నన్ను మద్రాసు పొమ్మంటారు. నేను అందుకు రెడీగానే వున్నానని చెప్పు" అంది.

జూనియర్ ఆర్టిస్టు సప్లయర్‌గా దాదాపు పాతికేళ్ల అనుభవం గలిగిన సరస్వతికి జీవితంలో యింత ఖచ్చితంగా యింత నిర్మొహమాటంగా తిరస్కరించగలిగిన ఆర్టిస్టెప్పుడూ ఎదురు పడలేదు.

"ఈ సిన్మాఫీల్డో వైకుంఠ పాళీయే! నిచ్చెనలు ఎక్కి పైకి చేరడానికి అందరూ ప్రయత్నిస్తుంటే నువ్వా నిచ్చెనల్ని పడగొట్టేసి ఎతుక్కుంటూ ఎతుక్కుంటూ వెళ్లి పెద్ద పాము నోట్లోకి దూరి కిందకి జారిపోతావేమే" అంటూ సరస్వతి సణిగినా కిరణ్మయి అప్పటికే కళ్లమూసుకుని నిద్దట్లోకి జారింది.

ఇలాంటి సంఘటనలు కిరణ్మయి జీవితంలో మరికొన్ని ఎదురుపడ్డా కిరణ్మయి మనస్తత్వంలో మాత్రం మార్పు రాలేదు.

★ ★ ★

రెండున్నర సంవత్సరాల కాలం చక్రంలా దొర్లుకుంటూ వెళ్లిపోయింది.

ఒక దేశచరిత్రలో రెండున్నర సంవత్సరాల కాలం చాలా స్వల్పం కావచ్చుగాని, ఒక సినిమా నటి జీవితంలో మాత్రం చాలా ఎక్కువనే చెప్పాలి.

ఈ రెండున్నర సంవత్సరాల్లో అట్టడుగునున్నవాడు అగ్రస్థానానికెళ్లవచ్చు, ఆకాశంలో వున్నవాడు అథః పాతాళానికి దిగిపోవచ్చు! కానీ జూనియర్ ఆర్టిస్టులకీ తేడాలు వర్తించవు. ఎటువంటి వారి జీవితాల్లోనైనా మార్పు తేగలిగే శక్తి వున్న కాలానికి జూనియర్ ఆర్టిస్టుల జీవితాల్లో మాత్రం మార్పు తెచ్చేశక్తిలేదని ఏనాడో రుజువైపోయింది. కాకపోతే వాళ్లు సమష్టిగా చేసిన డిమాండ్లవల్ల వాళ్లరేట్లు కొద్దో గొప్పో పెరిగాయి. కొంతమంది లేడీ ఆర్టిస్టులు ఆదాయాన్ని పెంచుకోడానికి సైడ్ బిజినెస్ కింద వ్యభిచారాన్ని కూడా ఆశ్రయించగా, మరి కొందరు కొంతమంది మగాళ్లకి వుంపుడుగత్తెలుగా, పెళ్లాలుగాని పెళ్లాలుగా మారేరు! అంతకుమించి వాళ్ల చరిత్ర విశేషాలు ఇక్కడ అనవసరం.

కిరణ్మయి ఈ రెండున్నర సంవత్సరాల కాలంలో జూనియర్ ఆర్టిస్టుగా నటించిన సినిమాలు నాలుగైదు కంటే ఎక్కువలేవు.



ఆంధ్రరాష్ట్రంలో ఔత్సాహిక నాటక బృందాలవల్లే నాటకకళ బతుకుతుంటే మద్రాసు రాష్ట్రంలో వృత్తికళాకారులవల్లనే ఆ కళ ప్రేక్షకులని అలరిస్తోంది. సినిమా లకి దీటుగా నాటకాలాడే వృత్తి సమాజాలు న్నాయి. ఆ నాటకాలు చూడ్డానికి టిక్కెట్టు కొనే ప్రేక్షకులున్నారు. టిక్కెట్టుకొన్న ప్రేక్ష కుణ్ణి అన్నివిధాలా రంజింపజేయడానికి అన్ని హంగులూ పెట్టి నవరసభరితంగా నాటకాల్ని ప్రదర్శిస్తారు.

కిరణ్మయికీ విషయం తెలిసి, పట్టుపట్టి తమిళం బాగా నేర్చుకుంది. జగదీశన్ అనే ఓ తబలావాయిద్యకారుడి ద్వారా ఓ ప్రముఖ నాటకప్రయోక్తని పరిచయం చేసు కుని, ఆ నాటక సమాజంలో ప్రవేశించింది. చేతిలో వున్నది గంధంచెక్కో, సరుగుడు చెక్కో తెల్సుకోవడానికా ప్రయోక్తకి ఎక్కువ రోజులు పట్టలేదు. కిరణ్మయికి హరిశ్చం ద్రలో చంద్రమతి, మనోహర నాటకంలో తల్లిపాత్ర, రామాయణంలో మండోదరి పాత్ర వగైరా ముఖ్యమైన వేషాలిచ్చి ప్రోత్స హించాడు. దాంతో ఆదాయం, ఖర్చులకి పోను ఆదా చెయ్యాల్సినంతగా రాకపో యినా, ఖర్చుల కోసం అప్పులు చెయ్యాల్సిన పరిస్థితి మాత్రం తప్పింది. తల్లికి ఉత్తరాలు రాయడంతోపాటు కాస్తో కూస్తో మనియా ర్డరు చేస్తోంది. తల్లిని తన దగ్గరకొచ్చెయ్య మని ఎన్నోసార్లు రాద్దామనుకుంటూనే రాయలేకపోయింది. ఒకటి రెండుసార్లు అలా రాసి, ఆ వాక్యాన్ని కొట్టేసింది. అమ్మని రమ్మంటే, తమ్ముడు లేకుండా అమ్మ రాదు. తమ్ముడు అమ్మతో కలిసి తన దగ్గరకి వచ్చినా రాడు. తల్లి మరీ బల వంతపెడితే వస్తాడు. కానీ, వచ్చాక ఇక్క డెన్ని బేవార్సు తిరుగుళ్లు తిరుగుతాడో, తిరిగి ఎన్ని తగువులు తెస్తాడో మద్రాసు పోలీసులు ఆంధ్రా పోలీసులకంటే చాలా స్ట్రిక్టు అని విన్నది. ఖర్మకాలి వాడేమయినా పేకాటలాడి, మరో వెధవ పనిచేసి పోలీసు లకి దొరికిపోతే? తన బతుకు పెనంమీద నించి పొయ్యిలో పడినట్టవుతుంది. అందుకే... కొన్నాళ్లపాటు తన తల్లి మాన సికంగా బాధపడినా, ఆర్థికంగా బాధపడకూ డదని ఎంతో కొంత డబ్బు పంపిస్తోందే తప్ప తనుండే ఇంటి అడ్రస్ మాత్రం రాయ డంలేదు. నాటకాల్లో బిజీగా వుండడం వల్ల సినిమాల్లో జూనియర్ ఆర్టిస్టు వేషాలు వెయ్యాల్సిన అవసరమేం కనపడలేదు.

జీవితం గొప్పగా కాకపోయినా, చక్కగానే సాగిపోతోంది. ఒకసారి ప్రత్యేక పరిస్థి తుల్లో, ఏదో కంపెనీవారు జానపదం చిత్రం తీస్తూ అయిదు సీన్లుండే వేషం ఇచ్చారు. ఆ కథలో రాజుగారికో వుంపుడుగత్తె వుంటుంది. ఆమె మహాఅందగత్తె. నర్తకి, రచయిత్రి. కృష్ణభక్తురాలు. పేరుకు వుంపు డుగత్తె అయినా ఆమెలో సద్గుణాలున్న పాత్రే అది. ఆ ప్రొడ్యూసర్, డైరక్టరు ఓసారి తమిళనాటకంలో ఆమె మండోదరి పాత్ర వేసినప్పుడు ఆమెను ఆ వేషంలో చూసి బుక్ చేశారు. రెండురోజుల వేషం! అయిదువేలు ఇస్తామన్నారు. పైగా షూటింగ్ కూడా మంగళవారం, బుధవారం ఏర్పాటుచేశారు. అంటే శనివారం, ఆది వారం ఆడే నాటకాలకి ఎటువంటి అవ రోధం వుండదని చెప్పడంతో అంగీకరిం చింది. మొదటిరోజు ఆమె వీణవాయిస్తుం డగా, మహారాజుగారు ఎంజాయ్ చేసే సీను షూట్ చేశారు. షాట్ మధ్యలో ఓ ద్వార పాలకుడు వచ్చి- "జయము జయము మహారాణీ! తమ సోదరులు కోసలదేశం నించి వేంచేస్తున్నట్టుగా ఇప్పుడే వర్తమానం అందింది" అనే డైలాగ్ చెప్పాలి. డైరక్టరు ఓ రిహార్సల్ చేద్దామన్నాడు. రిహార్సలు ఆరంభమయింది. భటుడు వచ్చి చిన్నరాణి గారి ముఖంలోకి చూసి డైలాగ్ చెప్పాలి. యాక్షన్ అని చెప్పగానే భటుడు వచ్చి "జయము జయము మహారాణి..."




అంటూ డైలాగ్ చెప్తూ ఠక్కుమని ఆగిపో యాడు.

అతన్ని చూస్తూ కిరణ్మయి కూడా షాక్ అయింది.

ఆ భటుడు మరెవరో కాదు? వరదరా జులు.

కిరణ్మయిని చూసి అతను ఖంగు తిన డంతో డైరక్టరు చిరాకుపడి, మరో రెండు రిహార్సల్సు చేయించాడు. మళ్ళీ అతను డైలాగు తడబడ్డాడు. పోనీ టేక్‌లోనైనా సరిగా చేస్తాడేమోననుకుని టేక్ పెట్టేడు. అప్పుడూ ఫెయిలయ్యాడు. ఒకటి, రెండు, మూడు, నాలుగు టేక్‌లు తిన్నాక డైరక్టరు వరదరాజుల్ని తెలుగులోనూ, తమిళంలోను తిట్టేశాడు.

ఈలోగా లంచ్ బ్రేకు వచ్చింది. "ఆ ఆర్టి స్టుని మార్చి మరో ఆర్టిస్టుని పిలవండి" అన్నాడు డైరక్టరు.

"నేనీ వేషం వెయ్యలేనంటూ అతనే మేకప్ తీసేసి వెళ్ళిపోయాడు" అన్నాడు అసి స్టెంటు డైరక్టరు. కిరణ్మయి నిట్టూర్చింది. లంచ్‌టైములో అతన్ని పిలిచి మాట్లాడదా మనుకుంది. కానీ ఆమె అలా మాట్లాడు తుందని వూహించే అతను వేషం వదిలేసి మరీ వెళ్ళిపోయాడని కిరణ్మయి చాలా సుల భంగానే గ్రహించింది.

★ ★ ★

ఆ జానపద చిత్రం విడుదలయ్యాక కిర ణ్మయి జీవితంలోను, చిత్రసీమలో కూడా కొన్ని మార్పులు చోటు చేసుకున్నాయి.

ఆమె వేషాలు వేస్తున్న నాటక సమాజం అధిపతి హఠాత్తుగా చనిపోవడంవల్ల ఆ సమాజం మూడు ముక్కలు ఆరు చెక్కలూ అయిపోయి నాటక సమాజం నాటకాలు వేయడం ఆపేసింది. రెండు... ఆ జాన పదం పిక్చరు హిట్టవ్వడంతో రెండు మూడు చిన్నా చితకా వేషాలొచ్చాయి. ఒప్పుకుంది. ఇకమీదట తన జీవితం బావుంటుందనే భరోసా కలుగుతోందనగా ఆంధ్ర రాష్ట్రంలో ఎలక్షన్లు జరిగి అంతవ రకూ రూల్ చేస్తున్న పార్టీ ఓడిపోయింది.

అధికారంలో కొచ్చిన పార్టీ ఆంధ్ర రాష్ట్రం లోనే తెలుగు సినిమాలు తీయాలని అలా తీసేవారికి చాలా ప్రోత్సహకాలు ఇస్తామని ప్రకటించింది. దాంతో అంతవరకు మద్రా సులో సినిమాలు తీస్తున్న నిర్మాతలు చాలా మంది హైదరాబాదులో సినిమాలు తీయ నారంభించారు. హీరో హీరోయిన్లని ప్రేక్ష కుల్లో కాస్త ఇమేజ్ అంటూ ఏర్పర్చుకున్న వారిని తప్ప చిన్నా చితకావేషాలు వేసే ఆర్టి స్టులని మద్రాసునించి హైదరాబాదుకు తీసుకొచ్చి వేషాలు వేయించడం మానేశారు. ఓమాదిరి ఆర్టిస్టుల సంగతే అలావుంటే జూనియర్ ఆర్టిస్టుల పని మరీ దుర్భరంగా తయారైంది. హైదరాబాదులోనే చాలా మంది జూనియర్ ఆర్టిస్టులున్నారు. ఆఫీసు ల్లోను, మరోచోట, మరోచోట ఉద్యోగాలు చేసుకునేవాళ్ళు సైతం, తమ ఉద్యోగాలకి సెలవుపెట్టి మరీ వేషాలు వేసి, ప్రొడ్యూ సర్లు ఎంత ఇచ్చినా అదే మహాప్రసాదంగా భావించి తీసుకుపోతున్న తరుణంలో ప్రత్యే కించి మద్రాసునించి జూనియర్ ఆర్టిస్టుల్ని తీసుకొచ్చి వేషాలు ఇవ్వవలసిన అవసరం నిర్మాతలకి కనిపించలేదు. మద్రాసులోని జూనియర్ ఆర్టిస్టులకి గడ్డుపరిస్థితి ఏర్ప డింది. భోజనానికి, ఇంటద్దె కట్టడానికి కూడా కటకటలాడిపోతున్నారు. కొంత మంది తెగించి హైదరాబాదు వచ్చేశారు. మళ్ళీ ఇక్కడ కొత్తగా అద్దె ఇళ్ళు సంపాదిం చడం, ఆ ఇంటికి ఎడ్వాన్సు కట్టడం, పిల్ల లున్న వాళ్ళయితే వాళ్ళ చదువులకి స్కూల్లో సీట్లు సంపాదించడం... ఇవన్నీ వాళ్ళు హైదరాబాదు రాగానే ఎదురుపడ్డ సమ స్యలు!

కిరణ్మయి కూడా కొంతమంది సలహా మీద హైదరాబాదుకు మకాం మార్చింది. వచ్చీ రాగానే ఇల్లెక్కడ దొరుకుతుంది?



మద్రాసులో స్నేహమయిన రేవతి అనే జూనియర్ ఆర్టిస్టు ఓ చిన్న ఇంట్లో వుంటే ఆవిడతోపాటు ఆ ఇంట్లోనే ఓ వారంరోజులపాటు తలదాచుకుని ఆ తర్వాత ఓ సందులో ఓ చిన్న ఇల్లు సంపాదించుకుంది. చేతిలో వున్న కాస్త డబ్బు ఇంటికి ఎడ్వాన్సుకిపోగా, ఓ వారానికి సరిపడే దిన వెచ్చాలు కొనుక్కోగలిగింది.

యాచక యాచక శత్రువన్న సామెత అన్నిచోట్లా ఎదురయినట్లే ఇక్కడా కిరణ్మయికి ఎదురయింది. ఆమెకే కాదు, మద్రాసునించి హైదరాబాదు వచ్చిన జూనియర్ ఆర్టిస్టులకి మరికొంతమంది చిన్న చిన్న టెక్నీషియన్లకి కూడా ఎదురయింది.

"మా కడుపులు కొట్టడానికి అక్కణ్ణించి ఇక్కడకొచ్చేరా? ఇక్కడున్నవాళ్లకే సరిపడినంత పనిలేక ఏడుస్తుంటే, మీరొచ్చి మాకు ఆ పనికీ పోటీ తగిలేరా? " అంటూ అప్పటికే హైదరాబాదులో స్థిరపడ్డవాళ్లు మూలగనారంభించారు. కేవలం వారికి మూలిగే హక్కే తప్ప, బయటివాళ్లని కాదు, పొమ్మనే హక్కులేదు. ఇక్కడ మరో సమస్య వచ్చింది. తెలుగు సినిమా పరిశ్రమ ఆంధ్ర రాష్ట్రంలోనే స్థిరపడాలనే సదుద్దేశంతో సినిమారంగాన్ని ప్రభుత్వం ఆహ్వానించింది. కానీ ఆంధ్రరాష్ట్రం అంటే ఏవూరు? ఇదీ సమస్య! హైదరాబాదు ఆంధ్ర రాష్ట్రానికి రాజధాని నగరమే అగుగాక, అక్కడే సినిమా స్టూడియోలు వగైరాలుండి వుండవచ్చు కానీ - నిర్మాతలంతా సినిమాలు అక్కడే తీయడంలేదు. వారి కథని బట్టి, వారికి లభించే మిగతా సౌకర్యాన్ని బట్టి వాళ్లు ఆంధ్రాలోని ఏ వూర్లోనైనా షూటింగు చెయ్యొచ్చు. ఆ సదుపాయం వుండడంవల్ల కొంతమంది నిర్మాతలు విశాఖపట్నంలోను, తిరుపతి, రాజమండ్రి, అరకువేలి, కాకినాడ, గుంటూరు ఇత్యాది నగరాల్లో కూడా షూటింగులు చేయనారంభించారు. అందువల్ల వాళ్లకి కొన్ని లాభాలు, మరికొన్ని నష్టాలున్నాయని తేలినా, జూనియర్ ఆర్టిస్టులకి మాత్రం కేవలం నష్టమే ఏర్పడింది.

హైదరాబాదులో జరిగే షూటింగులకే జూనియర్ ఆర్టిస్టుల్ని సప్లయ్ చేయడానికి మూడు నాలుగు అసోసియేషన్లు ఏర్పడివున్నాయి. వాటి మధ్య ముమ్మరంగా పోటీ సాగుతోంది. అయినా, మిగతా వూళ్లలో కూడా షూటింగులు ఎక్కువవడంవల్ల ఇక్కడున్న వారందరికీ పని చాలా తక్కువగా దొరుకుతోంది. ఇతర వూళ్లలో జరిగే షూటింగులకయినా హైదరాబాదునుంచి జూనియర్ ఆర్టిస్టుల్ని తీసుకువెళ్తున్నారా అంటే అదీ లేదు. ఏ వూరికావూళ్లోనే జూనియర్ ఆర్టిస్టు అసోసియేషన్లు వెలిశాయి. వాటి మధ్య పోటీ కూడా ఆరంభమయింది. ప్రొడ్యూసర్లకి కూడా స్థానికంగా వుండే జూనియర్ ఆర్టిస్టులతో షూటింగులు జరుపుకోవడమే సులభమయిన పనిగా తోచింది. జూనియర్ ఆర్టిస్టంటే జూనియర్ ఆర్టిస్టే. ఆ ఆర్టిస్టు ఎవరైనా వాళ్లవల్ల ఒక సినిమా విజయవంతం అవడంగాని, అవకపోవడంగాని జరగదు కాబట్టి, ప్రయాణఖర్చులు, లాడ్జీఖర్చులు భరించి హైదరాబాదు నించి వాళ్లని తీసుకురావడంకంటే, స్థానిక కళాకారులతో మేనేజ్ అయిపోవడమే సులభంగా తోచింది.

కిరణ్మయికి, అలాంటి జూనియర్ ఆర్టిస్టులకీ ఇది పరిష్కారం లేని సమస్యగా పరిణమించింది.



ఓరోజు కిరణ్మయి మార్కెట్‌కి వెళ్లి సామాన్లు కొనుక్కుని బస్సుకోసం బస్‌స్టాపులో నిలబడింది. ఎండ ఫెళ్ళుమంటోంది. అయినా జనం హడావిడిగా ఎవరిదారిన వారు వెళ్ళిపోతున్నారు. అవసరాలు మనిషిని ఎండా వానల్ని లెక్కచెయ్యనివ్వవు కదానుకుంటూ ముఖానికి పట్టిన చెమటల్ని రుమాలుతో ఒత్తుకుంటుండగా ఆమె





ముందునించి ఓ స్కూటరు రయ్‌మంటూ ముందుకెళ్ళిపోయి, అంతలోనే మళ్ళీ తిరిగి ఆమె దగ్గరకొచ్చి ఆగింది.

"పార్వతీ" అన్నాడా స్కూటర్ మీదనున్న వ్యక్తి.

ఈ వూర్లో తనని ఆ పేరుతో పిలిచేదెవరా? అని నివ్వెరపోయింది.

ఆ వ్యక్తి తన తలమీదనున్న హెల్మెట్‌ని, కళ్ళకి పెట్టుకున్న గాగుల్స్‌ని తీశాకగాని, అతను సుధీర్‌కుమార్ అని గుర్తించలేకపోయింది.

ఒకర్నొకరు చూసుకుని ఆశ్చర్యపోవడాలు అయ్యాక "మనం కలిసి చాన్నాళ్ళయింది. పదా అలా ఆ హోటల్లో కూర్చుని కూల్ డ్రింక్సు తాగుతూ మాట్లాడుకుందాం" అన్నాడు.

కూల్‌డ్రింక్సు తాగుతూ, తాను వైజాగ్ నించి వయా మద్రాసు మీదుగా కొన్ని చేదు అనుభవాల్ని సూట్‌కేసులో పెట్టుకుని హైదరాబాదు ఎలా చేరిందీ వివరంగా చెప్పింది. అంతా విన్నాక సుధీర్ "అయ్యో' అంటూ నిట్టూర్చలేదు. జాలిపడలేదు. నువ్వు చాలా తొందరపడ్డావని మందలించలేదు. కాస్సేపు మౌనంగా వుండిపోయాక,

"అయితే ఆ వరదరాజులుగాడు నిన్ను దగా చేశాడన్నమాట" అన్నాడు. కిరణ్మయి వెంటనే జవాబు చెప్పలేదు. శూన్యంలోకి చూస్తూ కాస్సేపుండిపోయి,

"సుధీర్! నేనో విషయం అడుగుతాను చెప్పు. గేలానికి చేప తగుల్కుంటుంది. అది గేలం విసిరినవాడి తెలివితేటలంటావా? లేక గేలానికున్న ఎరని చూసి దాన్ని అందుకోవాలని ప్రయత్నించి, తన బతుకుని అంతం చేస్కోవడం, ఆ చేప తాలూకు మూర్ఖత్వమంటావా? " అని అడిగింది.

సుధీర్ జవాబు చెప్పలేదు.

కిరణ్మయే తనకితాను జవాబు చెప్పుకుంటున్నట్టుగా చెప్పింది. "డెఫినెట్‌గా అది చేప తాలూకు మూర్ఖత్వమే. గేలం వేసి నన్ను పట్టాడు. నన్ను బోనులో పెట్టి, ఎలుకల్ని పందికొక్కుల్ని తన బోనులోకి లాక్కోబోయాడు. మ్చ్... వదిలెయ్. ఇలా జరగడానికి నా తెలివితక్కువే కారణం తప్ప వాడి తెలివితేటలు కావని నా ఉద్దేశం. సరే కిరణ్మయిగా మారిన ఈ పార్వతి జీవితం యిలా అయింది. మరి భార్గవ అవార్డు అందుకున్న నీ జీవితం ఎలా వుంది? " కిరణ్మయి కుతూహలంగా అడిగింది.

అతనో సిగరెట్టు వెలిగించి రెండు దమ్ములాగి, "అదో పెద్ద కథా అని నీకు నేనేం సినిమా కథ చెప్పన్లే. చెప్దామన్నా అంత స్టోరీ ఏంలేదు" అంటూ తన గురించి క్లుప్తంగానే చెప్పాడు. అతనికి డైరక్షన్ మీద ఎక్కువ మక్కువ వుండడంతో, అతన్లోని రచయితని, నటుణ్ణి పక్కకి నెట్టి డైరక్టర్ శివరాం దగ్గర అసిస్టెంటుగా చేరాడు. ఓ పిక్చర్‌కి అసిస్టెంటుగా పనిచేశాక, అతన్లోని స్పార్క్ చూసి, రెండో పిక్చర్‌కే అతన్ని అసోసియేట్‌గా మార్చేడు.

"మరి నువ్వెప్పుడు డైరక్టర్‌వవుతావు? " నవ్వుతూ అడిగింది కిరణ్మయి.

"ఈ పాటికే రెండు ఆఫర్లొచ్చాయి కానీ, నేనే ఒప్పుకోలేదు"

"ఏం...? పరుగెత్తి పాలు తాగడంకంటే నిలబడి నీళ్ళు తాగుదామనుకున్నావా? "

"అలా అని ఎందుకు అబద్ధం చెప్పాలి. ఈ ఫీల్డుకి అందరూ పాలు తాగాలనే వస్తారు. కానీ, పాలులా కనిపించే నీళ్ళు తాగడం ఇష్టంలేకే వచ్చిన ఆఫర్లన్నీ వదిలేశాను. ఓ ప్రొడ్యూసరు నాకు డైరక్షన్ ఛాన్సు ఇస్తానన్నాడు. కానీ నాలాంటి కొత్తవాడికీ అవకాశమిస్తూ ఎంతో కొంత రిస్కు

బేర్ చేస్తున్నాడు కాబట్టి నాకు ఒక్క రూపాయి కూడా రెమ్యూనరేషన్ ఇవ్వడట. అంటే ఆ పిక్చరు పూర్తయి, విడుదలయి, సక్సెస్సయి, మరో పిక్చరు వచ్చేదాకా నేను



పుడ్డుకి లాట్రీ కొట్టాల్సిందే. ఇంక రెండో ఆఫరు ఇచ్చిన ప్రొడ్యూసరుకి, పది లక్షలు పెట్టగలిగే పార్టనర్స్‌నీ నేనే తీసుకురావాలట. ఫైనాన్సర్నీ నేనే కుదర్చాలట. డిస్ట్రిబ్యూటర్స్‌నీ నేనే చూసి పెట్టాలట. యిన్ని గొడవలు, యిన్ని షరతులుకీ లొంగి నేనేం సినిమా తీయగలను? తీసినా, అవేం సరిగా ఆడుతాయనే నమ్మకం వుండదు. కూర్చున్న కుర్చీకింద బాంబు పెట్టుకునే బదులు, హాయిగా ఈ అసోసియేట్ డైరక్టరు పనే బాగుంది. మనసుకి తృప్తి కలుగుతోందా? లేదా? అన్న పాయింటు వదిలేస్తే, కడుపుకి మాత్రం లోటులేకుండా రోజులు గడిచిపోతున్నాయి"

మరో పది నిమిషాలపాటు మాట్లాడాక, బిల్లు తనే చెల్లించి, కిరణ్మయికి తనే స్కూటరుమీద లిఫ్టు ఇచ్చి ఆమె ఇంటి దగ్గర డ్రాప్ చేశాడు. "ఇంట్లోకి రా" అంది కిరణ్మయి. అది ఇల్లు కాదు, చిన్నగది.

"నీ ఆల్బమ్ ఏదైనా వుందా? " అని అడిగాడు.

ఆమె తన ఆల్బమ్ చూపించింది. అతను ఫోటోలు చూసి పెదవి విరిచాడు. "ఫోటోగ్రాఫర్లు వాళ్ల చాతుర్యంతో లేని అందాల్ని కూడా తీసుకొస్తుంటే, వీడెవడో నీ అందాన్ని సగానికిసగం తగ్గించేశాడు. రేపు ఉదయం మా స్టిల్ ఫోటోగ్రాఫర్ని తీసుకొచ్చి కొన్ని ఫోటోలు తీయిస్తాను. పది గంటలకల్లా రెడీగా వుండు" అన్చెప్పి వెళ్ళిపోయాడు. చెప్పినట్టుగానే మర్నాడు ఉదయం ఫోటోగ్రాఫర్‌ని తీసుకుని వచ్చి పది పన్నెండు ఫోటోలు తీయించాడు. భంగిమలన్నీ అతనే చెప్పాడు. ఆఖర్న - "ఈ ఫోటోలకి ఎంతవుతుంది? " అని అడుగుతూ ఎడ్వాన్సు ఇవ్వడం కోసం పర్సు తెరిచింది. "ఏం? నీ దగ్గర డబ్బులు మరీ ఎక్కువగా వున్నాయా? ఏం ఇవ్వక్కర్లేదు. ఈ ఫిలిం అంతా మా ప్రొడక్షన్ ఎక్కవుంట్లో పోతుం





దిలే" అంటూ ఫొటోగ్రాఫర్ని తీసుకుని స్కూటర్ ఎక్కుతూ, "ఎల్లుండి ఫొటోలు తెస్తాను" అన్నాడు. సుధీర్ వెళ్లిపోయాక కిరణ్మయి మనసు మళ్ళీ అటూ ఇటూ ఊగిసలాడింది. సుధీర్, తనూ కలిసి చాలా నాటికలు, నాటకాలు ఆడ్డం తప్ప మరో పరిచయం లేదు. మళ్లీ ఇక్కడ సినిమారంగంలోకొచ్చి ఎవరి అదృష్టాన్ని వాళ్లు వెతుక్కుంటూ నడుస్తూ, ఎక్కడో ఓ జంక్షన్‌లో కలుసుకున్నారు. ఈ కలయిక మంచికే దారితీస్తుందో లేక... చెడుకే దారితీస్తుందో? మ్చ్... ఎంత చెడు జరిగినా, వరదరాజులు చేసిన దానికంటే ఎవరూ తనకి ఎక్కువ చెడుచెయ్యలేరు.

మూడోరోజున సుధీర్ సాయంత్రం రెండు ఆల్బమ్స్ పట్టుకొచ్చాడు. రెండింట్లోనూ తన ఫొటోలే వున్నాయి. ఒకటి ఆమెకిచ్చి రెండవది తన దగ్గర వుంచుకుంటానన్నాడు. ఎందుకూ? అని అడిగితే- "మా ప్రొడ్యూసరూ, డైరెక్టరు నా స్టోరీనే నెక్స్ట్ పిక్చరుగా తీద్దామనుకుంటున్నారు. ఒకవేళ అదే జరిగితే, ఆ పిక్చరులో హీరోయిన్ వేషంకంటే సెకెండ్ హీరోయిన్ కేరక్టరు చాలా టిపికల్‌గా వుంటుంది. అప్పుడు నీ హిస్టరీ చెప్పి నీ ఫొటోలు చూపిస్తాను. ఏమో నీ అదృష్టం ఎలా వుందో?" అంటూ నవ్వేడు. కాస్సేపు మాట్లాడి వెళ్ళిపోయాడు. మళ్ళీ మూడు నెలలవరకు అతను కన్పించలేదు. మనిషికి ఆశ అనేదే దుఃఖాన్ని కలిగిస్తుందంటారు. సుధీర్ చెప్పిన మాటల వల్ల, అతను తనమీద చూపిస్తున్న అభిమానానికి రవంత అభిమానం పెరిగిందేమో గాని, కొత్తగా ఆశ అంటూ ఏదీ కలగలేదు కాబట్టి, అతను మూడు నెలలపాటు కనపడనందుకు బాధా కలగలేదు. అయితే ఈ మూడు నెలల్లో ఆమె జీవితంలోకి మరో వ్యక్తి ప్రవేశించాడు.

అతనే గోపీచంద్.



ఆ సందు మొదట్లో టయోటా కారు ఆపి, సఫారీ సూట్ వేసుకుని, వస్తున్న ఓ ముప్పై ఏళ్ల వ్యక్తిని చూసి, అతను వస్తున్నది తన కోసం కాదనుకుంది. కానీ సరాసరి తన దగ్గరికే వచ్చి "నమస్కారం పార్వతిగారూ" అంటూ రెండు చేతుల తోనూ నమస్కరించాడు.

తనని పాత పేరుతో పిలుస్తున్న ఈ ఆగంతకుడెవరో ఆమెకు అర్థం కాలేదు.

"నా పేరు గోపీచంద్" అంటూ జేబులో నించి ఓ విజిటింగ్ కార్డు తీసిచ్చాడు. అందులో అతని డిగ్రీలు చాలా వున్నాయి. చాలా పెద్ద పారిశ్రామికవేత్త అని కూడా వుంది. అతన్ని వీధిలో నిలబెట్టి మాట్లాడ్డం తనకే బాగులేదనిపించి "లోపలకి రండి" అంది.

అతను బాగా పొడుగ్గా వుండడంవల్ల ద్వారం దగ్గర చాలా కిందకి తలవంచి గది లోకి ప్రవేశించాడు. అతను చూస్తే చాలా విద్యావంతుడు. కోటీశ్వరుళ్ళా వున్నాడు. కానీ అతన్ని కూర్చోబెట్టడానికి ఇంట్లో కుర్చీ అయినా లేకపోయిందే అని ఆమె మన సులో బాధపడుతుండగా ఆమె మనసులోని మాటని కనిపెట్టినట్టుగా "ఫర్వాలేదు, ఇక్కడ కూర్చుంటాను" అంటూ నులకమం చంమీద కూర్చుని, ఆమెకు ఎక్కువ ఆందో ళన కలిగించకుండా తనే క్లుప్తంగా మాట్లా డేడు.

"మీరు నాకు తెలుసు. కానీ నేను మీకు తెలీదు. నేను మిమ్మల్ని వెతుక్కుంటూ రావడం మీకు ఆశ్చర్యంగా వుండొచ్చు నేనెందుకొచ్చేనో చెప్పడానికి నాకూ కాస్త బిడియంగానే వుంది. మీ ముందు నా మన సులోని మాటలన్నీ చెప్పలేనన్న నమ్మకం తోనే ఈ ఉత్తరంలో అన్నీ రాసేను" అంటూ జేబులోనించి ఓ కవరు తీసి అందించాడు. ఆమె యాంత్రికంగానే ఆ కవ రుని అందుకుంది. అతను లేచి నిలబడి "అంతా చదివాక మీ నిర్ణయాన్ని తీరిగ్గానే చెప్పొచ్చు నా ఫోన్ నెంబరు ఆ విజిటింగ్ కార్డులో వుంది. నేను బిజినెస్‌రీత్యా హైద రాబాద్ వచ్చినప్పుడు, ఏయే హోటల్స్‌లో మకాం చేస్తానో ఈ ఉత్తరంలో రాశాను. నేనీవూరు నెలకి నాలుగైదుసార్లయినా వస్తుంటాను. మీరు నన్ను ఫోన్ ద్వారా కాంటాక్ట్ చేసి, మీ అభిప్రాయాన్ని తెలియ జేస్తే సంతోషిస్తాను. నమస్కారం" అంటూ ఆమె జవాబుకోసం ఎదురుచూడకుండా బయటికి వెళ్లిపోయాడు. ఆమె అయోమ యంలో పడ్డంవల్ల, అతన్ని గుమ్మం బయ టవరకూ సాగనంపడం మర్యాదనే విష యాన్ని కూడా మర్చిపోయింది. అంత గొప్ప మనిషికి నాతో పనేవిటి? కవరు తెరిచి చూసింది. మూడు పేజీల ఉత్తరం అది. మూడు పేజీలు రాయాల్సినంతటి పని తనతో వుందా? మంచంమీద కూర్చుని ఆ ఉత్తరాన్ని ఆసక్తిగా చదవనారంభిం చింది.

"పార్వతిగారికి కళాభివందనాలు. నా మనసులోని అభిప్రాయాలకి కాస్తో కూస్తో అక్షరరూపం ఇవ్వడం నాకొచ్చేమోగాని, మీ ఎదుటపడి, నా మనోభావాలు మీకు చెప్పగలిగే సాహసం లేక ఈ ఉత్తరం రాశాను. నేను కళాకారుణ్ణి కాకపోయినా, కళాభిమానిని అని చెప్పుకోవడం సెల్ఫ్ డబ్బా కొట్టుకోవడం కాదనే అనుకుంటాను. నేను నెల్లూరులో జరిగిన నాటక పోటీలకి రెండు సంవత్సరాలపాటు వచ్చి మీ నటనా సామర్థ్యాన్ని చూడ్డం తటస్థించింది. నెల్లూ రులో మా పెదనాన్నగారు వుండడంవల్ల మీరు పొందిన కిరణ్మయి అవార్డు కిరీటాల్ని మా పెదనాన్నగారే తన డబ్బుతో ఆ పరి షత్తువారికి సమర్పించడంవల్ల, ఆ యోగ్య తతో నేను మీ నాటకాలకి రావడం, మీ అందాన్ని, దాన్నిమించిన మీ అత్యద్భుత నటనా కౌశలాన్ని చూసే అదృష్టం కలి గింది. చూశాక మీరు నా మనిషిగా మారితే బావుణ్ణనే స్వార్థం కూడా కలిగింది. దాన్ని




ప్రేమనే అంటారో, ఓ కళాకారిణిపట్ల ఏర్ప డిన సద్భావన, ఆరాధన అనే అంటారో నాకు తెలీదు. నాకెందుకో చదువు, డబ్బున్న అమ్మాయిని పెళ్లి చేసుకోవడం ఇష్టంలేదు. ఎందుకంటే ఆ రెండూ నా దగ్గర పుష్క లంగా వున్నాయి. నాకు లేని ఒక కళ, అదీ నేను ఆరాధించే కళ, నేను సాధించలేనని తెల్సిన కళ మీలో కనిపించింది. అందుకే మిమ్మల్ని నా అర్ధాంగిగా చేసుకోవాలనుకుం టున్నాను"

కిరణ్మయి ఠక్కుమని చదవడం ఆపుచే సింది. ఆ గోపీచందే తన దృష్టిలో ఓ ప్రశ్నగా మిగిలిపోతే... ఇప్పుడు పెళ్లి చేసు కోవడం విషయం రాస్తున్నాడు. అనుమా నాల్ని ఆపుకుని ఆసక్తిగా మళ్ళీ చదవనారం భించింది.

"మిమ్మల్ని పెళ్లి చేసుకుంటామని చాలా మంది ఈపాటికే వచ్చివుండొచ్చు వారు ఎలాంటివారని నేను అడగను. వాళ్లని మీరెందుకు తిరస్కరించారని కూడా అడ గను. నన్ను దయచేసి వాళ్ల జాబితాలో చేర్చవద్దని మాత్రమే ప్రార్థిస్తున్నాను. ఒక వేళ మీరు నన్ను పెళ్ళి చేసుకోవడానికి అంగీకరిస్తే ఆ అభిప్రాయానికి వచ్చేముందు మీరు నా గురించి కూడా కొన్ని విషయాలు తెల్సుకుని మరీ మీరో నిర్ణయం తీసుకోవడం మంచిది.

పెళ్ళయింతర్వాత మీరు సినిమాల్లోగాని, నాటకాల్లో వేయడానిగ్గాని ఇష్టపడను. కళా రాధకుణ్ణని చెప్పిన నేను ఇంత సంకుచి తంగా ఆలోచిస్తున్నానేవిటాని మీరు ఆశ్చర్య పోవచ్చు. మనం ఎవర్నీ ప్రేమించకముందు మన మనసు ఆకాశమంత విశాలంగా వుంటుందట. కానీ మనస్ఫూర్తిగా ఎవర్న యినా ప్రేమించాక, ఆ మనసు పిడికెడంత సైజుకు ముడుచుకుపోతుందట. ప్రేమ విషయంలో నేనూ సగటు మనిషినే. నా ప్రాణం నా బొందిలోనే వుండాలి. నా భార్య నాతోనే తప్ప మరొకరితో ప్రేమ కేవలం నటించినా నాకిష్టం వుండదు.

నా పెళ్లి విషయంలో నేను సర్వస్వతం త్రుణ్ణి. నాకు సర్వస్వం అయిన మా పెద నాన్నగారు ఈమధ్య పోవడంవల్ల నా నిర్ణ యాన్ని ప్రశ్నించే మనిషంటూ ఎవరూ లేరు. మీ అంగీకారం వినగానే పెళ్లి జరిగి పోవడం ఒక్కటే తరువాయి.

మిమ్మల్ని పెళ్లి చేసుకోవాలనే నిర్ణయాన్ని కొంతమంది మిత్రులకు చెప్పగానే వాళ్ల నన్ను నిరుత్సాహపరుస్తూ మాట్లాడేరు. నేను పెళ్లి చేసుకోబోయే అమ్మాయి అంద మైన ఆడపిల్లే కాదు. శీలం చెడని కన్నెపిల్ల కూడా అయుండాలికదా! ఎన్నో సంవత్సరా లపాటు నాటకాలు వేసి తర్వాత సినిమాల్లో చిన్న చిన్న వేషాలు వేసేవాళ్ల డబ్బుకోసం నైతిక విలువల్ని వదిలేస్తారని వాళ్ల నమ్మకం. కానీ మీ విషయంలో నేను చేసిన ఎంక్వయిరీ ప్రకారం మీమీద ఎటువంటి బ్యాడ్ రిపోర్టు లేదు. మీ గురించి ఎంక్వ యిరీ చేసినందుకు మీకు కోపం రావచ్చేమో. కానీ కేవలం ఓ రూపాయి ఇచ్చి కొనుక్కునే వస్తువు గురించి కూడా మనం ఆలోచించి ఆలోచించి మరీ కొంటాంగదా! అలాంటిది నాక్కాబోయే భార్య విషయంలో ఈమాత్రం ఆలోచించడం తప్పుకాదనుకుంటాను.

సరే... మీ ప్రవర్తన గురించి అలా ఆలో చించిన నా గురించి ఆలోచించే హక్కు మీకూ వుంటుంది? నాకు ఎటువంటి ఆడ వాళ్లతో ఎటువంటి సంబంధాలూ లేవు. నాకు స్త్రీ సంపర్కమే లేదని అబద్ధాలాడను. నేను మగవాణ్ణి, పెళ్లికానివాణ్ణి అనేవి నేను కొంతమంది అమ్మాయిలతో గడి పేందుకుండే అర్హతలని నన్ను నేను సమ ర్థించుకోనుగాని, అప్పుడప్పుడు హోటల్స్‌లో నేనూ కొంతమంది అమ్మాయిల్తో గడిపేను. అయితే వాళ్లంతా కిరాయికొచ్చే పరాయివాళ్లే కాబట్టి వాళ్లు నా మంచంమీదకే తప్ప నా మనసులోకి రాలేరు. నా జీవితంలోకి ప్రవే



శించలేరు. హోటల్లోకి దిగింతర్వాత రూమ్ రెంటు ఎలా కడతానో, వాళ్లనించి ఆనందం పొందేక వాళ్ల రెంటు కూడా అలాగే ఇచ్చేస్తాను. మరోమాట మీరంటూ నా జీవితంలోకి వస్తే, ఆ తర్వాత మరో స్త్రీని టచ్ చెయ్యనని మాట ఇస్తున్నాను. నా గురించి ఇంత ఫ్రాంక్‌గా, ఓపెన్‌గా చెప్పిన నేను, ఈ మాటని కూడా సిన్సియర్‌గానే చెప్తున్నాను. నా మాట మీరు నమ్మాలి. మీ అమ్మగారు, మీ తమ్ముడి విషయం కూడా, మన పెళ్ల యింతర్వాత నేనే చూసుకుంటాను. నేను సాధారణంగా ఈ వూరొచ్చినప్పుడు నేను దిగే హోటల్ నెంబర్లు ఇస్తున్నాను. వాటికి ఫోన్‌చేసి నన్ను కలియొచ్చు. ఈలోగా మీకేదైనా డబ్బు అవసరం వున్నా నిర్మొహమాటంగా అడగొచ్చు. ఈ డబ్బుకి పెళ్ళి విషయానికి ఎటువంటి సంబంధం లేదు"

కిరణ్మయి కాగితాలు మడిచింది? ఎవరీ గోపీచంద్? తన జీవితానికి అనూహ్యమైన మార్పు ఇవ్వడానికి అవతరించిన పుణ్యపురుషుడా? రాసిన ప్రతి వాక్యంలోనూ నిజాయితీ ద్యోతకమవుతోంది. తన శరీరాన్ని కోరుకున్నవాళ్లు అనేకమంది తారసపడ్డారు. అందుకు ప్రతిఫలంగా డబ్బు ఇస్తానన్నారు. సినిమా వేషాలు ఇస్తామన్నారు. కానీ... ఓ కొత్త జీవితాన్ని ఓ గొప్ప జీవితాన్ని ఇస్తానంటూ ముందుకొచ్చిన మొదటి మనిషి గోపీచందే. కాకపోతే, పెళ్లయిన మరుక్షణం నించి తనలోని నటికి సమాధి కట్టెయ్యమంటున్నాడు. ఇదొక్కటే కాస్త ఆలోచించాల్సిన పాయింటు. ఏం చెయ్యాలి? తనలోని నటిని వదిలేసి, వ్యక్తిగా జీవితంలో సుఖపడాలా లేక...

సాగుతున్న ఆలోచనల్ని తెంపుతూ, బయట మోటర్‌సైకిల్ ఆగిన శబ్దం వినిపించింది. సుధీర్ లోపలకొస్తున్నాడు. ఉత్తరాన్ని గబగబా ట్రంకు పెట్టెలో దాచేసింది. సుధీర్‌తో ఈ విషయం ప్రస్తావించి, ఓ నిర్ణయం తీసుకుంటే?

అందుకు అవకాశం లేకపోయింది. హడావిడిగా లోపలకి వస్తూ "నువ్వు వెంటనే బయలుదేరు" అన్నాడు.

"ఎక్కడికి? "

"అప్పుడు చెప్పేనుగదా- మా ప్రొడ్యూసరు నా స్టోరీతో సినిమా తీస్తాడని.

యిప్పుడు తీస్తున్నాడు. సెకెండ్ హీరోయిన్ వేషంకోసం చాలామందిని చూస్తున్నారు. నేను నీ ఆల్బమ్‌ని చూపించి, నీ అనుభవం గురించి చెప్పేను. అమ్మాయిని వెంటనే తీసుకురా అన్నారు" అంటూ, ఆమెను క్షణంకూడా ఆలోచించనివ్వకుండా గబగబా డ్రెస్ ఛేంజ్ చేయించి స్కూటర్ మీద తీసుకుపోయేడు!



కిరణ్మయిని ప్రొడ్యూసరు, డైరక్టరూ చూడ్డం, ఆమెచేత కొన్ని నాటకాల్లోని బిట్స్ ఏక్ట్ చేయించి దాన్ని వీడియో తీయడం జరిగిపోయింది! ఆ సాయంత్రం హీరో మనోహర్ యింటికి ఆల్బమ్, వీడియో కేసెట్ పంపడం, ఆయన చూసి ఓకే చెప్పడం అన్నీ జరిగిపోయేయి. కిరణ్మయి సెకెండ్ హీరోయిన్ వేషానికి సెలక్టయిపోయింది. కిరణ్మయి మనసుకి రెక్కలొచ్చి ఆకాశంలో ఎగిరింది.

"ఇంక నీ భవిష్యత్తుకేం ఢోకాలేదు! మా ప్రొడక్షన్‌కి చాలా పేరుంది. పైగా నువ్వు ఏక్ట్‌చేస్తున్నది లీడింగ్ హీరో మనోహర్ పక్కన. కథలో చాలా దమ్ముంది! పిక్చర్





డెఫినెట్‌గా హిట్టవుతుంది. నటిగా నీకు మంచి పేరొస్తుంది. అంతేకాదు, మా ప్రొడ్యూసర్‌గారి బావగారు కూడా ఓ సినిమా తీయడానికి ప్రయత్నిస్తున్నాడు. నాకే డైరక్షన్ ఛేన్స్ యిస్తానంటున్నాడు కాబట్టి, సినిమా తారగా నీకు లైన్‌క్లియర్ అయిపోయినట్టే! మీ అమ్మగార్ని యింకా వైజాగ్‌లో ఒంటరిగా వుంచడం భావ్యం కాదు, వెంటనే పిలిపించు" అన్నాడు సుధీర్ పరమానందం చెందుతూ!

అతను చెప్పింది కరక్టే! తన కింతమంచి అవకాశం వచ్చినప్పుడు గూడా తన తల్లిని, తమ్ముణ్ణి పిలిపించుకోకపోతే ఎలా? సుధీర్ ఆమెకో వెయ్యి రూపాయలిచ్చి "వుంచు" అన్నాడు.

"దేనికి? "

"మావాళ్లింకా నీకు అడ్వాన్సుయివ్వలేదుగా... యిస్తార్లే... డబ్బు ఎగ్గొట్టే మనుషులు కారు!. మేం షూటింగు ఆరంభించే లోగా నీకూ ఏదో ఖర్చులుంటాయిగా! పైగా, మీ అమ్మని కూడా పిలిపిస్తున్నావు. నేనేం వూరికే యిస్తున్నానని సంశయించక్కర్లేదు. ఇది అప్పే అనుకో... తర్వాత తీర్చేయ్" అంటూ అతనే, ఆ డబ్బుని ఆమె పర్సులో పెట్టేడు!

ఇంటికి వెళ్ళిన వెంటనే తల్లికి ఉత్తరం రాసింది.

అయిదో రోజు ఆమె గోదావరి ఎక్స్‌ప్రెస్‌లో దిగింది. కిరణ్మయి వెళ్ళి రిసీవ్ చేస్కుంది. ఎన్నాళ్ల తర్వాతో తల్లిని చూసిన ఆనందంకన్నా, ఎప్పుడూ ఆమె నుదుటన మెరిసే బొట్టు కనబడకపోవడం ఆమెను కలవరపరిచింది.

బొట్టు నిద్దట్లో చెరిగిపోలేదని చెప్పడానికి ఒకేఒక్క రుజువుగాసరోజమ్మ కిరణ్మయిని చూస్తూనే బావురుమంటూ ఏడ్చింది! "మీనాన్న మనల్నందర్నీ శాశ్వతంగా అన్యాయం చేసాడే" అంది!

ఒక్కక్షణం కిరణ్మయి మెదడు మొద్దుబారిపోయింది. అయినా, తమాయించుకుంటూ తల్లిని తీసుకుని ఆటో ఎక్కింది!

తండ్రి అప్పలరాజు చనిపోయి ఆరు నెలలయిందట! కిరణ్మయి వుత్తరాలు రాస్తున్నా, ఏ ఉత్తరంలోనూ తన అడ్రస్ రాయకపోవడంవల్ల ఆమెకీ విషయం చెప్పడానికి వీలుపడలేదట! తమ్ముడు కృష్ణ కూడా ఏదో వూళ్లో రికార్డింగ్ డేన్సు ట్రూప్‌లో చేరడానికి ఇల్లు విడిచి వెళ్ళిపోయేట్ట! కిరణ్మయికి దుఃఖం కట్టలు తెంచుకుని వస్తున్నా, తల్లి ముందు ఏడిస్తే ఆమె మరింత అధైర్య పడుతుందని, చాలా కష్టపడి, తన దుఃఖాన్ని తమాయించుకుంది. తను వున్నప్పుడే తన ఇల్లు అస్తవ్యస్తంగా వుంది. తను లేనప్పుడు తన తల్లి ఈ కష్టాలన్నీ భరిస్తూ ఒంటరిగా ఎలా గడిపిందా? అనే ఆలోచనే ఆమెలో భయాన్ని కలిగించింది.

రెండోరోజు తెల్సింది. తల్లి ఆరోగ్యం కూడా బాగులేదు! దగ్గుతుంటే రక్తం పడుతోంది. రేపు ఎలాగైనా స్పెషలిస్టు దగ్గరకి తీసుకువెళ్ళాలి అనుకుంది! అదేరోజు రాత్రి సుధీర్ రావడం ఎల్లుండే షూటింగు, భారీ ఎత్తున ప్రారంభోత్సవం అంటూ ఓ పెద్ద సైజు ఇన్విటేషన్ కార్డు అందించాడు.

దానిమీద హీరో హీరోయిన్ల ఫొటోలతోపాటుతన ఫొటోనీ వేశారు. ఆమె ఆనందానికి అంతులేకపోయింది. క్షణం క్రితంవరకు తన ఇంటి పరిస్థితి, తల్లి అనారోగ్యం గురించి ఆలోచిస్తూ ఆవేదనతో తల్లడిల్లిన తన మనసుకి ఓ వూరట, ఉత్సాహం, ఉత్తేజం కలిగిస్తూ, ఈ ఆహ్వాన పత్రం... ఏమిటీ జీవితం?

"నువ్వు వూహల్లో తేలిపోతే కాదు, కాస్ట్యూమర్ని తీసుకొచ్చేను, నీ కొలతలివ్వు" అన్నాడు సుధీర్.

అతని వెంట వచ్చిన కాస్ట్యూమరు కిరణ్మయి కొలతలు కొలిచాడు. "నాకు చాలా పనులున్నాయి. ఎల్లుండి ఉదయం ఏడుగం



టలకల్లా నీ దగ్గరకి కారు వస్తుంది. రెడీగా వుండు" అంటూ సుధీర్ హడావిడిగా చెప్పేసి, వెళ్లిపోయాడు.

కిరణ్మయి, యిన్నాళ్ళూ తను పడిన బాధల విషయం చెప్పకుండా, కేవలం ఇప్పుడొచ్చిన సెకెండ్ హీరోయిన్ వేషం గురించి మాత్రం చెప్పి ఇన్విటేషన్ కార్డుమీద వేసిన తన ఫొటోని తల్లికి చూపించింది. ఆమె ఒంట్లో కొండంత రోగంవున్నా, ముఖంమీద ఆకాశమంత ఆనందం మెరిసింది. ఎండిపోయిన ఆమె పెదవులమీద చిరునవ్వు వెలిగింది.

"నాకు తెలుసే... నీది చాలా మంచి మనసు! దేవుడు భక్తులకి వరం యిచ్చే ముందు కొన్ని కష్టాలు కలిగిస్తాడట. అలాగే ముందు నీకు కష్టాలు కలిగించాడు. శనీశ్వరుణ్ణి వరదరాజులు రూపంలో పంపించి నిన్ను పరీక్షించాడు. నువ్వు అన్ని పరిక్షల్లోనూ నెగ్గుకొచ్చేవు. ఇప్పుడు నీకు పూలబాట వేశాడాదేవుడు" అంటూ సరోజమ్మ కూతురు తలని ప్రేమగా నిమిరి, ఆనందబాష్పాలు రాల్చింది.



"దిగండమ్మా"

ఆటోడ్రైవరు గట్టిగా అరిచిన అరుపుకి, గతస్మృతులు నెమరువేసుకుంటున్న కిరణ్మయి వులిక్కిపడి గోడ్డువైపు చూసింది. ఆటోరిక్షా తను వుంటున్న ఏరియా దగ్గరకొచ్చేసింది. డ్రైవరుకి డబ్బులిచ్చేసి, సందులోకి నడిచింది.

ఇంటికి తిరిగిరావడానికి ఎంత టైముపడుతుందో తెలియదని చెప్పి, కారు ఎక్కిన కూతురు, యింతలోనే తిరిగొచ్చెయ్యడం, సరోజమ్మకి ఆశ్చర్యం కలిగించి, కారణం అడిగింది.

కానీ, కిరణ్మయి జవాబు చెప్పేస్థితిలో లేదు! ఏమీ మాట్లాడకుండా, దుప్పటైనా పరుచుకోకుండా, నేలమీదే పడుకుండిపోయింది.

తల్లి మళ్ళీ ప్రశ్నించింది. కానీ, మొదటిప్రశ్నకి జవాబు చెప్తే అది వెయ్యి ప్రశ్నలకి దారితీస్తుందని తెలిసే కిరణ్మయి జవాబు చెప్పలేదు. తనివితీరా ఏడుద్దామని మనసులో వున్నా తన ఏడుపు తల్లిని మరింత కలవరపరుస్తుందని తమాయించుకుంది. మనసు రోదిస్తున్నా ఆమె కళ్ళు మాత్రం పొడిగానేవున్నాయి.

సాయంత్రం ఆరు తర్వాత సుధీర్ వచ్చేడు. జరిగిందానికి సిన్సియర్‌గా బాధపడ్డాడు. తను ముహూర్తం షాట్ జరిగాక, లొకేషన్స్ చూడ్డానికి వెళ్లేనని, సాయంత్రం తిరిగొచ్చాక, ఈ విషయం తెల్సిందని... ఒకవేళ తను షూటింగ్ స్పాట్‌లో వున్నా చెయ్యగలిగిందేమీ లేదని నిస్సహాయతని వ్యక్తంచేశాడు.

కిరణ్మయి మౌనంగా వింటోంది తప్ప ఏమీ మాట్లాడలేదు. కొన్ని క్షణాలపాటు ఆమె మౌనాన్ని గమనించి కాస్త ధైర్యపరుస్తూ మాట్లాడేడు.

"ఇప్పుడు సినిమా ఇండస్ట్రీ అంతా పెద్ద హీరోల చేతుల్లో వుంది. హీరోయిన్ దగ్గర్నుంచి బోయ్స్‌వరకు వాళ్ళు చెప్పినట్టే ప్రొడ్యూసర్ నడుచుకోవాలి. అయినా, యిది నీకో అనుభవమేగాని పరాజయం కాదు! ఇవాళ పెద్దపెద్ద ఆర్టిస్టులనిపించుకున్న వాళ్ళంతా మొదట్లో యిలాంటి అవమానాలు పొందినవాళ్ళే!. ఇవాళ్టిలాగే రేపు జరగదు. రేపటిమీద నమ్మకంతో యివాళ్టి పరాజయాన్ని మర్చిపోవాలి" అంటూ సుధీర్ ఆమె శ్రేయోభిలాషిగా, రచయితగా ధైర్యం చెప్పి వెళ్ళిపోయాడు!

కిరణ్మయి మౌనంగా వుంటూనే అతను చెప్పిన మాటల్ని విన్నది. అతను వెళ్ళాక గూడా ఆమెలో ఎటువంటి మార్పులేకపోయినా, సుధీర్ చెప్పిందానివల్ల సరోజమ్మకి జరిగిన విషయం తెల్సిపోయింది! ఆవిడకి దుఃఖం ముంచుకొచ్చి "ఆ వరదరా





జులుగాడు అలా చేశాడనుకుంటే, యిప్పుడే విటే, యిలా చుక్క ఎదురయింది" అంటూ ఏడుస్తూ కూతురిమీద సానుభూతి ప్రదర్శిస్తూ మాట్లాడింది. ఆ సానుభూతిఓడిపోయి ఏడుస్తున్న కిరణ్మయి మనసుకి వూరట కలిగించకపోగా, మరింత బాధ పెట్టింది. కొన్ని సందర్భాల్లో మనం పొందిన పరాజయాలు, పరాభవాలకంటే, యితరులు చూపించే సానుభూతే బాధ కలిగిస్తుంది.

ఆ గది వెనక చిన్న పెరడువుంటే, నులకమంచాన్ని తీసుకెళ్లి అక్కడవేసుకుని, దానిమీద పడుకుని, ఆకాశంవంక చూస్తూ, ఆలోచన కొనసాగించింది.

అప్పటికి చీకటిపడి చాలా సేపయింది. తన మనసులాగే ఆకాశం కూడా నక్షత్రాలు లేకుండా బోడిగా, నల్లగా వుంది! తన మనసులో మెరిసే ఆశల్ని కాలం అనే అగ్ని కాల్చి, మసిచేసింది. కానీ, ఆకాశంలో వుండే నక్షత్రాలన్నీ ఏమైపోయేయి? ఎవరైనా కోసుకెళ్ళిపోయేరా? లేక, దోచుకెళ్ళిపోయారా? చేతికి అందింది, నోటికి అందదానిక్కూడా 'ప్రాప్తం' అంటూ ఒకటుండాలని చాలామంది చెప్తే నమ్మేది కాదు తను. కానీ, యిప్పుడు తన విషయంలో ఏం జరిగింది? గతమంతా, ఆమె మనసులో రంగుల రాట్నంలా తిరిగి తిరిగి ఉదయం జరిగిన సంఘటన దగ్గర ఆగేక, మళ్లీ ఆమెకు పాతప్రశ్న గుర్తుకొచ్చింది.

"ఏమిటీ జీవితం?"

ఈసారి ఆ ప్రశ్నని ప్రశ్నగానే వదిలేయదల్చుకోలేదు. ఏదో సమాధానం కావాలి! అది కూడా ఎవరో యివ్వకూడదు. తనే... తనే... సమాధానం చెప్పుకోవాలి! గంట, రెండుగంటలు, యింకాయింకా ఆలోచించాక ఆమె ఒక నిర్ణయాని కొచ్చింది. ఆ నిర్ణయంలోనే ఆమె సమాధానం కూడా వుంది! తను ఎడారిలో నడుస్తోంది. కీర్తి దాహంతో వున్న తను ఎండమావుల్ని చూసి నీటిమడుగులుగా భావించి పరుగులు తీసింది. తీరా వెళ్లేసరికి ఆ మడుగుల్లో నీళ్ళు లేవని తెలిసాక, తన దాహం మరింత పెరిగిందే తప్ప తగ్గలేదు. ఇకమీదట తను పరుగులు తీసి అలిసిపోకూడదు, మోసపోకూడదు.

గోపీచంద్ ఆస్తిరీత్యా, మనసురీత్యా చాలా గొప్పవాడు! తనని భార్యస్థానంలోకి ఆహ్వానిస్తున్నాడు. దాన్ని అంగీకరిస్తే, తను అదృష్టవంతురాలవుతుంది. ఆస్తిపరురాలవుతుంది! కాకపోతే, కళారంగానికి దూరం అవాలంటున్నాడు!

దూరం అవకుండా, ఆ రంగాన్నే పట్టుకు వేళ్లాడుతూ, యిన్నాళ్లూ తను సాధించిందేవిటి?

నాటకరంగంలో వున్నప్పుడు తను తన కుటుంబసభ్యులందరితో కలిసి కష్టాలనుభవించింది. సినిమా రంగంలో కొచ్చేక, కొన్నాళ్ళు ఒంటరిగా, యిప్పుడు తల్లితో కలిసి, కష్టాలనుభవిస్తోంది.

ఆ రంగంనించి ఈ రంగంలోకి రావడం అంటే... ఓ వూర్నించి మరో వూరు మారడం, కన్నతండ్రి చనిపోయినప్పుడు కూడా ఆఖరి చూపులకి నోచుకోకపోవడం, తల్లిని ఒంటరిగా వుంచి బాధపెట్టడం... వద్దు... ఈ దారి వదిలెయ్యాలి! గోపీచంద్‌తో కలిసి, కొత్త దారిలో నడవాలి.

గోపీచంద్ భార్యగా...

ఓ ఇల్లాలిగా,

ఓ గౌరవనీయురాలిగా...

ఇలా బ్రతకడంవల్ల, నాలోని కళాకారిణి చస్తేనేం? నన్ను ఏక్షణంలోనూ సుఖపడనివ్వని, 'కళ' చస్తేనేం?

నేను సుఖపడుతూ అమ్మని సుఖపెట్టాలి! ఈ మాటనే, యీ నిర్ణయాన్నే పదేపదే అనుకుంటూ, భోజనమైనా చేయకుండా అక్కడే, ఆ నులకమంచంలో నిద్రపోయింది.

★ ★ ★

మర్నాడు ఉదయమే లేచి, గోపీచంద్

ఇచ్చిన విజిటింగుకార్డు, లెటరు తీసి ఓ కాగితం మీద, అతను హైదరాబాద్‌లో బస చేసే హోటల్ నెంబర్లన్నీ నోట్‌చేసుకుంది! ఒకవేళ ఆయన వైజాగ్‌లో గనక వుంటే, ఆ నెంబరుకైనా, యస్.టి.డి. చేసి తన నిర్ణయం తెలియజేయాలని ఆ నెంబర్‌ని గూడా నోట్ చేస్కుని, హేండ్‌బ్యాగ్‌లో పెట్టుకుంటుండగా,

"నమస్తే మేడమ్" అనే మాట విని కిరణ్మయి గుమ్మం వైపు చూసింది. ఎవరో చక్కటి యూనీఫాంలో వున్న కారుడ్రైవర్!

"ఎవరండీ? "

"నేను హీరో అగ్నివేష్‌గారి కారుడ్రైవర్ని మేడమ్! వారు మిమ్మల్ని అర్జంటుగా తీసుకురమ్మన్నారు"

కిరణ్మయికి అతను చెప్పేదేవిటో అర్థంకాలేదు! అర్థమైనా నమ్మబుద్ధి కాలేదు! అగ్నివేష్ అంటే... నెంబర్ వన్ క్రేజీ హీరో!

తను?

ఓ ఆర్టిస్టు... జూనియర్ ఆర్టిస్టు... తనని అతనెందుకు పిలుస్తాడు? "చూడండి... ఆయన ఎవర్ని తీసుకురమ్మంటే, మీరు ఎవరి యింటికి వచ్చేరో" ఆశ్చర్యంనించి తేరుకోకుండానే అంది.

"లేదమ్మా! మీ పేరు కిరణ్మయి కదా? "

"ఔను"

"మా అయ్యగారు పిలుస్తున్నది మిమ్మల్నే! మా అయ్యగారితోపాటు చాలా మంది మీకోసం వెయిట్ చేస్తున్నారు. తొందరగా బయలుదేరండి"

కిరణ్మయి మనసు భయంతో కాస్త వణికింది! అగ్నివేష్ నెంబర్ ఒన్ హీరో అని వినడం, సినిమాల్లో చూడ్డంగాని, కనీసం జూనియర్ ఆర్టిస్టుగ్గానైనా అతని సినిమాల్లో నటించడంగాని జరగలేదు! ఇంతవరకు ఆయన్ని ప్రత్యక్షంగా చూడలేదు! ఆయనలాంటి వున్నత స్థాయివ్యక్తికి, తనబోటిదాని గురించి తెలిసే అవకాశంకూడాలేదు!





అలాంటి వ్యక్తి, కొంతమందితో కలిసి తన కోసం వెయిట్‌చెయ్యడమా?

డ్రైవరు తొందరపెడుతుంటే, ఆలోచనలకి తావివ్వకుండా, గబగబా అతని వెంట నడిచి కారు ఎక్కింది!

★ ★ ★

అగ్నివేష్ అత్యంత ఖరీదైన హీరో! అతని చిత్రాల్ని భారీ చిత్రాలంటారు! అతని చిత్రాలకి వసూలయే కలక్షన్సు కూడా భారీగానే వుంటాయి! అతని చిత్రాలు శతదినోత్సవాలు చేసుకున్నప్పుడు, ఆ చిత్ర నిర్మాతలు చేసే ఉత్సవాలు కూడా భారీగానే వుంటాయి! ఆయన చిత్రాలు అప్పుడప్పుడు ఫెయిల్ అయినా, అవి భారీగానే డబ్బు చేసుకుందనే పత్రికల్లో రాస్తారు. ఓ సినిమా పత్రికలో ఎక్కడో చదివింది. "అగ్నివేష్‌గారి చిత్రాలు కూడా అప్పుడప్పుడు ఫెయిలవుతున్నాయి. అయితే అవి ఎలా ఫెయిల్ అవుతున్నాయి? ఆంధ్రా, సీడెడ్ నైజాంలోని జనమంతా చూసేశాక, ఓ పది పన్నెండు వారాలపాటు ఆడేక ఫెయిలవుతున్నాయి. అంటే, ఫెయిలవడంలో కూడా అగ్నివేష్‌గారి ప్రత్యేకత ఆయనకుంది! మిగతా హీరోల చిత్రాలు సూపర్‌హిట్ అయితే ఎంత సొమ్ము వస్తుందో, అగ్నివేష్ గారి చిత్రం ఫెయిలయినా అంతకంటే ఎక్కువే కలక్ట్ చేస్తుంది. అందుచేత అగ్నివేష్‌గారే హీరో నెంబర్ ఒన్, నెంబర్‌టూ, నెంబర్ త్రీ... యిలా ఎన్ని అంకెలు వేసుకెళ్లినా ఆఖరి అంకె కూడా అగ్నివేష్‌గారి పేరును చూపిస్తుంది" ఈ పొగడ్త పొగిడింది ఒక గొప్ప సినిమా ఉపన్యాసకుడు! సదరు ఉపన్యాసకుడికి ఉపన్యాసనయాగరా అని, వుపన్యాస పర్వతం అని, ఉపన్యాసకేసరి అని పలు రకాల బిరుదులున్నాయి! ఆ బిరుదులకి అర్థం ఏవిటీ అని అడిగినందుకు ఒకాయన్ని కొట్టేరని వినికిడి! ఎక్కడ ఆరోగ్యం వుందో అక్కడ లైఫ్‌బోయ్ వుంది అంటూ లోగడ ఓ సబ్బు గురించి ప్రచారం చేసినట్టు, ఎక్కడ శతదినోత్సవం వుందో,

అక్కడ ఉపన్యాసకేసరి వున్నట్టూ అని చాలామంది అంటుంటారు. ఆయన్ని అజాతశత్రువు అనికూడా కొందరంటారు. ఎందుకంటే, సినిమారంగంలో వుండే వివిధ వర్గాల మధ్య, యీయనుంటాడు. అన్ని వర్గాలచేత ఆహ్వానించబడతాడు. అన్ని సభలకీ వెళ్లి, ఆ సభలో వున్న హీరోహీరోయిన్లని పొగుడుతాడు. అతని ఉపన్యాసాలు నాలుగైదు విన్నవారు ఓ మాటన్నారు.

"ఇతను చెప్పే ఉపమానాలు, చేసే అతిశయోక్తులు, విసిరే ఛలోక్తులు, వాడే సమాసాలు వగైరా వగైరాల్లో ఎటువంటి మార్పూ వుండదు. ఎటొచ్చీ ఏ సభలో వున్న హీరోకి తగ్గట్టుగా, ఆ సభలో ఆ పొగడ్తలు పొగుడుతాడు, కేవలం "ఫిలప్ ద బ్లేంక్స్" విధానాన్నే వుపయోగిస్తాడనే ప్రచారం వున్నా, అతను అందరికీ యిష్టుడే! ముఖ్యంగా అగ్నివేష్‌కి అతిసన్నిహితుడు, సలహాదారుడు అనేది మాత్రం అందరికీ తెల్సిందే. ఈ విషయం కాస్తో కూస్తో కిరణ్మయికి కూడా తెలుసు.

కారు అగ్నివేష్ అందమైన బంగళా ముందు, విశాలమైన కాంపౌండ్లో ఆగింది. ఆ ప్రాంతమంతటికీ, ఆ బిల్డింగే నెంబర్ వన్ అనిచెప్పినా ఆశ్చర్యపోనక్కర్లేనంత సుందరంగా, విశాలంగా వుందా బంగళా! కిరణ్మయి కారుడోర్ ఓపెన్ చెయ్యక్కర్లేకుండా డ్రైవర్ కారు దిగి, డోర్ ఓపెన్ చేసి పట్టుకున్నాడు. కిరణ్మయి కారు దిగింది. వరండాలో వున్న నౌఖరు ఆమె రాకకోసమే చూస్తున్నట్టుగా "రండమ్మా రండి" అంటూ హాల్లోకి తీసుకువెళ్లాడు. తనకీ మర్యాదలు ఎందుకు? తనతో వారికి పని ఏమిటి? అని కూడా యిప్పుడు ఆలోచించకుండా, కిరణ్మయి యాంత్రికంగా, మరబొమ్మలా లోపలకి నడిచింది.

హాల్లో అగ్నివేష్‌తో పాటు ఓ పదిమంది దాకా కూర్చున్నారు. అందులో వుపన్యాసకే

సరిగారు కూడా వున్నారు. కొందరు కాలు మీద కాలువేసుక్కూర్చున్నారు. అంటే, వారు అగ్నివేష్‌గారికి బాగా ఆత్మీయులనే అర్థమవుతోంది. ఆత్మీయులూ అంటే వారూ గొప్పవారేనన్నమాట!

"రామ్మా కూర్చో"

ఆ జనంలో ఎవరో అన్నారు. కానీ ఆమె అగ్నివేష్‌ని చూస్తూ వుండిపోవడంవల్ల ఆమెకామాట వినబడలేదు. రెప్పపడలేదు. కనీసం అగ్నివేష్‌కి నమస్కరించాలనే ఆలోచన కూడా కలగలేదు. అందరూ ఆమెనే చూస్తున్నారు. అగ్నివేష్ చిన్నగా నవ్వుతూ-

"కూర్చో కిరణ్మయీ" అన్నాడు.

ఆమె వులిక్కి పడింది. "పాపం యింకా టెన్షన్ తగ్గినట్టు లేదు" అన్నాడు అగ్నివేష్! కిరణ్మయి కూర్చుంది. కూర్చున్నాక ఆమె మౌనంగా అగ్నివేష్‌కి నమస్కరించింది!

"మరేం ఫర్వాలేదమ్మా! నువ్వు ఎలాంటి ఫీలింగ్స్‌కి లోనవుతున్నావో నేనర్థంచేస్కోగలను! నీతో మాట్లాడాలనే, నేనివాళ మోర్నింగ్ షూటింగు కేన్సిల్ చేస్కున్నాను"

అసలే చలితో వణుకుతున్న మనిషిమీద, యింత అయిసుగడ్డ పడేసినట్టుగా రివరివలాడింది కిరణ్మయి!

"తన గురించి ఆయన షూటింగ్ కేన్సిల్ చేసుకున్నాడా? " కిరణ్మయి టెన్షన్ మరింత పెరిగింది.

ఆమెలోని టెన్షన్ని గమనించి, కొందరు "మీ స్వస్థలం ఏమిటి? మీ ఫేమిలీలో అందరూ కళాకారులేనా? " కొన్ని కుశలప్రశ్నలు వేసాక, ఆమె కాస్త స్థిమితపడ్డాక-

"ఏవిటీ? నిన్న మనోహర్‌తో ఏదో గొడవ జరిగిందట? " అని అడిగాడు అగ్నివేష్!

కిరణ్మయి మర్చిపోవాలనుకుంటున్న పీడకలని మళ్లీ కెలుకుతున్నారు. అది అగ్నివేష్ కాకుండా మరొకరు అడిగుంటే, ఆమె మెల్లగా ఆ విషయాన్ని దాటవేసేది! కానీ, అడిగింది అగ్నివేష్! సూపర్ హీరో! ఆమె సంశయిస్తుంటే మిగతావారు ధైర్యపరిచారు.

"ఓ హీరో గురించి మరో హీరో దగ్గర కంప్లయింట్ చెయ్యడం మంచిది కాదని, సంకోచిస్తున్నావేమో! ఇదేం కంప్లయింట్ చెయ్యడం కాదమ్మా! హైకోర్టులో తీర్పు యిచ్చాక సుప్రీమ్ కోర్టుకి అప్పీల్ చెయ్యడం లేదూ? ఇదీ అలాంటిదే... ఫర్వాలేదు చెప్పు" అన్నాడొకాయన.

"మనోహర్‌గాడి బుర్రతిరుగుడు చూసి, మా హీరోగారు కూడా అలాంటివారేనను కుంటున్నావేమో! ఉప్పుకప్పురంబు లొక్కపోలికనుండు జూడజూడ రుచుల జాడవేరు అన్నట్టుగా, ఆ మనోహర్‌గాడూ హీరోయే! ఈయనగారు హీరోయే! కానీ యీయన కర్పూరం అయితే, వాడు ఒక ఉప్పురాయి, వాడు వానపాము అయితే ఈయన నాగుపాము" అన్నాడు మరొకాయన.

"ఛ... మనసూపర్ హీరోగార్ని పట్టుకుని నాగుపాముతో పోలుస్తావేంటయ్యా" అంటూ మరొకాయన చిరాకుపడ్డాడు.

"సారీ బ్రెదరూ నా ఉద్దేశ్యం అది కాదు! మన హీరోగారు నాగుపాము అంటే అర్థం అందరూ పూజించే దేవుడూ అని! పైగా ఈశ్వరుడంతటి వాడు మెడలో వేసుకున్నది కూడా నాగుపామునేగాని, వానపాముని కాదుగదా! ఆ మనోహర్‌గాడు వానపాము గాడిలాంటివాడూ అని చెప్పాలంటే, మన హీరోని నాగుపాములాంటి వాడూ అని చెప్పాలిగా"

ఉపన్యాస కేసరి యింకా తన స్టేట్‌మెంటుని కంటిన్యూ చెయ్యబోతుంటే అగ్నివేష్, అతనికి చేత్తో సౌంజ్ఞ చేసి ఆపుచేశాడు.

"నువ్వు చెప్పమ్మా! మాకూ ఆ విషయం కొంత తెల్సింది! కానీ నీ నోటిద్వారా అసలు విషయాన్ని విందామని" అంటూ అగ్నివేష్ సిగరెట్ అంటించి దమ్ములాగేడు.

కిరణ్మయి నిన్న జరిగిన ఘర్షణంతా వివ




రించింది. అంతకుముందు ఆ మనోహర్, తన వీడియో ఫిలిమ్ చూసి, తనని సెకెండ్ హీరోయిన్‌గా ఎలా ఫిక్స్ చేసిందీ చెప్పింది.

అగ్నివేష్ శ్రద్ధగా విన్నాడు! శ్రద్ధగా సిగరెట్ కాలుస్తూ శ్రద్ధగా ఆలోచించి తమ అనుచరవర్గం వైపు చూస్తూ "ఇప్పుడేం చేద్దాం? " అన్నట్టుగా కనుబొమ్మల్ని ఎగురవేసాడు.

అతని వర్గంవారు ఎవరికి వారే తమ అభిప్రాయాన్ని తెలియజేశారు. "వాడో పెద్ద గురివిందగింజ సార్! గతంలో వాడు పుట్టుకి లాటరీ కొట్టిన సంగతి, దిక్కూదివాణంలేక, చోటామోటా కేరెక్టర్లకి డబ్బింగులు చెప్పడం, స్టంట్ సీనుల్లో ఓ రౌడీగా బతికి నరోజుల్ని వాడు మర్చిపోయి, పేట్రేగిపోతున్నాడు. లేకపోతే వాడికంత నీలుగు ఎక్కణ్ణించి వస్తుందండి? " అన్నాడు ఒకాయన.

ఉపన్యాసకేసరి ఉద్రేకపడుతూ లేచాడు, "పురుషులందు పుణ్యపురుషులు వేరయా అని వేమనగారు చెప్పారు. అలాగే హీరోలందు మన హీరోగారే సెపరేటు. మన హీరోగారూ అట్టడుగునించే వచ్చారు. కాళ్లకి చెప్పులు లేకుండా వీధులంట ఇంటింటికీ వెళ్లి అగరొత్తుల దగ్గర్నించి కొవ్వొత్తులదాకా అమ్మారు. పళ్లపొడరు దగ్గర్నించి వాషింగ్ పౌడరుదాకా అన్నిరకాల సామాన్లూ అమ్ముతూ, ప్రొడక్షన్ అసిస్టెంటుగా జాయినై..." అంటుంటే అగ్నివేష్ అతని వైపు ఓ లుక్ ఇచ్చేసరికి, ఉపన్యాస కేసరి గారి నోటికి తాళంకప్ప పడింది.

"ఫ్లాష్‌బ్యాక్‌లగురించి వివరంగా చెప్పక్కర్లేదు. స్వయంకృషిమీద సాధించానంటే చాలుగదా" అన్నాడు అగ్నివేష్ కాస్త మందలింపుగా.

ఆ హెచ్చరికని దృష్టిలో పెట్టుకుని మరొకాయన చెప్పాడు. "మనోహర్‌గాడి పక్కన ఓ జూనియర్ ఆర్టిస్టుని వేసినందుకు వాడలా పేట్రేగిపోతాడా? ఎంతో భవిష్యత్తున్న ఈ అమ్మాయి కెరియర్‌మీద బురద జల్లుతాడా? "

"ఒకవేళ ఆ మాటంటే ఎవరనాలి? మన హీరోగారు అనాలి. కానీ ఆయన ఎంతమంది కొత్త హీరోయిన్లకి అవకాశం ఇచ్చాడు? ప్రస్తుతం మీకున్న ఇమేజ్ ముందు వాడి ఇమేజ్ ఎంత? మీరు అయిదువందల నోట్ అయితే వాడు కేవలం అయిదుపైసల బిళ్ల"

"మీరు హిమాలయ పర్వతం అయితే వాడో సింహాచలం కొండ"

ఇలా ఓ పావుగంటసేపు అగ్నివేష్‌ని అభినందనలతో అభిషేకం చేశాక, ఆ మాటలన్నీ విని అగ్నివేష్ ప్రసన్నుడయ్యాడు.

కిరణ్మయివైపే చూస్తూ- "చూడమ్మాయ్! సినిమా ఫీల్డు అన్నాక ఇలాంటి చిన్న చిన్న గొడవలు తప్పవు. ఇలాంటివి ఎన్నింటిని ఎదిరించి, ఎదురీదుకుంటూ రాకపోతే, ఇవాళ ఈ నెంబర్‌ఒన్ పొజీషన్‌కొస్తాను చెప్పు. వెనక్కి చూస్తూ ముందుకు పరుగెత్తలేం. అలాగే గతాన్ని గురించి బాధపడుతుంటే భవిష్యత్తులో మనం ఏమీ సాధించలేం! నాకు ప్రాణం ఎంత ముఖ్యమో, పరోపకారం చెయ్యడం కూడా అంత ముఖ్యమని ఎన్నోసార్లు స్టేట్‌మెంట్లు ఇచ్చేను. నువ్వూ చదివేవుంటావ్. నీ అవమానం గురించి విన్నాను. నిన్ను చూశాను. నీ నాటకానుభవం గురించి తెల్సుకున్నాను. నటరాజుమీద ఒట్టువేసి చెప్తున్నాను. నువ్వు టాప్‌స్టార్‌వి అవుతావు. అది కూడా ఏ దేవుడో చెయ్యడు. నేనే చేస్తాను" అన్నాడు.

కిరణ్మయి గుండెల్లో చప్పుడు చెయ్యని, మెత్తటి పిడుగుపడింది. తను హీరోయిన్ అవుతుందా? అదీ టాప్ హీరోయిన్... అదీ, అగ్నివేష్ ద్వారా... ఆ మాటలు నమ్మలేనట్టుగా చూసింది.

ఆమె మనసులోని మాటని గ్రహించి, ఇంకా కన్విన్సింగ్‌గా అన్నాడు. "నాతో మాటంటే మాటే. నాకు ప్రజల్లో ఎంత

ఫాలోయింగ్ వుందో, పొలిటికల్‌గా ఎంత పలుకుబడి వుందో నీకు ఎంత తెలుసో తెలీదుగాని, నా ఫ్రెండ్సు అందరికీ తెలుసు"

కిరణ్మయి ఔనని తలూపింది.

"ఒక అనామకుణ్ణి అందలమెక్కించినవాడిని, నిన్ను హీరోయిన్ని చెయ్యలేనా? నిన్ను టాప్ హీరోయిన్ని చేస్తాను. అదీ నా పక్కన హీరోయిన్‌గా వేయిస్తాను. అంతే కాదు, ఏ మనోహర్‌గాడైతే నిన్ను హీరోయిన్‌గా ఒప్పుకోనన్నాడో వాడి కొమ్ములు నీచేతే విరగ్గొట్టిస్తాను. ఆ మనోహర్‌గాడు హీరోగా వుంటే, నేను హీరోయిన్‌గా నటించను అని నీచేత చెప్పిస్తాను. దటీజ్ మై ఛాలెంజ్"

కిరణ్మయి మనసుకి అతని మాటలు రెక్కలు కట్టి, క్రమంగా భూమ్మీదనించి గాలిలోకి లేపుతోంది.

"ఇప్పుడు నేను నాలుగు పిక్చర్లు చేస్తున్నాను. అవి కూడా ఫినిషింగ్ స్టేజిలో వున్నాయి. అంచేత నువ్వు కొన్నిరోజులపాటు ఆగు! నా కొత్త పిక్చర్లు మరో నాలుగు ఆరంభమవుతాయ్. అందులో రెండు పిక్చర్స్‌లో కనీసం రెండు పిక్చర్స్‌లో నువ్వు హీరోయిన్‌గా నటిస్తావు. నటిస్తున్నావు- అది కూడా నా పక్కన"

అగ్నివేష్ చాలా గంభీరంగా, చక్కటి మాడ్యులేషన్తో చెప్పిన మాటలకి అక్కడున్న వాళ్లంతా చప్పట్లు కొట్టారు.

కిరణ్మయికి ఇదంతా కలో, నిజమో అర్థం కావడంలేదు. ఆమె కళ్లు ఆనందబాష్పాలు రాలుస్తున్న విషయం కూడా ఆమె గమనించేస్థితిలో లేదు.

"కానీ, ఒక్క షరతు కిరణ్మయి..."

అగ్నివేష్ అన్న మాటకి ఆమె వులికిపడి చూసి, "చెప్పండి సార్" అంది.

"నువ్వు నా పక్కన హీరోయిన్‌గా వేషం వేసేవరకు, మరే సినిమాలోనూ యాక్ట్ చెయ్యొద్దు. జూనియర్ ఆర్టిస్టు వేషమయినా, అంతకంటే పెద్ద వేషమైనా, చివరికి హీరోయిన్ వేషమయినాసరే, నువ్వు చెయ్యొద్దు. నువ్వు ఫస్ట్‌టైమ్ నా పక్కన హీరోయిన్‌గా నటిస్తే వచ్చే పబ్లిసిటీ, భవిష్యత్తు, ఫాలోయింగ్, పాప్యులారిటీ మరో పిక్చర్ ద్వారా వేస్తే రాదుకదా? "

కిరణ్మయి సమాధానం కోసం అగ్నివేష్ ఓ రెండుక్షణాలపాటు ఆగేడు.

"ఔను సార్" అంది.

"నువ్వేం ఎక్కువకాలం వెయిట్ చెయ్యక్కర్లేదు. జస్ట్ ఒక్క మూడు నెలలు... దట్సాల్"

కిరణ్మయి యాంత్రికంగానే తల వూపింది. అగ్నివేష్ మేడమీద కెళ్లబోతూ, "కిరణ్మయికేమైనా డబ్బు కావాలంటే ఇచ్చి పంపించండి" అంటూ తన సెక్రట్రీతో చెప్పాడు.

"అబ్బే అక్కర్లేదు సార్" అంటూ కిరణ్మయి వినయంగా నమస్కరించింది.

కిరణ్మయి అగ్నివేష్ పంపించిన కారులోనే తిరిగి ఇంటికి వస్తూ ఆలోచనలో పడింది.

ఇంతవరకూ జరిగింది ఏవిటి? నిజమా? అబద్ధమా?

ఇన్నాళ్లూ తను వేసుకునే "ఏమిటీ జీవితం? " అనే ప్రశ్నకి జవాబు దొరకలేదు.

ఎంతో ఆలస్యమైనా ఇప్పుడు ఇంత అందమైన జవాబు దొరికిందేవిటి?

తనే ఎవరో రాసిన నాటకంలో ఓ డైలాగు చెప్పింది. "ఏ వ్యక్తి జీవితంలోనూ అన్నీ మధురమైన ఘట్టాలే వుండవు. ఏ జీవితమూ పూర్తిగా రసవత్తరంగా సాగదు. ఎగుడు, దిగుడు, కష్టం, సుఖం, వియోగం, సంగమం... ఇత్యాది ఘట్టాల కలయికే జీవితం! అందుకే మానవజీవితం నవరసభరితం"

ఈ డైలాగుని అప్పుడు కేవలం డైలాగ్‌గానే చూసింది. కానీ అందులో జీవిత




సారం ఎంత ఇమిడివుందో ఇప్పుడిప్పుడే స్వానుభవానికొస్తోంది. ఒక హీరో తనని నిన్న తిరస్కరించడం...

అంతకంటే పెద్ద హీరో ఓ అభయంతో సత్కరించడం...

నిన్న అలా జరుగుతుందని మొన్న వూహించలేదు.

ఇవాళ ఇలా జరుగుతుందని నిన్న వూహించలేదు.

రేపు మరెలా జరగబోతోందో...

ఎందుకో ఆ విషయమై ఆలోచించదల్చుకోలేదు. రేపు కలిగే కొండంత సంతోషం కంటే, ఏదో పిసరంత భయం ఆమె ఆలోచనలకు అడ్డుకట్ట వేసింది. ముఖానికి చిరు చెమటలు పడుతున్నట్టయి, పర్సులోనించి రుమాలుని తీసింది. రుమాలుతోపాటు, ఓ కాగితం కూడా బైటకి వచ్చింది.

అది గోపీచంద్ వుండే హోటల్ నెంబర్ కాగితం.

క్షణంలో ఆమె ఆలోచనలు మరోదారికి మళ్ళాయి. నిన్న రాత్రి తను తీసుకున్న నిర్ణయం ఏవిటి? ఇప్పుడు వెలిగిన ఈ కొత్త ఆశాజ్యోతి ఏవిటి? నిన్న తీసుకున్న నిర్ణయంలో ఎక్కడో ఏదో పొరపాటు వుందేమో. గోపిచంద్‌ని చేసుకుంటే తను ఐశ్వర్యవంతురాలవుతుంది. కానీ, తనలోని కళాకారిణికి సజీవసమాధి కట్టెయ్యవలసిందే కదా!

ఓ రచయిత చెప్పిన వాక్యం గుర్తుకొచ్చింది.

"ఓ స్త్రీ, ఓ పురుషుడు సంగమిస్తే ఓ మానవుడు పుడతాడు. కానీ, ఎందరు సహకరిస్తే ఓ కళామూర్తి ఉద్భవిస్తుంది? కావాలని ఎవరూ కళాకారుల్ని కనలేరుగదా! కళ భగవద్దత్తం! అది పూర్వజన్మ సుకృతం. ప్రజాభిమానం పొందడానికి సరైన రాజమార్గం! ఆ దారి ఎప్పటికీ మూయబడదు. అటువంటి మహోత్కృష్ట జన్మ తనది. కష్టాలకి భయపడి నడుస్తున్న తోవని వదిలేయబోయింది. కానీ నిన్నటి పరిస్థితులు వంద చేతుల్తో తనని తన జీవితాన్ని నులమడానికి చూసినప్పుడు తను తీసుకున్న నిర్ణయం... అది. ఈనాడు అదృష్టదేవత వెయ్యి చేతుల్తో పిలుస్తున్నప్పుడు వివేకవంతురాలిగా తీసుకుంటున్న నిర్ణయం... ఇదీ. దేనికదే కరక్టు.

రయ్‌మంటూ వీచిన ఈదురుగాలికి గోపీచంద్ టెలీఫోన్ల కాగితం కారులోనించి ఎగిరిపోయింది.

ఇంటికి రాగానే పడుకున్న తల్లిని లేపి మరీ ఈ శుభవార్త చెప్పింది. సరోజమ్మ ఒంట్లోని జబ్బంతా ఎవరో చేత్తో తీసి పారేసినట్టయి సంతోషంతో ఉక్కిరి బిక్కిరి అయింది.

"నేను చెప్పలేదటే, మంచివాళ్ళకి అంతా మంచే జరుగుతుంది. ఇవాళింత గొప్ప అదృష్టాన్ని కట్టబెట్టడానికే నిన్న ఆ హీరో చేత అలా తిట్టించాడు. అతగాడలా తిట్టబట్టే, అంతకంటే గొప్పవాడికి నీ మీదంత అభిమానం పుట్టుకొచ్చింది. ఏం జరిగినా అంతా మన మంచికే అనుకోవాలి" తల్లి మాటలు వింటుంటే ఓ సినిమాలోని పాట ఆమెకు గుర్తు రావడమే కాదు, అప్రయత్నంగా నోటివెంట పాట రూపంలో వచ్చేసింది.

"అనుకున్నామని జరగవు అన్నీ
అనుకోలేదని ఆగవు కొన్ని
జరిగేదంతా మంచికని
అనుకోవడమే మనిషిపని..."

ఎంత మంచి ఓదార్పు కలిగించే పాటయిదీ అని ఆ పాట రాసిన ఆత్రేయని మనసులోనే మెచ్చుకుంది.

★ ★ ★

అగ్నివేష్ నటించిన పిక్చరు విడుదలయింది. మొదటిరోజు హండ్రెడ్ డేస్ టాక్ వచ్చింది. రెండురోజుల తర్వాత సిల్వర్ జూబ్లీ ఆడుతుందనే టాక్ వచ్చింది. అతనిం



టికి వెళ్లి ఫ్లవర్ బొకే ఇద్దామనుకుంది. కానీ, అతను షూటింగు నిమిత్తం కాశ్మీర్ వెళ్ళాడని తెలిసింది.

అగ్నివేష్ పిలుపు ఎప్పుడొస్తుందాని ఎదురుచూస్తున్న రోజుల్లోనే రెండు జూనియర్ ఆర్టిస్టు వేషాలొచ్చేయి. రెండూ పెద్ద కంపెనీలనించే వచ్చాయి. అవి పెద్ద కంపెనీలయితే తనకేదో అదనంగా పేరు ప్రఖ్యాతులొచ్చేస్తాయని కాదుగాని, జూనియర్ ఆర్టిస్టులకి పేమెంట్లు షూటింగు అయిన వెంటనే ఇచ్చేస్తారు. అయినా వాటిని తిరస్కరించింది. కారణం ఏదో ఒకటి చెప్పాలి కాబట్టి. ఒంట్లో బాగులేదని చెప్పింది. మరో సినిమాలో ఓ మంచివేషం వచ్చింది. ఏడు కాల్ షీట్లు కావాలి. ఏడువేలు పారితోషికం.

రోజుకి వెయ్యి రూపాయలంటే తన బ్రతుక్కి చాలా ఎక్కువే. అయినా అగ్నివేష్ కలిగిస్తానన్న అవకాశం ముందు, ఈ ఏడు వేలు ఎంత పాటివి? అనిపించి దాన్నీ తిరస్కరించింది. అగ్నివేష్ నటించే పిక్చర్లు ఎప్పుడు పూర్తయి ఎప్పుడు కొత్త పిక్చర్లు మొదలవుతాయన్న ఉత్సుకతతో సినిమా మేగజైన్లు కూడా కొని చదవనారంభించింది.

హైదరాబాద్‌లో వున్న ఓ నాటకసంస్థ ఓ నాటకం రవీంద్రభారతిలో వెయ్యాలనే ఉద్దేశంతో కిరణ్మయి దగ్గరకొచ్చారు. ఆ నాటకాన్ని గతంలో చాలా సమాజాలతో చాలా సార్లు ఆమె ప్రదర్శించిందే. ఒక్క రిహార్సల్ వేసి డైరక్టుగా స్టేజి ఎక్కిపోవచ్చు. కానీ ఆమె అంగీకరించలేదు. సాధారణంగా నాటకానికి ఏడువందల యాభైనుంచి వెయ్యి రూపాయల దాకా ఇస్తుంటారు. అందులోనూ చాలాసార్లు ఆడేసిన నాటకం అయితే ఎక్కువ రిహార్సల్సుకి వెళ్లక్కర్లేదు కాబట్టి వెయ్యి రూపాయలు చాలా సునాయాసంగా వచ్చినట్టే.

నిజానికి అగ్నివేష్ పెట్టిన షరతుల్లో నాటకాలు వేయకూడదనే అంశం లేదు.





అయినా తను నాటకం వేసినందుకు అతను కోప్పడితే? ఆ భయంతోనే వాళ్లని కాదని తిరస్కరించింది.

వాళ్లు ఆవిడ కిరాయిని పన్నెండువందలకి పెంచినా ఆవిడ ఇష్టపడలేదు.

ఆ డ్రామా డైరెక్టరు అహం దెబ్బదిన్నవాడిలా ఫీలై- "చూడండి! మీరు కొన్ని సినిమాల్లో నటించారుకదాన్న గ్లామర్‌కోసం మిమ్మల్నీ వేషం వెయ్యమనడం లేదు. సినిమా గ్లామరుని అడ్డం పెట్టుకుని నాటకాలు వేయాలనే సిద్ధాంతానికి మేం విరుద్ధం కూడా. అయినా మీరు గతంలో ఈ నాటకాన్ని చాలాసార్లు వేశారు. అఫ్‌కోర్స్ చాలా మంది లేడీ ఆర్టిస్టులు వేశారనుకోండి. ఒక్క ఈ హైదరాబాద్‌లోనే నలుగురైదుగురు లేడీ ఆర్టిస్టులు ఆ వేషాన్ని వేశారు. అయినా మీముందు మీ గురించి పొగడ్డం కాదుగాని, మీరా కేరక్టరు వేస్తే వచ్చే హుందాతనం, మరెవరు వేసినా రాదన్న నమ్మకంతోనే వచ్చాం. మాకు పర్కువుట్ కాకపోయినా, మీకు పన్నెండువందలు ఇవ్వడానికి సిద్ధపడ్డాం. మా ఫంక్షన్‌కి చీఫ్‌మినిస్టరుగారు, మిగతా కేబినెట్ మినిస్టర్లు వస్తున్నారుకదాని మేం నాటకాన్ని పకడ్బందీగా వేయాలనుకుంటున్నాం" అన్నాడు.

తను రంగస్థల నటి. ఆ తర్వాతే సినిమాల్లో జూనియర్ ఆర్టిస్టు. రంగస్థల కళాకారులచేత తను బ్రతిమాలించుకోవడం ఏవిటి? తెగించి, ఈ ఒక్క నాటకం ఆడేద్దామా? అనిపించింది. పన్నెండువందలు వస్తాయని కాదు, గాని వాళ్లు తన సామర్థ్యంమీద నమ్మకంతో వచ్చారు. అయినా ఈ ఆలోచన అయిదారు క్షణాలకంటే ఎక్కువ సేపు నిలబడలేదు. తత్ఫలితంగా వాళ్లు నిరాశచెంది వెళ్లిపోయారు.

వారు వెళ్లిన మర్నాడే మరో టీ.వి. సీరియల్ నిర్మాతలు వచ్చి పదమూడు ఎపిసోడ్స్ గల ఓ సీరియల్లో హీరోయిన్ వేషం వెయ్యాలంటూ వచ్చారు. వాళ్ల కథ స్త్రీ సమస్యలతో కూడుకొన్నది కాబట్టి కిరణ్మయి

లాంటి మెచ్యూర్టీ వున్న నటీమణి చేత వేయించాలని వాళ్ల అభిలాష. ఎపిసోడ్‌కి రెండువేలు చొప్పున మొత్తం ఇరవయ్యారు వేలు ఇస్తామన్నారు. కానీ కిరణ్మయి ఒప్పుకోలేదు. రౌండ్‌ఫిగరు ముప్ఫైవేలు చేస్కోండి అన్నారు. ఇరవైరోజులకంటే ఎక్కువపని చెయ్యక్కర్లేదని కూడా చెప్పారు. అయినా ఆమె ఒప్పుకోలేదు. "నా ఒంట్లో బాగోడంలేదండి. డాక్టరు ఓ నెలరోజులపాటు కంప్లీట్‌గా బెడ్‌రెస్టు తీసుకోమన్నారు. లేకపోతే, ముప్ఫైవేలంటే నాకు చేదా? " అంటూ అంతరాత్మని చంపుకునే జవాబు చెప్పింది. వాళ్లూ నిరాశని కొంత, చిరాకును కొంత వ్యక్తం చేస్తూ వెళ్ళిపోయారు.

అగ్నివేష్ కొన్ని షరతులు పెట్టారు. తను అంగీకరించింది. అతనికిచ్చిన మాటకి నిలబడాలనే శతవిధాలా ప్రయత్నిస్తోంది. సరిగా ఈ సమయంలోనే డబ్బు వచ్చే అవకాశాలు ఒకదాని వెంట మరొకటి వస్తున్నాయి. చేతిలో వున్న డబ్బుని లెక్కచూసుకుంది.

రెండువేల అయిదువందలు.. అవీ, ఎండలో పెట్టిన అయిసుముక్కల్లా గబగబా కరిగిపోతున్నాయి.

ఓరోజు ఓ కవరొచ్చింది. అడ్రస్ రాసిన అక్షరాల్ని బట్టే అది గోపీచంద్ రాసిన ఉత్తరమని తెల్సిపోతోంది. కవర్లో ఓ కాగితం, అందులో అందమైన అక్షరాలతో మూడే మూడు వాక్యాలు. "పార్వతిగారికి కళాభివందనాలు. ఈ నెల పదవతారీఖునించి పదమూడువరకు కృష్ణాఒబెరాయ్ హోటల్లో వుంటాను. మీరు ఫోన్‌లో మీ నిర్ణయమే చెప్పక్కర్లేదు. హలో అని పలకరించినా సంతోషమే"

ఆరోజు తొమ్మిదో తారీఖని కిరణ్మయికి తెలుసు. రేపు గోపీచంద్‌కి ఫోన్ చెయ్యాలా? వద్దా? చేస్తే... ఆయనేం అంటాడు? హలో అని పలకరిస్తే చాలంటున్నాడు. కానీ ఆ తర్వాత పెళ్ళి విషయం ఎత్తితే? తను చెప్పే సమాధానం ఏవిటి?

రెండురోజులపాటు ఆలోచించినా సమాధానం దొరకలేదు. ప్రస్తుతం అతను ఈ వూళ్లోనే వున్నాడు కాబట్టి ఏక్షణాన్నైనా కారులో వచ్చేస్తాడేమోననే బెంగపట్టుకుంది. అయితే మూడోరోజు ఆమెనీ సందిగ్ధావస్థనించి బయట పడవేసిన వ్యక్తి సరోజమ్మే. ఆరోజు ఉదయం లేస్తూనే తనకి వూపిరాడ్డం కష్టంగా వుందని చెప్పింది. వెంటనే అక్కడికి దగ్గరగా వున్న ఓ డాక్టరు దగ్గరకి తీసుకెళ్ళింది. అతను స్పెషలిస్టు కాదు. కేవలం, యం. బి. బి. యస్. డాక్టర్. అతనామెను పరీక్షించాక, "ఇది గుండెకి సంబంధించిన జబ్బు! మీ అమ్మగార్ని కార్డియాలజిస్టు దగ్గరకి తీసుకువెళ్లండి" అంటూ తనకి తెల్సిన కార్డియాలజిస్టు పేరు సజెస్ట్ చేశాడు. సరోజమ్మని హార్టు స్పెషలిస్టు దగ్గరకి తీసుకువెళ్లింది. అతను కొన్ని పరీక్షలు చేశాక, సరోజమ్మకి బైపాస్ సర్జరీ చెయ్యాలన్నాడు. అదీ, వీలున్నంత త్వరగా చెయ్యడం మంచిదని చెప్పాడు. ఆపరేషన్ కయ్యే ఖర్చు కూడా కిరణ్మయికి ఎంత ఎగిరినా అందనంత ఎత్తులోనే వుంది. తాత్కాలిక ఉపశమనం కోసం ఏవో మందులు రాశాడు. ఆ మందుల్ని కొని, తల్లిని ఆటోరిక్షాలో ఇంటి దగ్గర దింపి, చేతిలో ఎంత మిగిలిందాని చూసుకుంటే-

"రెండు వందల ముప్ఫైరూపాయలు"

అవి ఎన్నాళ్లొస్తాయి? అవీ అయిపోతే ఏం చెయ్యాలి? ఎవర్నడగాలి? ఓ రోజంతా ఇదే ఆలోచనతో గడిపింది.

గోపీచంద్ హైదరాబాద్‌నించి ఇవాళ వెళ్లిపోతాడని తెలుసు "మీకు ఏమైనా డబ్బు కావాలంటే అడగండి. దానికీ పెళ్లి విషయంలో మీ నిర్ణయానికీ ఎటువంటి సంబంధమూ లేదు" అని అతను తన మొదటి ఉత్తరంలోనే రాశాడు. కానీ ఇప్పుడు అడగాలంటే, తప్పకుండా పెళ్లిప్రస్తావన వస్తుంది. ఓ పావుగంటకి సుధీర్ వచ్చాడు. ఆమెకు

ప్రాణం లేచివచ్చినట్టయింది. అతన్ని అప్పు అడుగుదామా అనుకుంది. కానీ గతంలో అతనే కొంత డబ్బు అడగకుండా ఇచ్చాడు. అలాంటివాణ్ణి మళ్ళీ అడిగితే ఏం బాగుంటుంది?

సుధీర్ ఆ ఇంట్లో ఎక్కువసేపు వుండలేదు. చాలా బిజీగా వుంది, ఈమధ్య రాలేకపోయేనన్నాడు. వివరాలు అడిగితే, "ఇన్‌స్టాల్‌మెంట్స్‌లో చెప్పడం నా కిష్టం లేదు. త్వరలోనే వచ్చి చెప్తాను. అది కూడా శుభవార్తే" అన్నాడు.

"ఎవరికి శుభవార్త? "

"నీకూ శుభవార్తే, నాకూ శుభవార్తే" అంటూ సిగరెట్ వెలిగించి ఈమధ్య నువ్వు ఏ పిక్చర్లు చేశావ్? " అన్నాడు. ఈ ప్రశ్న అతను అడుగుతాడని వూహించే సమాధానాన్ని సిద్ధంగా వుంచుకుంది.

"ఆమధ్య నాకు కాస్త నలతగా వుండి రెండుమూడు పిక్చర్లు వదులుకున్నాను. ఈమధ్య నాకు బాగున్నా, అమ్మ పరిస్థితే బాగులేదు" అంటూ తల్లి అనారోగ్యం గురించి మాత్రం వివరంగా చెప్పింది. అతను సిగరెట్ కాలుస్తూ కొన్ని క్షణాలుండిపోయి, ఏం నిర్ణయించుకున్నాడో ఏవిటో, జేబులోనించి కొంత డబ్బు తీసి లెక్కపెట్టేడు. పది వందనోట్లు! ఒకటి మాత్రం తిరిగి జేబులో పెట్టుకుని, మిగిలిన తొమ్మిది వందలూ ఆమెకిచ్చేశాడు. ఆమె ఏదో అనబోతుంటే, "వద్దు డైలాగ్ చెప్పకు. ఇది కూడా అప్పే! వడ్డీతోసహా తీసుకుంటాన్లే. ఈసారొచ్చేది శుభవార్తతోనే" అంటూ వచ్చినంత హడావిడిగా వెళ్లిపోయేడు. కిరణ్మయి తొలిసారిగా నవ్వుకుంటూ పాత ప్రశ్నని మనసులోనే వుచ్చరించింది.

ఏమిటీ జీవితం?

కన్నతండ్రి కర్కశంగా ప్రవర్తించాడు.

తోడబుట్టిన తమ్ముడు అనుబంధాల్ని తెంచుకుని పారిపోయాడు.

ఎంతో నమ్మిన వరదరాజులు ఎడారిలో వదిలేసి పారిపోయాడు.

హీరో మనోహర్ అహంకారాన్ని ప్రదర్శిస్తూ అవమానించాడు.

హీరో అగ్నివేష్ అయాచితంగా తనని అందలమెక్కిస్తానని భరోసా ఇచ్చేడు.

సుధీర్ ఒకప్పుడు తనతో నాటకాలు వేసిన పరిచయానికి తన బాగోగులు కోరుతూ అడపాతడపా సాయం కూడా చేస్తున్నాడు.

గోపీచంద్ ఎంతో శ్రీమంతుడై వుండి గూడా తనని భార్య స్థానంలోకి ఆహ్వానిస్తున్నాడు.

వీళ్లందరితో తన జీవితం ఏదో విధంగా ముడిపడింది. వారి చేతల, కదలికతో వుయ్యాలగామారి, ముందుకూ వెళ్తోంది, వెనక్కీ వస్తోంది. గతం, వర్తమానం తనకి తెలిసినవే!

మరి... భవిష్యత్తేమిటి? అదే ఆమె వూహకి అందడంలేదు.



విశాఖపట్నం ప్రాంతంలోని ఓ నియోజకవర్గంలోని ఎమ్మెల్యేని ఎవరో దుండగులు హత్య చెయ్యడంవల్ల అక్కడ వుప ఎన్నికలు జరుగుతున్నాయి.

ఈ వుప ఎన్నికల గురించి ఓ పెద్దాయన వ్యాఖ్యానించిన ప్రకారం "రాబందులు బతికున్న మనుషుల గురించికంటే చచ్చిన శవాల గురించే ఎక్కువ శ్రద్ధ చూపిస్తాయి.

పదవులు దొరకనివాళ్లు ఏ యమ్మెల్యే ఎప్పుడు చస్తే అప్పుడా నియోజక వర్గం నించి పోటీ చేద్దామా అని ఎదురు చూస్తుంటారట"

చాలామంది ఎదురు చూసినట్టే, ఆ ఎమ్మెల్యే చచ్చిపోయాడు. ఇప్పుడా స్థానాన్ని భర్తీ చెయ్యాలి.

ఆ సీటుకోసం గతంలో ఓడిపోయినవాళ్లు రెక్కలు దులుపుకుని హైదరాబాదుకి ఎగిరొచ్చారు. మునుపు పోటీ చేయనివాళ్లు గూడా జూలు దులుపుకుంటూ రాజధానికి లంఘించారు. అలా లంఘించినవారిలో పెంటయ్యా దొరగారు ఒకరు! అతని పేరులో పెంట వున్నా, మనిషి మాత్రం దొరలాంటివాడే! చిన్నా పెద్దా దానధర్మాలు చేసి బీదాబిక్కీ జనాలమధ్య ఎంతో కొంత పలుకుబడి సంపాదించుకున్నవాడే. అవసరమైతే కేష్ పెట్టె విప్పి నోట్లూ వెదజిమ్మగలడు. యింకా అవసరమైతే కత్తులపెట్టె విప్పి నలుగుర్ని మర్డర్లూ చేయించగలడు. ఎటొచ్చీ అతను రూలింగ్ పార్టీ మనిషి కాడు. ఆ పార్టీకి కొరకరాని కొయ్యలా మారిన మనిషి. అతను ఏ పార్టీనించైతే పోటీ చేస్తున్నాడో ఆ పార్టీ గురించి రూలింగ్ పార్టీకి ఎటువంటి భయమూ లేదు. ఎటొచ్చీ ఆ పార్టీ తరపున పోటీ చేస్తున్న పెంటయ్యా దొరగారే వారికి సమస్యగా తయారయేడు. అతన్ని ఓడించాలంటే సాదాసీదా కేండేటు సరిపోడు! సినిమా కేండేట్నే నిలబెట్టాలని ప్రభుత్వం నిర్ణయించుకుంది.

వీరుడి దగ్గర ఎన్ని శక్తిమంతమైన ఆయుధాలున్నా ఎదుటి వీరుడు సమ్మోహనాస్త్రం వదలగానే శత్రువీరులు సొమ్మసిల్లి పడిపోతారు. అంటే వాళ్లు చావరు. కాస్సేపు కిక్కురుమనకుండా నేలమీదపడి, ఓ కునుకు తీస్తారు! ఈ యుద్ధరహస్యం తెల్సిందగ్గర్నించే యీ ప్రజాప్రభుత్వంలో చాలా పార్టీలు సినిమా ఆర్టిస్టుల్ని ఎలక్షన్లో నిలబెట్టడం ఆరంభించారు. సినిమా తారలంటే ప్రజల్లో సమ్మోహనాస్త్రంలాపని చేస్తారు. ఎప్పుడూ తెరమీద హీరోయిజమ్ చూపించే హీరోలు ప్రజలమధ్యకొచ్చి "నేను మీకు తవ్వి తలకెత్తుతాను! మిమ్మల్ని వుద్ధరించడానికే వూపిరిపీలుస్తున్నాను. నన్ను అభిమానించే ప్రజలకి, నా దేవుళ్లకి నేనేం సేవచేసి వాళ్ల రుణం తీర్చుకోవాలని రాత్రింబగళ్లు ఆలోచించి, యీ ఎలక్షన్లో నిలబడుతున్నాను" అంటూ కంఠతా పెట్టిన నాలుగు ముక్కలూ కక్కేస్తే ఆ కక్కే తమ చిక్కుల్ని తీరుస్తాయన్న నమ్మకంతో ప్రజలు ఓట్లు వెయ్యడం జరుగుతోంది. అందుకే ప్రభుత్వంవారు రెండు సమ్మోహనాస్త్రాలతో సమానమైన 'అగ్నివేష్'ని ఆ పోటీకి దింపేరు. అతని సినిమాలు ఈమధ్య లక్షలకి లక్షలు దులిపేస్తున్నాయి కాబట్టి, అతను తమ పార్టీ తరపున నిలబడి ఓట్లని కూడా దులిపేస్తాడని అధిష్టానవర్గం ఆలోచించి మరీ అతన్ని నిలబెట్టేరు. ఆమధ్య అతనో కేండేటు తరపున ప్రచారానికెళ్తేనే ఓట్లు వర్షంలా కురిసాయి. అలాంటప్పుడు అతనే స్వయంగా నిలబడుతున్నప్పుడు ఓట్లు అనేవి వర్షంలా కాదు వరదలా ముంచెత్తు కొస్తాయన్న ప్రగాఢ విశ్వాసంతో అతన్ని కలిసారు. ఒప్పించారు. ఎన్నికల్లోకి దింపేరు.

అగ్నివేష్ అసలే బిజీ హీరో. అందునా ఎలక్షన్లో నిలబెడుతున్నారనేసరికి మరీ బిజీ అయిపోయేడు. అతన్తో ప్రస్తుతం సినిమా తీస్తున్న ప్రొడ్యూసర్లు తమ షూటింగులు ఎక్కడ ఆగిపోతాయోనని కంగారు పడిపోయారు. అయితే వాళ్ల కంగారు తగ్గించడానికి అగ్నివేష్ డే అండ్ నైట్ పనిచేసి, ఆ సినిమాల్ని పూర్తి చేస్తూ ఓ కండీషన్ పెట్టేడు. "గతంలో నా సినిమాల్లో ఒక్కో సినిమాకి మధ్య కనీసం ఆరు వారాలైనా గేప్ వుండాలనేవాణ్ణి. కానీ మీ హీరోనైన

నేను ప్రప్రథమంగా ఎలక్షన్లో నిలబడుతు న్నాను. అంచేత ప్రజల మీద నా ముద్ర మరింత గాఢంగా పడాలి. అంటే యిప్పుడు తీసిన సినిమాలన్నీ ఎలక్షన్‌కి ముందే ఒకే సారి విడుదలవాలి! ప్రతీగోడ మీదా నా వాల్‌పోస్టరే, ప్రతీ జంక్షన్‌లోనూ నా కట్ ఔటే! ప్రతిథియేటర్లోనూ నా సినిమాలే కని పించాలి. ప్రతీ యింట్లోనూ నా గురించే డిస్కషన్స్ జరుగుతాయి. దాంతో మీ పిక్చ ర్సుకి కలక్షన్లు కుమ్మేస్తాయి" అన్నాడు. నిర్మాతలంతా తమ అభిప్రాయం చెప్పలేక, మింగలేక గుటకలు మింగేరు! 'ఓ హీరో వేసిన సినిమా మార్కెట్లో ఒకటివుంటే మంచింది. ఒకవేళ రెండున్నా ఫర్వాలేదు అనిపించుకుంటాయి. కానీ అంతకంటే ఎక్కువుంటే ధమాల్‌మనడం ఖాయం' అని ఒకప్పుడు ఇదే హీరో చెప్పేడు. సినిమాకి సినిమాకి మధ్య ఖచ్చితంగా ఆరు వారాలు గేప్ వుండాలనే నియమం కోసం, షూటింగు పూర్తయిన సినిమాలకి డబ్బింగు చెప్పకుండా కావాలనే ఆలస్యం చేశాడు. 'అలా ఆలస్యం చేస్తే మేం అప్పు తెచ్చిన డబ్బుకి వడ్డీలు పెరిగిపోతాయ్ సార్' అని నిర్మాతలు నీళ్లు నమిలితే, "వెధవ వడ్డీలదేం వుందయ్యా! నా పిక్చర్ రిలీజ్ అయితే మీకొచ్చే లాభాలెంత? ఆ లాభాల ముందు యీ వడ్డీ డబ్బులెంత? నేను ప్రేక్షకులంద రిచేత అభిమానించే హీరోని! నా పిక్చరు కోసం ప్రజలు వువ్విళ్లూరుతుంటారు. అలాంటివారికి నా సినిమాల్ని వూరించి వూరించి వదలాలి" అని హితబోధ చేసిన వాడు యిప్పుడు తన ఎలక్షన్ కోసం కొత్త చిత్రాలు అన్నింటిని ఒకేసారి రిలీజ్ చెయ్య మంటున్నాడు.

ఒకవేళ అతని మాటని కాదంటే, నెక్స్ట్ పిక్చరుకి కాల్‌షీట్సు యివ్వడేమోనని భయం! ఆ భయంతోనే అందరూ సరేనని తలలూపేరు.





ఇక్కడ అగ్నివేష్‌కి ఆశ్చర్యం కలిగించిన విషయం ఒకటివుంది. అతను విశాఖప ట్నంగాని ఆ ఏరియాగ్గాని షూటింగుకి వెళ్తే పెంటయ్యదొర వచ్చి అతన్ని కలవాల్సిందే. అతనింట్లో భోంచెయ్యాల్సిందే! ఆ దృశ్యా లన్నీ ఫొటోలుగాను, వీడియో ఫిల్ములుగాను తీయాల్సిందే. సినిమాలు చూడ్డానికి తనకె ప్పుడూ టైము దొరకదని ఒకవేళ దొరకడ మంటూ జరిగితే అగ్నివేష్ నటించిన సిన్మాయే చూస్తానని చెప్పేవాడు. అలాంటి అభిమాని, తనతో పోటీకి దిగుతున్నాడా? తనకంటే ముందు నిలబడాలనుకున్నా తను నిలబడిన సంగతి తెలిసాకయినా అతను విత్‌డ్రా అయిపోవాలిగదా" అని ఆశ్చర్యపో యేడు. అతని అనుచరులు ఆశ్చర్యపోవ డంతో వూరుకోకుండా డైరెక్టుగా పెంటయ్య దొరకే ఫోన్ చేసి ఈ సంగతి అడిగారు. దానికి పెంటయ్య దొర పకపకమంటూ నవ్వి "ఇది ఎలక్షనయ్యా, అంటే రాజకీయం! పదవుల దగ్గరకొచ్చేసరికి పెళ్లాలు మొగుళ్లనే ఖాతరు చెయ్యడంలేదు. మొగుళ్లు పెళ్లాల్ని ఖాతరు చెయ్యడంలేదు. అల్లుళ్లు మావల్నీ ఖాతరు చెయ్యడంలేదు. కొడుకులు తండ్రుల్నీ ఖాతరు చెయ్యడంలేదు! అలాంట ప్పుడు మీరు సినిమావాళ్లు, నేను పోలిటి క్సోణ్ణి! మీ హీరోగారు ప్రజానాయకుడవాలని నాతో పోటీపడుతున్నాడుగాని నేనేమీ సినిమా హీరోనవాలని పోటీపడ్డంలేదే! అయినా ఈ ప్రెజానీకానికి కావలసింది సేవ చేసినట్టు నటించేవాడా? లేక నిజంగా ప్రజాసేవ చేసేవాడా? ఈ సంగతి రేపు ప్రజల్నే తేల్చుకోనిద్దాం" అంటూ ఫోన్ పెట్టే శాడు.

ఎలక్షన్ సంరంభం ఆరంభం అయింది.

కిరణ్మయి పరిస్థితి యిరకాటంలో పడింది. ఫినిషింగ్‌లో వున్న పిక్చర్లు పూర్త వగానే కొత్త పిక్చర్లు ఆరంభమవుతాయని, అందులో కనీసం రెండింట్లో తనకే హీరో యిన్ ఛాన్స్ యిస్తానంటే తను యిన్నాళ్లూ ఆగింది! అగ్నివేష్ ఆ మాట అన్నప్పుడు

యీ ఎలక్షన్ ప్రస్తావన లేదు. కానీ యిప్పుడదే ప్రధానమైపోయింది. ఓసారి అగ్నివేష్‌కి కనిపిస్తే బాగుంటుందనిపించి, ఆటో రిక్షాలో వెళ్లింది. కానీ బంగళా అంతా జనం వున్నారు. ఆ రోజు అగ్నివేష్ దగ్గరున్న వుపన్యాస కేసరిగారు ఏదో పనిమీద వరండాలోకొస్తే చాలా ఆశగా గబగబా వెళ్లి "వార్ని ఒక్క నిమిషం కలిసి వెళ్లిపోతాను" అంది వినయంగా. కానీ అతను ఏ నిర్వచనానికీ అందని ఓ ఎక్స్‌ప్రెషన్ యిచ్చి "కుదరదమ్మా! ఆయనకి మేం చొక్కా వెనకాల బనీన్లాగ అంటిపెట్టుకు తిరుగుతున్నాం. అయినా మాతో మాట్లాడ్డానికే ఆయనకి టైము దొరకడంలేదు. ఇంక నీకేం ఇంటర్వ్యూ ఇస్తారు? " అన్నాడు.

"అది కాదండి, నా పేరు చెప్తే..."

"గుర్తొస్తుందంటావా? భలేదానివే! ఇప్పుడు ఆయన పేరు ఆయనకే గుర్తుండడంలేదు. యింక నీ పేరేం గుర్తుండి చస్తుంది. ఓ నాలుగు రోజులు ఆగిరా" అనేసి మళ్లీ లోపలకి పరుగెత్తాడు.

నాలుగు రోజుల పాటు ఎంతో ఆత్రంగా బరువుగా గడిపాక మళ్లీ ఆ యింటికి వెళ్లింది. అదీ వుదయం పావు తక్కువ ఆరుకి వెళ్లింది. అప్పుడైతే ఎక్కువ జనం వుండరని ఆశ... కానీ వెళ్లేసరికి ఆ కాంపౌండు మొత్తం మీద ఒక్క మనిషీ లేడు. ప్రశాంతంగా వుంది. వాచ్‌మేన్‌ని పిల్చి అడిగితే,

"ఇంకెక్కడి అయ్యగారు? " అన్నాడు భావరహితంగా.

"ఏం? ఏం జరిగింది? " ఆత్రంగా అడిగింది.

"ఆయనకేం జరగలేదు. అయ్యగారు ప్రచారానికి పోయిండ్రు! ఎప్పుడు వచ్చేదీ తెల్వద్" అంటూ వాచ్‌మాన్ ఇంక బయటకెళ్లమ్మా తల్లీ అన్నట్టుగా చూశాడు. కిరణ్మయికి మనసులో నిరాశ, ఒంట్లో నీరసం కలిగాయి.

  

క్షణక్షణముల్ జవరాండ్ర చిత్తముల్ అంటూ స్త్రీ మనస్తత్వాన్ని ఒక కోణంలోనించి పరిశీలించిన ఓ కవిగారెవరో అన్నారుగాని, ఎలక్షన్ టు ఎలక్షన్, ఓటర్ల చిత్తముల్ అని తిరగరాస్కో వలసిన అవసరం వుందని, జనం చాన్నాళ్లనించి నిరూపిస్తూనే వున్నారు. సినిమాల విషయంలోను, ఎలక్షన్ విషయంలో కూడా ప్రజలు ఏం తీర్పు యిస్తారో ఎవరూ వూహించలేరు. ఒక్కోసారి సూపర్‌హిట్ అవుతుందనుకున్న సినిమా అట్టర్‌ఫ్లాప్ అవడం, బంపర్ మెజార్టీతో గెలుస్తాడనుకున్న కేండేటుకి డిపోజిట్లు కూడా దక్కకపోవడం అందరికీ తెల్సిందే.

అగ్నివేష్ నటించిన మూడు చిత్రాలు ఒకేసారి విడుదలయేయి. ఒక దాంతో మరొకటి పోటీపడి ఆడుతాయనుకున్నారు. కానీ అవి ఒకదాంతో ఒకటి పోటీపడి మరీ ఫ్లాప్ అయేయి.

ఇంక ఎలక్షన్ పరిస్థితికొస్తే,

అగ్నివేష్ మీద పోటీ చేసిన పెంటయ్యదొర బంపర్ మెజార్టీతో గెలిచాడు. అగ్నివేష్ దారుణమైన పరాజయాన్ని చవిచూశాడు. అతను ఓడిపోతాడనే సందేహం ఏ ఒక్కరికీ లేకపోయినా ఓడిపోయేడు. ఒక వేళ ఓడిపోవడం అంటూ జరిగితే, ఒకటి లేక రెండు ఓట్లు తేడాతోనే వుంటుందని కొందరు అనుకున్నారు. కానీ యింత తేడా వస్తుందని రాజకీయ పండితులు కూడా అనుకోలేకపోయేరు.

అగ్నివేష్ యింతవరకు చాలా సినిమాల్లో చాలామంది రౌడీలతో ఫైట్ చేసే సీనుల్లో నటించాడు. అందులో అతను కొట్టడం, ఆ దెబ్బలకి తట్టుకోలేక రౌడీలు పారిపోవడమే జరిగింది. కానీ యిప్పుడు వాస్తవ జీవితంలో పెంటయ్యదొర అనే వ్యక్తి, ఎలక్షన్ అనే ఫైట్‌లో ఓట్లు అనే దెబ్బలుకొట్టి,

రౌడీల్ని హీరో పరుగులు తీయించినట్టు సినిమా హీరోనే పరుగులు తీయించాడు.

"పెంటయ్యదొర ఎలక్షన్లో రిగ్గింగ్ చేయించాడు లేకపోతే మీరు ఓడిపోవడం ఏమిటండి?" అంటూ అతని అనుచరులు ఎంత నచ్చజెప్పినా అగ్నివేష్ రాజీకాలేకపోయేడు. ఫోన్‌ల మీద ఫోన్‌లు వస్తున్నాయి. అందరూ సానుభూతి చూపించేవాళ్ళే. ఆ సానుభూతిని భరించలేక, ఫోన్‌లు రిసీవ్ చేస్కోవడం మానేశాడు. మిగతావాళ్ళనీ ఫోన్ ఎత్తొద్దన్నాడు. పత్రికా విలేఖర్లు తండోపతండాలుగా వచ్చి తలా ఓ పాతిక ప్రశ్నల చొప్పున అడిగారు. ఎవరు ఎన్ని ప్రశ్నలు అడిగినా, అన్ని ప్రశ్నల అర్థం ఒక్కటే. "మీరెలా ఓడిపోయేరు? మీ అభిమానులు మీకు ఓట్లు వేసినా మీరు గెల్చేవారే! ఏం? వాళ్లు కూడా వెయ్యలేదా?"

అగ్నివేష్‌కి అదే జవాబు చెప్పలేని ప్రశ్నగా వేధించింది. ఔట్‌డోర్లో తనచుట్టూ గుమిగూడిన వేలాది జనం తనకెందుకు ఓట్లు వెయ్యలేదు. పైగా విశాఖపట్నం ఏరియాలోనే దాదాపు ఏడువందల చిల్లర అభిమాన సంఘాలున్నాయి. ఆ అభిమానులు ఏమైపోయేరు? పార్టీ యిచ్చిన డబ్బుని కార్యకర్తలకిచ్చేడు. తను నిలబడితే డబ్బు యివ్వకుండానే ఓట్లు పడతాయని వూహించినా సరదాగా డబ్బు పంచిపెట్టమని చెప్పేడు. మరి యిలా జరిగిందేం? తను ప్రచారం చేస్తే రాజమూర్తి బంపర్ మెజార్టీతో గెలిచాడు. అలాంటప్పుడు తను స్వయంగా నిలబడితే ఎందుకు గెలవలేదు? ఈ ఆలోచనలతో అతను చలిజ్వరం వచ్చిన వాడిలా వణికిపోయాడు. తన ఓటమి గురించి అందరూ ప్రశ్నిస్తుంటే ఒక్కో ప్రశ్న ఒక్కో గునపం పోటులా గుచ్చుకుంటోంది. ఎంత తాగినా నిద్ర పట్టడంలేదు, మత్తు కలగడంలేదు. ఇక్కడవుండి ఈ బాధ భరించడంకంటే, కొన్నాళ్లపాటు విదేశాలు చూడాలని భార్యా సమేతంగా బయలుదేరాడు. వెళ్లేముందు తనతో సినిమాలు ప్లాన్ చేసిన నిర్మాతల్ని పిల్చి "నేను మీ కోసమే విదేశాలకి వెళ్తున్నాను. ఎందుకంటే యిప్పుడు నా మనసేం బాగులేదు. ఇలా వున్నప్పుడు నేను నటించినా నా పాత్రకి న్యాయం చెయ్యలేను. నేను తిరిగొచ్చేసరికి మీరు మీ షూటింగులు ప్లాన్ చేస్కోండి" అన్చెప్పి విమానం ఎక్కిపోయేడు. అంతవరకూ ఆయనముందు నవ్వుతూ నిలబడి, "అలాగే సార్... ఎంతమాట! మా పిక్చర్లకి న్యాయం చెయ్యడానికి మీరు విదేశాలు తిరిగి రావడం ఎంతయినా అవసరం" అని చేతులు పిసుక్కున్న నిర్మాతలు, విమానం ఆకాశంలోకి లేవగానే తమతమ స్వగతాల్ని వెళ్లగక్కేసారు.

వాళ్లు తమ పిక్చర్లు ఫలానా తారీఖునాడు షూటింగు ఆరంభం, ఫలానా తేదీనాడు పిక్చర్ రిలీజ్ అని ఫుల్‌పేజీ ఎడ్వర్‌టైజ్‌మెంట్లు యిచ్చేశారు. అదీగాక ఎలక్షన్ ముందువరకు అగ్నివేష్‌కి ప్రజల్లో మంచి ఫాలోయింగ్ వుండేది. కానీ ఎలక్షన్‌టైములో విడుదలయిన మూడు పిక్చర్లు ఫ్లాప్ అయ్యేయి. అతను కూడా ఎలక్షన్లో ఓడిపోయేడు. ఆయన విదేశాల్నించి తిరిగొచ్చేసరికి మరోమూడు నెలలు పడుతుంది. వచ్చేక, షూటింగు ఆరంభించి, ముగించి, పిక్చర్ రిలీజ్ అయేసరికి ఎంతలేదన్నా ఓ సంవత్సరం పడుతుంది. ఈలోగా మరో హీరో ఎవరైనా వరసగా రెండు హిట్లు కొడితే అప్పుడీయన పిక్చర్లని డిస్ట్రిబ్యూటర్లు ఏ రేటుకి కొంటారో! అసలు కొంటారో కొనరో? అని ఎవరికివారే గొణుక్కుంటూ ఎయిర్‌పోర్టునించి యిళ్లకి బయలుదేరారు.

★ ★ ★

అగ్నివేష్ సినిమాల పరాజయం, రాజకీయ పరాజయం, అకస్మాత్తుగా విదేశీ ప్రయాణం యివన్నీ నిర్మాతల్ని ఆందోళనలో పడవేస్తే, కిరణ్మయి మరో విధమైన




ఆందోళనకి గురయింది. అగ్నివేష్ యిచ్చిన వాగ్దానం నెరవేరి వుంటే, తను యీపాటికి షూటింగుల్లో వుండేది! ఎడ్వాన్సులు చేతికి అంది వుండేవి. తల్లికి ఆపరేషన్ జరిపించి ఆర్థికమైన ఇబ్బందుల్నించి పూర్తిగా బయట పడి వుండేది. కానీ ఇప్పుడంతా అగమ్యగోచరంగా వుంది! చేతిలో చూస్తే ఎక్కువగా డబ్బుల్లేవు. తల్లి అనారోగ్యం రోజురోజుకీ ముదిరిపోతోంది. ఇంటికి ఓ నెల అద్దె కూడా బాకీపడింది. అగ్నివేష్ మాటకి కట్టుబడి తనకొచ్చిన వేషాలన్నింటినీ తిరస్కరించింది. ఏం చెయ్యడం? పత్రికల్ని అద్దెకు తెచ్చుకుని అగ్నివేష్ పర్యటన వివరాల గురించే ఆసక్తిగా చదివింది.

అగ్నివేష్ వచ్చే టైము దగ్గరపడింది.

కిరణ్మయికి పోస్ట్‌మేన్ ఓ కవరిచ్చి వెళ్లాడు. అది గోపీచంద్ రాసింది. విప్పి చూస్తే మళ్లీ మూడే మూడు వాక్యాలు. కాకపోతే అందులో ఒక వాక్యం ప్రత్యేకంగా కనిపించింది.

"వ్యాపార రీత్యా నేను విదేశాలు వెళ్లాల్సి వుంది. డేటు, నెలా యింకా ఫిక్స్ కాలేదనుకోండి! అది మీ నిర్ణయం మీద ఆధారపడి వుంది. ఎన్నోసార్లు విదేశాలు తిరిగొచ్చినా, ఈసారి సతీసమేతంగా వెళ్లిరావాలని నా ఆకాంక్ష. నిర్ణయంమీకే వదిలేస్తున్నాను"

వుత్తరం చదవడం పూర్తి కాకుండానే ఆమె భోరుమంటూ ఏడ్చేసింది. గుమ్మంలో వుండి ఏడిస్తే వీధిలో వాళ్లు చూస్తారని, గబగబ యింట్లోకి వెళ్లిపోయింది. మంచం మీదపడి ఏడవాలనుకున్నా, వున్న ఆ ఒక్క నులకమంచంమీద తల్లి పడుకుని వుంది. గబగబా పెరట్లోకెళ్లి కూర్చుని ఏడవ నారంభించింది. ఈ రంగానికే స్వస్తి చెప్పేసి, గోపీచంద్‌కి అంగీకారం చెప్పడానికి బయలుదేరుతుండగా అగ్నివేష్ తన కాళ్లు కదలకుండా సంకెళ్లు వేశాడు. అయితే అవి బంగారపు సంకెళ్లని మురిసిపోయి తన నిర్ణయానికి నీళ్లు వదిలేసింది. మళ్లీ గోపీచంద్‌నించి అదే ఆదరణ, అదే ఆప్యాయత. ప్రతీ అక్షరం అతని ప్రేమని నిశ్శబ్ద ప్రణయగీతంలా వినిపిస్తున్నాయి.

"పార్వతీ... పార్వతీ..."

సుధీర్ గొంతు వినిపించేసరికి కిరణ్మయి ఆలోచనలకి బ్రేక్ పడింది. కళ్లు తుడుచుకుని గబగబా లోపలకొచ్చింది. ఏడవడం వల్ల తన కళ్లు ఎర్రబడి వుంటాయి. ఎందుకు ఎర్రబడ్డాయని సుధీర్ అడుగుతాడు. కానీ తను కారణం చెప్పలేదు. ఎందుకంటే తను యింతవరకు అగ్నివేష్ యిచ్చిన అభయం గురించిగాని, గోపీచంద్ ఆహ్వానం గురించిగాని సుధీర్‌కి చెప్పలేదు. కానీ ఆమె అనుమానాలేం నిజం కాలేదు. సుధీర్ చాలా వుత్సాహంగా, హుషారుగా వున్నాడు. ఆ వుత్సాహానికి కిరణ్మయి కళ్లలోని ఎరుపు ఏమాత్రం కనిపించలేదు. ఆమెను చూడగానే గబగబా మాట్లాడేడు.

"పార్వతీ! యిన్నాళ్లకి నాకు దశ తిరిగే టైము వచ్చింది. గమ్మత్తేమిటంటే నాతో పాటు నీకూ దశ తిరిగిపోయే టైమొచ్చింది. యిద్దరం ఒకేసారి నటీనటులుగా భార్గవ అవార్డు, కిరణ్మయి అవార్డు అందుకున్నాం. తిరిగి యిక్కడ సినిమారంగంలో కల్సుకున్నాం. యిప్పుడు నేను డైరెక్టర్ని కాబోతున్నాను. అదే పిక్చర్లో నువ్వు హీరోయిన్‌వి కాబోతున్నావ్"

అతనలా చెప్పుకు పోతుంటే కిరణ్మయికి విషయమేమిటో సగం అర్థమైపోయింది. అతనికో పెద్ద ప్రొడక్షన్ వాళ్లు డైరెక్టర్ ఛాన్సు యివ్వబోతున్నారని ఓసారి సూచాయగా చెప్పేడు! ఇప్పుడా అవకాశం వచ్చిందన్నమాట. ఎటొచ్చీ కాస్త ఆశ్చర్యం కలిగించింది. తనని హీరోయిన్ అనడమే! ఒకప్పుడైతే అలాంటి శుభవార్త విని గాలిలో ఎగిరేదే! కానీ అగ్నివేష్ మరో పిక్చర్లో హీరోయిన్ వేషం వచ్చినా వెయ్యొద్దని షరతుపెట్టేడు. ఆమె తను చెప్పిన శుభవార్తకి

ఏమాత్రం స్పందించకుండా మౌనంగా వుండిపోవడం సుధీర్‌కి బాధ కలిగించింది తరచి తరచి అడిగిన మీదట అగ్నివేష్ చేసిన ప్రామిస్ విషయం చెప్పింది. అది విని సుధీర్ కొన్ని క్షణాలపాటు షాక్ అయి తర్వాత నిట్టూర్చాడు. అక్కడే మంచం మీద సరోజమ్మ వుండడంవల్ల కిరణ్మయిని పెరట్లోకి తీసుకువెళ్లి మాట్లాడాడు.

"అతని మాటలు నిజమని నమ్ముతున్నావా?" సూటిగా అడిగాడు సుధీర్!

"నాతో అబద్ధమాడవలసిన అవసరం అతనికేం వుంది?"

"అలా అయితే నిన్ను హీరోయిన్ని చెయ్యాల్సిన అవసరం మాత్రం అతనికేం వుంది?"

కిరణ్మయి జవాబు చెప్పలేకపోయింది. సుధీర్ మళ్లీ మాట్లాడాడు.

"నువ్వెప్పుడైనా ఆయన దగ్గరకెళ్లి అతనిపక్కన హీరోయిన్ వేషం యిప్పించమని అడిగేవా? లేదే! అలాంటప్పుడాయన నిన్ను కారులో పిలిపించిమరీ, నీకు హీరోయిన్ వేషం ఎందుకిస్తానన్నాడు? నీ మీద ప్రేమతో కాదు! నిన్ను హీరోయిన్ చెయ్యాలన్న తపనతో కాదు! కేవలం ఆ మనోహర్ మీదున్న కక్షతో అలా అన్నాడు. అతను అవమానించిన అమ్మాయిని హీరోయిన్ని చేసి అతని కంటే తను గొప్ప వాడనిపించుకోడానికలా భరోసా యిచ్చేడు. కానీ అతనలా వాగ్దానం చేసేనాటి పరిస్థితులకీ యిప్పటికీ ఎంతతేడా వచ్చిందో ఆలోచించేవా? రేపు మరెంత తేడా వస్తుందో వూహించగలవా?"

సుధీర్ ఆవేశాన్ని తమాయించుకోడానికన్నట్టుగా ఆగి జేబులోనించి సిగరెట్ తీసి వెలిగించి, రెండు దమ్ములిల్లాగాక మళ్లీ చెప్పేడు.

"అగ్నివేష్‌కి నీ అందం తెలుసు. కానీ, నీ నటనాసామర్థ్యం తెలీదు. నీ గతం తెలీదు. ఈనాటి నీ ఆర్థికపరిస్థితి తెలీదు. అతనికి తెల్సిందల్లా వృత్తి విరోధి అయిన మనోహర్‌మీద కక్ష తీర్చుకోవడమే

కానీ నాకు నీ జీవితం తెలుసు! నీ హృదయం తెలుసు. ఆ హృదయంలో అనుభవిస్తున్న క్షోభ తెలుసు

అగ్నివేష్‌లాంటి హీరో తల్చుకుంటే నిన్నే కాదు, నీలో వందోవంతు టాలెంట్ లేని అమ్మాయిని కూడా హీరోయిన్‌గా చెయ్యగలడు! యివాళ లీడింగ్ హీరోలకా శక్తి వుంది! కానీ నాకాశక్తి లేదు! ఆంధ్రదేశంలో రచయితగా, నటుడిగా, దర్శకుడిగా ఎంతో టాలెంటుందని ఎన్నోసార్లు నిరూపించుకున్న నేను, ఎన్నో కష్టాలు, అవమానాలు భరిస్తే తప్ప ఈనాటికి డైరక్టర్ని కాలేకపోయేను. నన్ను డైరక్టర్ని చెయ్యండీ అని ఏనాడూ ఎవర్నీ అడగలేదు. కానీ నేను డైరక్టరుగా మారిన మరుక్షణం నేను ప్రొడ్యూసర్ని ఎవరికోసం అడిగానో తెలుసా? నీకోసం అడిగాను! నిన్ను సెకండ్ హీరోయిన్‌గా పెట్టించగలిగినా, ఆనాడు నీ స్థానాన్ని నీకు దక్కించేస్థితిలో లేను! కానీ... యివాళ ఆ అవకాశం ఆ స్థితీ నాకొచ్చేయి. నిన్ను మనోహర్ అవమానించి, నీ స్థానంనించి తొలగించాడని తెల్సిన మరుక్షణం నిన్ను హీరోయిన్ని చేసి ఆంధ్రదేశానికి చూపించాలని నిర్ణయించుకున్నాను. కానీ ఆ నిర్ణయాన్ని ఆ మర్నాడే నీకు తెలియజేయడానికి, నేను అగ్నివేష్‌ని కాదు, హీరోని కాదు, నాకు కారు లేదు. నిన్ను హీరోయిన్ని చెయ్యాలన్న నిర్ణయం, ధ్యేయం తప్ప మరే మీలేవు! అందుకే, ఆ శక్తి నాకు సమకూరే వరకూ ఈ విషయం సస్పెన్స్‌గానే వుంచేను! ఆ సస్పెన్స్‌ని విప్పి, నీకు ఆశ్చర్యం, ఆనందం కలిగించాలని వురకలు, పరుగులు మీద వచ్చిన నాకు, ఇన్నాళ్ళూ నువ్వు మెంటైన్ చేసిన సస్పెన్స్ విషయం చెప్పి, నాకు షాక్ కలిగించావు"

సుధీర్ ఆవేశంతో వణికిపోతున్నాడు. కిర





ణ్మయి మనసు, శరీరం గూడా కంపిస్తు న్నాయి.

"నీ గురించి గతంలో సెకెండ్ హీరోయి న్గా, ఇప్పుడు హీరోయిన్గా గట్టిగా చెప్పేస రికి ఆ నిర్మాత నన్ను ఏమని అడిగాడో తెలుసా? అఫ్కోర్స్ అతనేకాదు, ఆ స్థానంలో ఎవరున్నా అదే అడుగుతార నుకో... కిరణ్మయి నీ గర్ల్ఫ్రెండా? అని అడిగేరు. కాదుసార్, నాతో నాటకాల్లో కలిసి నటించిన నటి, నాకు మంచి స్నేహి తురాలూ అని చెప్పేను. ఈ ఫీల్డులో, ఓ మగాడికి ఓ లేడీ ఆర్టిస్టు మంచి స్నేహితు రాలూ అంటే దానర్థం ఏమిటో తెల్సుగా! మా ప్రొడ్యూసర్ తాలూకా ఫ్రెండొకాయన ఆ కిరణ్మయి బాగుంటుంది కదా! మన డైరె క్టర్గారికేనాడో ఖుషామత్ చేసుంటుంది, ఆ రుణం యిలా తీర్చుకుంటున్నాడని జోక్ కూడా చేశాడు. అతని సంస్కారాన్ని తప్పు పట్టవలసిన అవసరంలేదు. ఇక్కడ సాధార ణంగా జరిగే విషయం అది. కానీ నిన్నెప్పు డైనా ఆ కోరిక కోరేనా? కనీసం, ఆ భావం కలిగేలా ప్రవర్తించేనా? లేదే! నీకూ నాకూ ఎటువంటి శారీరకమైన సంబంధం లేదన్న విషయం, ఎవరు నమ్మినా, నమ్మకపో యినా, ఐ డోంట్ కేర్"

ఓ అయిదు నిమిషాలసేపు దారుణమైన నిశ్శబ్దం అటూ ఇటూ తిరిగింది. ఆ తర్వాత కూడా కిరణ్మయి మాట్లాడలేకపోయింది! అగ్నివేష్ తన వాగ్దానాన్ని నిలబెట్టుకుని హీరోయిన్ ఛాన్సు యిప్పిస్తే? ఈలోగా సుధీర్ సినిమాలో ఎందుకు నటించావూ అని అడుగుతాడు! నా మాటంటే ఖాతరు లేకపోయిందన్నమాట అంటూ పది మందిముందూ ఎగురుతాడు! అవన్నీ చిల వలు పలవలు చేసి పత్రికలూ రాయొచ్చు ఇప్పటికే మనోహర్వల్ల స్టూడియో సెట్లో అవమానాలపాలయింది! ఇప్పుడు తను అగ్నివేష్కిచ్చిన మాట తప్పితే, పత్రికల్లో గూడా తనని దుయ్యబడతారు! రేపోమాపో అగ్నివేష్ తిరిగొస్తున్నాడు. అతన్నడిగి, అతను కాదంటే, సుధీర్ పిక్చర్లో నటిస్తానని చెప్పింది. సుధీర్ కళ్లల్లో నీళ్లు తిరిగినట్టు న్నాయి, గభీమని జేబులోనించి రుమాలు తీసి, ముఖం తుడుచుకుంటున్నట్టు నటించి, కళ్ళు ఒత్తుకున్నాడు.

"అగ్నివేష్గారు నిన్ను కాదంటే... నా పిక్చర్లో నటిస్తావా? ఓకే... థాంక్యూ! దాని కైనా ఒప్పుకున్నావ్... సరే, నువ్వు అగ్నివే ష్ద్వారా పెద్ద హీరోయిన్వి కావాలనే కోరు కుంటున్నాను. అయినా, అతను కాదంటే, నా పిక్చర్లో ఏక్ట్చేస్తానంటున్నావు కాబట్టి... విను! మా పిక్చర్లో, నీ రెమ్యూనరేషన్ యాభైవేలు ఫిక్స్చేసాం. నువ్వు ఎగ్రిమెంటు మీద సైన్ చెయ్యగానే పదివేలు అడ్వాన్సు యిస్తారు! అలాక్కాదూ అంటే రెండు పాతి కవేల చొప్పున ఇవ్వడానికి ప్రొడ్యూసర్ని ఒప్పించగలననే నమ్మకం నాకుంది! ఇవాళ ఏడవతారీఖు! బహుశా పదో తారీఖు ఉద యంగాని, పదకొండు ఉదయంగాని అందరం వూటీ వెళ్ళిపోయి అక్కడ సాంగ్స్తో పిక్చరు ఆరంభిస్తాం. అంతవ రకూ ఈ పిక్చరు తాలూకు స్క్రిప్టు వర్కంతా హోటల్ రాజహంసలో రూమ్ నెంబరు ట్రిబుల్ త్రీలో చేస్తున్నాను. నీ అంగీకారం ఎంతతొందరగా తెలియజేస్తే అంతమంచిది"

సుధీర్ ఎంత గంభీరంగా చెప్పాలని ప్రయత్నించినా అతని గొంతు గద్గదమ యిందన్న విషయం కిరణ్మయి గ్రహించక పోలేదు.

ఆమె యిచ్చే జవాబు గురించిగాని, మరో దాని గురించి గాని నిరీక్షించకుండా సుధీర్ గబగబా బైటకి వెళ్ళిపోయేడు!

కిరణ్మయి అక్కడున్న సిమెంటుగట్టుమీద కూలబడిపోయినట్టుగా కూర్చుండిపోయింది! మళ్లీ ఆమెను వెక్కిరిస్తున్నట్టుగా పాతప్రశ్న పగలబడి నవ్వింది.



"ఏమిటీ జీవితం?"

★ ★ ★

సరోజమ్మకి గుండెనొప్పి ఎక్కువయింది! బాధతో మెలికలు తిరిగిపోతోంది. నోటంట మాట కూడా రావడం కష్టంగానే వుంది! ఆటోలో డాక్టరుదగ్గరకి తీసుకువెళ్ళింది. ఆ డాక్టరుకి ఆమె పాత పేషెంట్ కాబట్టి, "మీకు ముందే చెప్పేనుగదండి, మీ అమ్మగారికి బైపాస్ సర్జరీ చేస్తే తప్ప బ్రతకడం కష్టమని! మీరు బాగా లేట్ చేసేసారు. యిప్పుడైనా మీరు ఆపరేషన్ చేయించడానికి రెడీ అయితే మంచిది. అటుపైన మీ యిష్టం" అనేశాడు డాక్టరు!

ఆపరేషనుకి డబ్బైయివేలయినా అవుతుందని, ముందుగా పాతికవేలు కడితే హాస్పిటల్లో ఎడ్మిట్ చెయ్యొచ్చని డాక్టరు గతంలో చెప్పిన మాట గుర్తుంది.

తల్లికి రాసిన మందులు కొనుక్కొచ్చి ఆమెకామందులు వేసి పడుకోబెట్టాక ఆమె ఆలోచనలో పడింది.

ప్రశ్నమీదప్రశ్న.

ఏం చెయ్యాలి?

ఇప్పుడీ ప్రపంచంలో తనకి తల్లి తప్ప మరో దిక్కెవరూలేరు. తమ్ముడంటూ ఒక మనిషి యీ ప్రపంచంలో వున్నా తనకి లేనట్టే.

తల్లి బ్రతకాలంటే డబ్బైయివేలు కావాలి.

ముందుగా పాతిక వేలు కావాలి.

సుధీర్ చెప్పినట్టు హీరోయిన్ పాత్రకి ఒప్పేసుకుంటే? పాతికవేలు అడ్వాన్సుగా యిప్పిస్తానన్నాడు.

వెళ్ళి, ఒప్పేసుకుంటే?

లేచి, నిలబడి, బట్టలు మార్చుకుందామా అనుకుంది. కానీ, అంతలోనే అగ్నివేష్ రేపే విదేశాల్నించి వచ్చేస్తున్నాడన్న విషయం గుర్తొచ్చింది. అతను రాగానే కొత్త పిక్చర్లు ఒప్పుకుంటాడు. ప్రొడ్యూసర్లంతా అతని కోసం ఎదురుచూస్తున్నారు కాబట్టి, అతను రాగానే గబగబా నాలుగు పిక్చర్లయినా స్టార్టయిపోతాయి. అందులో రెండు పిక్చర్స్‌లోనైనా తను హీరోయిన్‌గా బుక్కవుతుంది. పిక్చరుకి లక్షచొప్పున అడ్వాన్సు యిచ్చినా, రెండు లక్షలు... పోనీ, పిక్చరుకి యాభై వేలు చొప్పున ఇచ్చినా లక్ష... ఆపరేషన్ మొత్తం జరిగిపోతుంది. పోనీ, తక్కువలో తక్కువ అంచనా వేసుకున్నా, ఒక్క పిక్చర్లో హీరోయిన్ ఛేన్సు ఇప్పించినా యాభైవేలకి తక్కువ అడ్వాన్సు ఇవ్వరు! తన తల్లి ఆపరేషన్ విషయం చెప్తే మరో పాతికవేలు అగ్నివేష్ యిప్పించకపోడు! తనని కోరి పిల్చి హీరోయిన్ ఛాన్సులు ఇప్పిస్తానన్న హీరో, ఆ మాత్రం సాయం చెయ్యకపోతాడా? చేస్తాడు చేస్తాడు, తప్పకుండా చేస్తాడు!

ఇవాళ తారీఖు ఎనిమిది!

ఒక్క యిరవైనాలుగుగంటలు ఆగితే, తొమ్మిదో తారీఖు వచ్చేస్తుంది. అగ్నివేషూ వచ్చేస్తాడు.

"ఈలోగా మా అమ్మకేం ప్రమాదం జరగకుండా చూడు తండ్రీ" అంటూ గోడకి తగిలించిన వెంకటేశ్వరుడి కేలండర్ దగ్గరకెళ్ళి దండం పెట్టుకుంది! సాయంత్రమయింది, చీకటిపడింది. ఆలోచనల్తో నిద్రపట్టడం లేదు కిరణ్మయికి! తల్లికి ఏ అర్ధరాత్రి ఏ అవసరం వస్తుందోనని, ఆమె మంచం పక్కనే కూర్చుని కాలక్షేపం చేసింది. భళ్ళమంటూ తెల్లవారకపోయినా, బద్ధకంగానైనా తెల్లవారింది! తొమ్మిదో తారీఖు వచ్చేసింది.

నిద్రలేమివల్ల కళ్ళు మండుతున్నా, కాస్త ఒళ్ళు జోగుతున్నా తమాయించుకుంటూ, స్నానంచేసి, వున్నంతలో మంచి బట్టలు కట్టుకుంది. పక్కింటి వరలక్ష్మిని పిల్చి తన తల్లిని కాస్త చూస్తూ వుండమని, మరో గంటతర్వాత ఏ టేబ్లెట్ వెయ్యాలో చెప్పి అగ్నివేష్ ఇంటికి బయలుదేరింది.

★ ★ ★

అగ్నివేష్ బంగళా పెళ్ళిమంటపంలా కళ





కళలాడుతోంది. బంగళానిండా జనం, కాంపౌండునిండా జనం... ఆ జనంలో సగంమందికిపైగా దండలు పట్టుకునే వున్నారు. తనూ ఓ దండతెస్తే బావుణ్ననుకుంది గాని, అంతలోనే తన దగ్గరున్నవి యిరవైఏడు రూపాయిలేనన్న సంగతి గుర్తొచ్చింది. ఎంత చిన్నదండయినా పదిరూపాయలకి తక్కువుండదు. మరీ అంతచిన్న దండ వేయటం బాగోదు! ఓ మాదిరి దండ వెయ్యాలంటే పాతిక రూపాయలవుతుంది. అప్పుడు తన దగ్గర మిగిలేవి రెండురూపాయలు.

అగ్నివేష్ స్నానంచేసి పట్టుబట్టలతో ఇంట్లోనించి కాంపౌండ్‌లోకి వచ్చేడు. ప్రొడ్యూసర్లు, ఇతరులు పోటీపడుతున్నట్టుగా ఒకర్ని తోస్కుంటూ ఒకరు ముందుకు వెళ్ళి దండలు వేసి షేక్‌హేండ్సు ఇస్తున్నారు. అతను మెడలోని దండలు తీసి పక్కనున్నవాళ్ళకి అందిస్తుంటే, వాళ్ళు వాటిని ఓ మూలకి విసిరేస్తున్నారు. అతని కోసం దండలు తీసుకురానివాళ్ళలో కొంతమంది మూలన పారేస్తున్న దండల్ని తీసుకొచ్చి వాటిని తామే ప్రత్యేకంగా తీసుకొచ్చినట్టుగా అగ్నివేష్ మెడలో వేశారు. అంత రద్దీలో అగ్నివేష్ దగ్గరకి ఎలా వెళ్లాలో కిరణ్మయికి బోధపడలేదు. పోనీ, ఆ మూలనున్న దండల్లో ఒకటి తీసుకువెళ్ళి తనూ వేస్తే? తనూ అతన్ని అభినందించినట్టవుతుంది! కానీ... ఎందుకో, తనది కాని వస్తువుని తనదిగా భావించి, అతని మెప్పు పొందడానికి ఆమె మనసు అంగీకరించలేదు.

దండల సంరంభం కొంత తగ్గింది. అతను అక్కడున్న వారందరితో ఏవేవో మాట్లాడుతున్నాడు. ఇప్పుడు తను వెళ్తే ఏం బాగుంటుంది? రద్దీ తగ్గేక వెళ్దామనుకుని వరండాలో ఓ మూల నిల్చుంది. ఓ గంట

తర్వాత రద్దీ పూర్తిగా తగ్గకపోయినా, ఆయనకి ముఖ్యులనిపించుకున్న ఓ పాతిక ముప్పై మందిదాకా మాత్రం వున్నారు. ఇప్పుడు వెళ్తే బావుంటుందేమోననిపించి, వెళ్లబోయిందిగాని అతను ఆ గుంపుతో కలిసి, బంగళాలోకి నడిచాడు. ఏం చెయ్యాలో అర్థంకాక ఆగిపోయింది. గుమ్మం బయట ఓ దర్వాన్ కాపలా వున్నాడు. అయిదు నిమిషాలు, పదీ, పావు గంట, గంట గడిచింది. ఎవరూ బైటకి రావడంలేదు, ఎవరూ లోపలకి వెళ్లడంలేదు. వాచ్‌మన్ దగ్గరకెళ్ళి "సార్‌తో నేను రెండంటే రెండే నిమిషాలు మాట్లాడేసి వచ్చేస్తాను" అంది ఎంతో ప్రాధేయపడుతూ. వాచ్‌మెన్ ఆమెను సీరియస్‌గా చూసి "సార్ పెద్దపెద్ద డిస్ట్రిబ్యూటర్లు, ప్రొడ్యూసర్లతో మందు కొడతావుంటే, నువ్వు లోపలకి పోతానంటావా? వెళ్లెళ్లు" అంటూ కసిరాడు.

"పోనీ కాస్సేపు వెయిట్‌చేస్తాను"

"నీయిష్టం ఆ మూలకి పోయి కూకో"

అగ్నివేష్, ఆ పెద్దమనుషుల్ని సాగనంపడానికైనా బయటికి రాకపోతాడా, అప్పుడు కల్సుకుందామనే ఆశతో వరండాలో ఓ మూలన చిన్న బల్లమీద కూర్చుంది. మధ్యాహ్నం రెండు దాటేక పెద్దమనుషులు ఒక్కొక్కరు నిషామూడ్‌లో బయటకొచ్చి వాళ్ళ కారుల్లో వెళ్లిపోయేరు తప్ప అగ్నివేష్ మాత్రం బయటకిరాలేదు! అతను వస్తాడో రాడో! నిన్న రాత్రంతా నిద్రలేదు, ఉదయం టిఫిన్ తినకుండా వచ్చేసింది. కడుపులో ఆకలి కరకరమంటోంది. నాలుగ్గంటలవుతోంది, యింకా ఒకరిద్దరు పెద్దలు లోపలున్నట్టుంది. కిరణ్మయికి ఓ ఆలోచన వచ్చి, చిన్న కాగితంమీద తనపేరురాసి, ఆర్టిస్టు అని కింద రాసి, వాచ్‌మేన్‌కిచ్చింది. దాంతోపాటు ఓ అయిదు రూపాయిలనోటు కూడా యిచ్చింది. "సార్, గుస్సవుతారు" అన్నాడు అయిదు నోటు వంక చూస్తూ! మరో అయిదు యిచ్చింది. "సరి, నీ అదృష్టమెట్లవుందో" అంటూ లోపలకెళ్ళి రెండునిమిషాలతర్వాతొచ్చి "రేపు పొద్దుట తొమ్మిదిగంటలకి రమ్మంద్రు" అన్నాడు. ఆమెకు అగ్నివేష్‌తో కలిసి, మాట్లాడినంత ఆనందం కలిగింది. ఆ ఆనందంతోనే యింటికి బయలుదేరింది. ఇంటికి చేరేక తన తల్లి మరో రెండుసార్లు వూపిరాడక యిబ్బందిపడిందని, ఆమె చెప్పిన టేబ్లెట్ వేసాక, కాస్త స్థిమితపడిందని పక్కింటి వరలక్ష్మి చెప్పింది. "మా అమ్మకీ బాధ యింకెంతో కాలం వుండదు. యింకొక్క రోజు అంతే" అంది కిరణ్మయి.

  

మర్నాడు

అంటే, పదవ తారీఖు.

సరోజమ్మకి ఆయాసం మరింత ఎక్కువయింది. ఆమెను వదలి బైటకి వెళ్లాలనిపించడంలేదు. అయినా తప్పదు. పక్కింటి వరలక్ష్మితో తన తల్లిని చూస్కోమని చెప్పింది. ఆమె ఒప్పుకుంటూనే మరోలా అంది "మీ అమ్మని చూడ్డానికి నాకేం అభ్యంతరం లేదుగాని... మీ అమ్మంటే, మా అమ్మలాంటిది కాదేటిగాని... ఆవిడ పరిస్థితి చూస్తుంటే నాకే భయమేస్తోంది. ఇలాంటప్పుడు నువ్వు దగ్గరుండి కనిపెట్టుకునుంటే మంచిదిగదా... యిలా అన్నానని ఏమీ అనుకోకు"

అనుకోడానికేం వుంది? ఆమె అన్న ప్రతీ మాటా నిజమే! కానీ, తనిప్పుడు తల్లిని వదిలివెళ్తున్నదీ తల్లి ప్రాణాలు కాపాడుకోడానికేనన్న విషయం వరలక్ష్మికెలా చెప్పడం? చెప్పాలన్నా టైము లేదు. అప్పటికే పావు తక్కువ ఎనిమిదయిపోయింది. అగ్నివేష్ ఇంటికి హడావిడిగా బయలుదేరింది.

అగ్నివేష్ బంగళా పోర్టికోలో నిన్నంత సంరంభం, రద్దీ లేక ఓ పాతికమంది సినిమా ప్రముఖులతో హడావిడిగా వుంది.





ఒకాయన్ని అడిగితే "వస్తారొస్తారు వెయిట్ చెయ్" అన్నాడు. తొమ్మిది గంటలకల్లా ఆయన మేకప్‌తో బయటకొచ్చేడు. ప్రముఖులు కొంతమంది ఆయన దగ్గరగా వెళ్ళి మాట్లాడుతున్నా, కిరణ్మయి యింక ఆగదల్చుకోలేదు. గబగబా ముందుకు చొచ్చుకెళ్ళి.

"నమస్తే సార్" అంది రెండు చేతులూ జోడించి.

ఎవరు? అన్నట్టుగా చూసాడు అగ్నివేష్!

"నేను సార్... కిరణ్మయిని... ఆర్టిస్టుని"

"కిరణ్మయి... అంటే నిన్నసాయంత్రం వాచ్‌మేన్‌చేత చీటీ పంపించిన అమ్మాయి"

అగ్నివేష్ అలా అనడంతో కిరణ్మయి ఖంగుతిన్నది. కిరణ్మయి అంటే, నిన్న చీటీ పంపించిన అమ్మాయనా అతనికి జ్ఞాపకం వున్నది?

"యస్సార్... మీరు నాకు హీరోయిన్ వేషం యిప్పిస్తానని ప్రామిస్ చేసారుగదండి... ఆ ఆర్టిస్టుని"

కిరణ్మయి సాహసంచేసి ఆ మాటన్నాక, అగ్నివేష్ పక్కనున్న ఒకాయన, అతని చెవిలో రెండు వాక్యాలు ఏవో గొణిగాడు! అగ్నివేష్ వెంటనే గుర్తుతెచ్చుకున్నట్టుగా కిరణ్మయిని చూసి "ఓహ్... నువ్వు ఆ కిరణ్మయివా? మరాసంగతి చెప్పవేం" అంటూ అందర్నీ కాస్త దూరంగా వెళ్లమన్నట్టుగా తలతోనే సౌంజ్ఞచేశాడు. అందరూ దూరంగా వెళ్ళారు. అతనేం చెప్తాడోనని ఆమె గుండె గుబగుబలాడుతున్నా, అగ్నివేష్‌కి తను గుర్తున్నానన్న విషయం ఆమెకు ఆనందం కలిగించింది.

"చూడమ్మాయ్, నా పక్కన నీకు హీరోయిన్ వేషం ఇస్తానన్నాను. ఇస్తాను కూడా"

"సార్..."

"కానీ... నేను నీకు ప్రామిస్ చేసిన నాటి పరిస్థితులకి, ఇప్పటికి చాలా తేడావచ్చింది"

"సార్"

"నా పిక్చర్లు మొన్న కాస్త అటూఇటూ అవడం, పైగా ఎలక్షన్‌లో కూడా నాకు అన్యాయం జరగడం..."

"నాకు తెలుస్సార్"

"ఆ తర్వాత నేను ఫారిన్ కంట్రీస్‌వెళ్ళి నిన్ననేరావడం..."

"తెలుస్సార్"

"ఇవన్నీ నీకు తెల్సు! కానీ, నీకు తెలియని విషయం ఒకటుంది. నీకే కాదు నాకూ తెలియకుండానే జరిగిపోయింది"

"ఏమిట్సార్?"

"నేను మా ప్రొడ్యూసర్స్‌కిచ్చిన కాల్‌షీట్సన్నీ కేన్సిల్ చేస్కుని గదా ఫారిన్ వెళ్లేను. హీరోగా అది నేను వాళ్ళకి ముందుగా చెప్పి చెయ్యాలి, కానీ అప్పటి పరిస్థితుల్లో నా మనసు బాగులేక అలా చేసేను. అంచేత తిరిగొచ్చాక, వాళ్ళు చెప్పిన ప్రకారం చెయ్యాల్సిన నైతికబాధ్యత నాకుంది గదా"

"యస్సార్"

"నేనిప్పుడు ఒకేసారి నాలుగు పిక్చర్సులో నటించాల్సొచ్చింది. ఎందుకంటే, నావల్ల నష్టపోయిన ప్రొడ్యూసర్సు, ఎవరికి వారే మా సెక్రట్రీని అడిగి నేను తిరిగొచ్చాక ఈ డేట్లు మావి, ఈడేట్లు మావీ అని నా డేట్లన్నీ పంచేసుకున్నారు.

"యస్సార్"

"స్క్రిప్టులు కూడా రెడీ చేసేస్కున్నారు.

"యస్సార్"

"సైడ్ కేస్టింగ్ తాలూకా కాల్‌షీట్సు కూడా తీసేస్కున్నారు"

"యస్సార్"

"అంతేగాదు. నాలుగు పిక్చర్సులోను హీరోయిన్స్‌ని కూడా బుక్‌చేసేస్కున్నారు"

కిరణ్మయి నెత్తిన పిడుగుపడినట్టయింది.

"అంచేత అయామ్ సారీ... ఈ నాలుగు పిక్చర్లకీ నేనేమీ చెయ్యలేను"

కిరణ్మయికి నాలికమీద తడి ఆరిపోతున్నట్టనిపించినా, బలవంతాన శక్తి తెచ్చు



కుంటూ.

"హీరోయిన్ వేషమే కాదు సార్... ఏ వేషమైనా వేస్తాను" అంది

"నోనోనో... నేను నిన్ను హీరోయిన్ని చేస్తానని ఒకసారి ప్రామిస్ చేశాక, నిన్ను హీరోయిన్‌గానే పరిచయం చేస్తానుగాని, మరో చిన్నవేషం ఏదో యిచ్చి నన్ను నేను ఇన్సల్ట్ చేస్కోలేనే. నీకు హీరోయిన్ వేషం యిప్పించలేకపోయేనని ఆ మనోహర్‌గాడి చేత వేళాకోళం చేయించుకోలేనే... నిన్ను ఎప్పటికైనా హీరోయిన్ని నేనే చేస్తాను..."

"అది కాదు సార్..."

"ఏమిటో గబగబా చెప్పు టైమవుతోంది"

"మీరు హీరోయిన్ వేషం యిచ్చేవరకు మీరు నన్ను జూనియర్ ఆర్టిస్టు వేషాలు గాని, చిన్న వేషాలుగాని వెయ్యొద్దన్నారు. మానేసాను. నాటకాలొచ్చినా, టీ.వీ. సీరియల్సు వచ్చినా, చివరికో సినిమాలో హీరోయిన్ వేషం కూడా వచ్చింది సార్... అదీ వదులుకున్నాను"

కిరణ్మయి ఆవేదనగా, తొందరతొందరగా చెప్పుకుపోతుంటే, అతను ముఖంచిట్లించి, కాస్త చిరాగ్గా అన్నాడు.

"తప్పవు కిరణ్మయీ కొన్ని త్యాగాలు తప్పవు. అసలు నన్నడిగితే, ప్రతీ మనిషికీ ఏదో ఓ సందర్భంలో ఏదో ఒక త్యాగం చెయ్యక తప్పదనుకో! ఉదాహరణకి నన్నే తీస్కో! పేరిస్ చూద్దామని ఎన్నాళ్లనించో అనుకుంటున్నాను. మొన్న మూడునెల్ల పాటు చాలా దేశాలు తిరిగినా, పేరిస్ మాత్రం చూళ్లేకపోయేను. మరి, నా బాధ ఎవరికి చెప్పుకోను? మళ్ళీ నేను విదేశాలు వెళ్తానో వెళ్లనో... వెళ్ళినా పేరిసే చూస్తానో చూడలేనో... ప్రస్తుతానికి నేను పేరిస్‌ని చూడాలనుకునే కోరికని త్యాగం చేసేసినట్టేగా... జస్ట్ ఓ ఆరునెలలు వెయిట్ చెయ్, మధ్యలో నువ్వేం రానక్కర్లేదు... నేనే కారు పంపించి పిలిపిస్తాను" అంటూనే వెళ్ళి కారెక్కాడు.

అగ్నివేష్ తల వూపడంతో దూరంగా వున్న వాళ్ళు దగ్గరగా వచ్చేసి ఎవరి కార్లు వారు ఎక్కిపోయేరు. అగ్నివేష్ కారు వెంట మిగతా కార్లు బయలుదేరిపోయేయి.

ఆ విశాలమైన పోర్టికోలో కిరణ్మయి ఒక్కతే ఒంటరిగా నిలబడిపోయింది.

అగ్నివేష్ వాగ్దానం చేసిందేవిటి?

ఇప్పుడు చెప్పిందేమిటి?

అతను తన వాగ్దానాన్ని నిలబెట్టుకుంటాడన్న నమ్మకంతో, ఈ ఆరునెల్లు పోగొట్టుకున్నదేవిటి?

ఆమె హృదయ కవాటాల్ని భళ్ళున తెరుచుకుంటూ దుఃఖం పొంగుకొచ్చింది. భోరుమంటూ ఏడవబోయింది. కానీ అంతలోనే తమాయించుకుంది.

తనిప్పుడు ఆలోచించవలసింది, తను ఏం పోగొట్టుకున్నానని కాదు.

తనిప్పుడు చెయ్యాల్సిందేమిటి?

తన తల్లికి ఆపరేషన్ జరగాలి!

ఇవాళ తారీఖు పది. సుధీర్ హోటల్ రాజహంసలో యివాళ్టివరకు వుంటానన్నాడు! హీరోయిన్‌గా ఒప్పుకుంటే, పాతికవేలయినా అడ్వాన్సు యిప్పిస్తానన్నాడు.

గబగబా గేటు బయటికి నడిచింది. అక్కడకి బస్‌స్టాప్ చాలా దూరం. అయినా నడుచుకుంటూ వెళ్తూ పర్సులో వున్న డబ్బులు చూసుకుంది. పన్నెండు రూపాయల యిరవై పైసలున్నాయి. డబ్బుల్తోపాటు ఓ చీటీ కూడా చేతికొచ్చింది. అది గోపీచంద్ వుండే హోటల్ నెంబర్ను...

నడుస్తున్న ఆమె కాళ్లు ఆగిపోయేయి.

నిన్నరాత్రి గోపీచంద్ ఎందుకో గుర్తుకొచ్చి అతనిచ్చిన ఫోన్ నెంబర్ని ఓ కాగితంమీద రాసి పర్సులో పెట్టుకుంది! దారంట ఎవరూ నడవడంలేదు. గోపీచంద్‌కి ఫోన్‌చేస్తే? అదృష్టం కొద్దీ అతను హైదరాబాద్‌లో వున్నాడా తన అవసరాలన్నీ తీరిపోతాయి!

ఒకవేళ అతను ఈ వూళ్లోని ఏ హోట




ల్లోనూ లేకపోతే? సుధీర్ దగ్గరకెళ్ళి హీరోయిన్ వేషం వేసి, ఆ డబ్బుతో అమ్మకి ఆపరేషన్ చేయించేసి, ఆ సినిమా పూర్తవగానే గోపీచంద్‌కి అంగీకారం తెలియజేసి అతని ఇల్లాలిగా జీవితంలో సెటిల్ అయిపోవచ్చు.

కాస్తదూరంలో ఓ టెలీఫోన్ బూత్ కనిపించింది. గబగబా అక్కడకి వెళ్ళి ఓ హోటల్‌కి డయల్‌చేసి గోపీచంద్‌గారున్నారా? అని అడిగింది. "లేదు మేడమ్, ఆయన మా హోటల్లో దిగలేదు" అని రిప్లయ్ వచ్చింది.

చేతిలో వున్న పన్నెండు రూపాయిల్లో రెండు రూపాయలు అయిపోయేయి! మిగిలినవి పది రూపాయలు!

మరో హోటలు, మరో హోటలు, మరో హోటలు... మూడు హోటల్సులోనూ గోపీచంద్ మా హోటల్‌కి రాలేదనే జవాబొచ్చింది!

మూడురెళ్ళు ఆర్రూపాయలు! పది రూపాయల్లోనూ, ఈ ఫోన్ కాల్సుకయిన ఆర్రూపాయలు పోను మిగిలింది నాలుగు రూపాయలు. దానిమీద మరొక యిరవై పైసల బిళ్ళ! సుధీర్ చెప్పిన హోటల్ వూరికి చాలా దూరంగా వుంది. ఇక్కణ్ణించి అక్కడికి బస్సు టిక్కెట్టు మూడున్నర, నాలుగు రూపాయలమధ్య వుంటుంది.

అయినా ఫర్వాలేదు, సుధీర్ వుంటే పాతిక వేలు చేతికందుతాయి. బస్‌స్టాపు కొచ్చింది. ఓ గంటతర్వాత ఆమె వెళ్ళాల్సిన బస్సు వచ్చింది! బస్సు ఎక్కి కూర్చుంది.

'ఒకవేళ అక్కడ సుధీర్ లేకపోతే?'

ఈ సందేహం ఆమెలో భయాన్ని పుట్టించింది. బస్సు కండక్టరు అప్పుడే మూడురూపాయల డబ్భైయి అయిదు పైసలు తీస్కుని టిక్కెట్టు యిచ్చేసాడు.

ఇప్పుడు తన దగ్గర మిగిలింది నలభై అయిదు పైసలు! కేవలం నలభై అయిదు పైసలు.

సుధీర్ అక్కడ ఏ కారణం చేతనయినా లేకపోతే, అక్కణ్ణించి తను ఇంటికి తిరిగి రావడానిక్కూడా డబ్బులుండవు... అంతలోనే తనకి తానే ధైర్యం చెప్పుకుంది. సుధీర్ ఎందుకుండడు? తప్పకుండా వుంటాడు! అతనేం అబద్ధాలు చెప్పే మనిషి కాదు.



హోటల్ రాజహంస వూరికి దూరంగా వుండడమే కాకుండా, ఎప్పుడో పురాతన కాలంలో కట్టిన బిల్డింగులా ఆకర్షణ రహితంగా వుంది. చుట్టూ చెట్లు, మనుషులు తిరుగాడని ప్రశాంతత... సిటీలో అన్ని హోటల్సుండగా సుధీర్ యీ హోటల్లోనే ఎందుకున్నాడు చెప్మా? బహుశా, స్క్రిప్టు రాస్కోడానికి ప్రశాంతత వుంటుందని దీన్ని సెలక్టు చేసుకుని వుంటాడు అని సమాధానం చెప్పుకుంటూనే కిరణ్మయి హోటల్లోకి అడుగుపెట్టింది. సుధీర్ ట్రిబుల్ త్రీరూమ్‌లో వుంటున్నానని చెప్పిన విషయం ఆమెకు గుర్తుండడంవల్ల రిసెప్షన్‌లో వున్న ముసలి రిసెప్షనిస్టుని ఏమీ ఎంక్వయిరీ చెయ్యకుండానే, మెట్లుఎక్కి తర్డుఫ్లోరుకి వెళ్ళింది. ఆమె వెళ్తుంటే కౌంటర్లో వున్న ముసలి గుమస్తా, "అబ్బో మాంచివాటంగా వుందే" అనుకుంటూ హుషారుగా భుజాలు ఎగురవేసాడు.

రూమ్ నెంబర్ ట్రిబుల్ త్రీ.

కిరణ్మయి కాలింగ్ బెల్ నొక్కింది. "యస్ కమిన్" అనే మగగొంతు బిగ్గరగా వినిపించి తలుపు తోసుకుని లోపలకెళ్ళింది.

మంచం మీద కూర్చుని మందు తాగుతున్న వ్యక్తిని చూసి- అతనెవరో క్షణాల మీద గుర్తుకు తెచ్చుకుంది.

అతను దయానంద. మద్రాసులో తనకి వేషం యివ్వడానికి లక్ష రూపాయలు అడిగిన ప్రొడ్యూసర్ కొడుకు! కిరణ్మయి తనతో

ఒక రోజంతా గడిపితే, ఆమె లక్ష రూపా యలు యివ్వక్కర్లేదు. నేనే తిరిగి పాతిక వేలు యిస్తానని ఒకప్పుడు వరదరాజులు చేత కబురు చేయించిన వ్యక్తి.

అతనిక్కడెందుకున్నాడు?

అది కాదు ప్రశ్న! సుధీర్ చెప్పిన రూమ్‌లో యితనెందుకున్నాడు. తనేమీ రాంగ్‌నెంబర్ రూమ్‌లోకి రాలేదుగదా అని కంగారుపడింది.

ఆమెను చూస్తూనే చినబాబు మొదట ఆశ్చర్యపోయేడు! తర్వాత సంబరపడిపో యేడు. తర్వాత నవ్వేడు.

"యాదగిరిగాడు నాలుగువందలు అడ్వాన్సు పట్టుకెళ్ళి, ఓ డైమండ్ రాణీని పట్టుకొస్తానని చెప్తే, ఎవరో డొక్కుముండని తెచ్చి డైమండ్ రాణీ అని డైలాగులు చెప్తా డనుకున్నానుగాని ఏకంగా నిన్నే పంపి స్తాడనుకోలేదు. అలా నిలబడిపోయేవేం కూర్చో" అన్నాడు.

ఆమె మనసులోని ఆందోళన ఆమెను కూర్చోనివ్వలేదు.

"సుధీర్ ఎక్కడ? " సూటిగా అడిగింది.

"సుధీర్ ఎవడు? "

"కొత్త సినిమా డైరెక్టరు ఈ గదిలోనే వుంటానన్నాడు"

"ఏమో! ఈ గదిలో ఎవడో వుండేవాడట! నిన్న రాత్రే వూటీ వెళ్ళిపోయేడట! నేనివాళ పొద్దుటే ఈ గదిలో దిగేను. అయితే నువ్వు కొత్తడైరెక్టర్ల కోసం నీ పాతివ్రత్యాన్ని వదిలే సావన్నమాట"

కిరణ్మయికి ఆ మాటలు అసహ్యంగా తోచేయి. దేవుడి గుడికొచ్చి దెయ్యం బొమ్మని చూస్తున్నట్టుగా ఆశ్చర్యపడుతోంది!

"నేనిక్కడ కనిపించడం నీకు షాక్ యిచ్చే సిందా? సినిమాలిప్పుడు ఈ వూళ్ళో తీస్తు న్నారు కాబట్టి, ఇక్కడ వుంటున్నాను. ఎవ రైనా నీలాంటి లపాకీల్తో షూటింగ్ ప్రోగ్రాం పెట్టుకున్నప్పుడు, అప్పుడప్పుడు యిలాంటి హోటల్సులో దిగుతుంటాను. ఆనాడే మద్రా సులో నువ్వు పతివ్రత కబుర్లు చెప్పకుండా వుండుంటే, ఈపాటికి నువ్వు మూడు సిని మాల్లో హీరోయిన్ వేషాలు వేసుండేదానివి! దేనికైనా టైమురావాలి. యిప్పటికి నీ అంతట నువ్వుగా నా గదికొచ్చేవు! హీరో యిన్ సంగతలాగుంచు, ఇప్పుడు సంగ తేంటో చెప్పు" అంటూ ఆమె భుజంమీద చెయ్యివేసాడు. ఆమె చిరాగ్గా ఆ చెయ్యిని తొలగించింది.

"ఉత్తినే కాదులే! యాదగిరిగాడితో అయి దువేలుకి కుదుర్చు అన్నానుగాని, నువ్వు నాడ్రీమ్‌గర్ల్‌వి కదా, పదివేలు యిస్తాను. రావే" అంటూ ఆమెను మంచంమీదకి లాగ బోయేడు. అతన్ని "బాస్టర్డ్" అని తిడుతూ, బలంగా మంచంమీదకి తోసేసి, గదిలో నించి బైటకి వెళ్ళబోయింది.

ఎదురుగా వున్న మనుషుల్ని చూసి షాక్ అయింది!

వాళ్ళు పోలీసులు!

"ఈ హోటల్లో పట్టపగలు వ్యభిచారం జరుగుతోందని తెలిసి మేం రెయిడింగ్ కొచ్చేం. యూ ఆర్ అండర్ అరెస్ట్" అంటూ పోలీసు యస్సై పోలీసు భాషలో తన అధి కారాన్ని ప్రదర్శించాడు.

అనుకోని ఈ పరిణామాన్ని కిరణ్మయి తట్టుకోలేకపోయింది. "నో సార్... నేను వ్యభిచారిని కాదు, యిక్కడకి నేనందుకు రాలేదు" అంటూ తను చెప్పవలసిందంతా చెప్పింది. అందులో ఆ ఇనస్పెక్టరు తన మైండులో నోట్ చేసుకున్నవి రెండేరెండు. ఒకటి, కిరణ్మయి సినిమాజాతికి చెందిన మనిషే! ఒకప్పుడు జూనియర్ ఆర్టిస్టునని కూడా ఒప్పుకుంది. చాలామంది జూనియర్ ఆర్టిస్టులు సైడ్ బిజినెస్ కింద వ్యభిచారం కూడా చేస్తుంటారు కాబట్టి, పోలీసుల దృష్టిలో జూనియర్ ఆర్టిస్టు అనగానే అది వ్యభిచారే అనే నమ్మకం వుంది గాబట్టి, ఆవిడిప్పుడు వ్యభిచారానికొచ్చిందన్న పాయింటే నిజం తప్ప, ఆమె చెప్పిన





మిగతా కథంతా గేస్ అనే భావించారు. అదీగాక, చినబాబు అనబడే, యీ ప్రొడ్యూసరు యిదే ఇనస్పెక్టరుకి నెలరోజుల కిందట కూడా, పగటిపూటే ఓ అమ్మాయితో దొరికిపోయి, మూడు వేలు యిచ్చి పోలీసుల వెంట వెళ్ళకుండా తప్పించుకున్నాడు. వ్యభిచారానికి రాత్రికంటే పగలే సేఫ్ అనే, అతనిగారి సిద్ధాంతాన్ని అబద్ధం చేస్తూ యిదే ఇనస్పెక్టరు రైడ్ చేయడంవల్ల మళ్ళీ దొరికిపోయేడు. ఇనస్పెక్టరు కాబట్టి రైడ్ చేసే సమయంలో చెప్పవలసిన పోలీసు డైలాగులు చెప్తున్నాడే తప్ప, ఈసారి ఈ చినబాబుగాణ్ణించి ఎంత ఎక్కువ గుంజొచ్చా? అనే ఆలోచిస్తున్నాడు. ఇనస్పెక్టర్ని పక్కకి తీసుకెళ్ళి చినబాబు అయిదు వేల నోట్లకట్ట జేబులో పెట్టేడు.

అంత డబ్బు పుచ్చుకున్నందుకు కృతజ్ఞతగా, "దీని సంగతేం చెయ్యమంటారు. మీరు దాంతో. కేరీ ఆన్ అయిపోతారా? " అన్నాడు మెల్లగా ఇనస్పెక్టరు. చినబాబు రెండుక్షణాలపాటు ఆలోచించాడు. "కిరణ్మయికి పెంకితనం యింకా పోలేదు. ఇప్పుడు కూడా తనని ఖాతరు చెయ్యడంలేదు. తనని ఖాతరు చెయ్యని ఆడదానికి తన ప్రతాపమేమిటో నిరూపించాలి. దానిమీద యింతవరకు వ్యభిచారి అని ఎవడూ ముద్ర వేసినట్టులేదు. అంచేత ఆ పుణ్యమేదో తనే కట్టుకోవచ్చు" ఈవిధంగా శాడిజమ్‌తో ఆలోచించి "అక్కర్లేదు. తీసుకుపోండి" అన్నాడు ఇనస్పెక్టరుతో. కిరణ్మయి తాను వ్యభిచారానికి రాలేదని ఎంత మొరపెట్టుకున్నా ఇనస్పెక్టరు వినలేదు. "నోరుముయ్, నువ్వు చేసే వృత్తేమిటో నీ నోటితో నువ్వే చెప్పేవు. నీ హంగులూ పొంగులూ అన్నీ నా కళ్లతో నేనే చూస్తున్నాను. వ్యభిచారానిక్కాకపోతే, యింత దూరంలో వున్న లాడ్జీకి దేశపరిస్థితుల గురించి మాట్లాడ్డానికొచ్చేవటే దొంగలమ్డీ" అంటూ ఫెడీ ఫెడీమంటూ రెండు లెంపకాయలు కొట్టేడు.

ఆరోజంతా పోలీస్ స్టేషన్లోనే వుంది కిరణ్మయి. మరేదో లాడ్జీలో దొరికారంటూ మరో యిద్దరు స్త్రీలన్ని కూడా తెచ్చి అదే సెల్‌లో వేసారు. కిరణ్మయికంతా అయోమయంగాను, అగమ్యగోచరంగానూ వుంది. తన జీవితం తనకి తెలియకుండానే ఎందుకిన్ని మలుపులు తిరిగి పోతోంది? తను పస్తులతో బాధపడింది. తన ఆశలు ఆశయాలు తీరినట్టే తీరి, చేతికి అందింది నోటికి అందనప్పుడూ బాధపడింది! ఇంకా చాలాసార్లు చాలాసార్లు... అసలు తన జీవితంలో అన్నీ బాధపెట్టే సంఘటనలు తప్ప మనసుకింత ఆనందాన్ని కలిగించిన సంఘటన ఏ ఒక్కటి జరిగిందిగనక! అలా అన్ని బాధలూ ఒక ఎత్తు, యిప్పుడు వ్యభిచారిగా పోలీసులకి దొరికిపోవడం ఒక ఎత్తు! పోలీసుల గురించి, వాళ్ళకి దొరికిపోయిన నేరస్థుల్ని వాళ్ళు చిత్రహింసలు పెట్టడం గురించి విన్నప్పుడే తన ఒళ్ళు జలదరించేది. అలాంటివన్నీ యిప్పుడు తనకీ జరుగుతాయా? ఈ భయంతోనే ఆమె రాత్రంతా గడిపింది కానీ దురదృష్టంలో అదృష్టం అన్నట్టు అలాంటి బాధలేవీ ఆమెకు కలగలేదు. ఇప్పుడు మళ్ళీ ఆమె కళ్ళముందు పాతప్రశ్న కదలాడింది.

"ఏమిటీ జీవితం? "




మర్నాడు కోర్టుకి తీసుకువెళ్లారు. రైడింగులో దొరికిన పన్నెండు మంది అమ్మాయి

ల్తోపాటు తననీ నిలబెట్టేరు. ఒక్కొక్కర్ని పిలిచి, నువ్వు నేరం చేసావా? అని జడ్జీ గారు అడుగుతున్నారు. కిరణ్మయి ఆ దృశ్యాన్ని కళ్లతో చూస్తోందిగాని, మనసు మాత్రం ఏదో ఏదో ఆలోచిస్తోంది. ఓ సినిమాలో తను పోలీసులకి దొరికిపోయిన బ్రోతల్ అమ్మాయి వేషం వేసింది. పోలీసులు తన జుట్టుపట్టుకు లాక్కెళ్ళి వేన్ ఎక్కించడం వరకే ఆసీన్ నడిచింది. అలా లాక్కొచ్చిన బ్రోతల్సుని ఎలా విచారిస్తారో, ఎలా శిక్ష విధిస్తారో తన కప్పుడు తెలియదు. ఇప్పుడే చూస్తోంది.

బ్రోతలమ్మాయిల్లో ఏడుగురుకి విచారణ అయిపోయింది. అందరూ నేరం చేశామనే ఒప్పుకుంటున్నారు. జడ్జి ఒక్కొక్కరికి వెయ్యి రూపాయల జరిమానా విధిస్తున్నారు. నేరం చెయ్యలేదని ఎవరూ అనడంలేదు. అందుకే, జరిమానా విధిస్తున్నారు. కానీ తను నేరం చెయ్యలేదు కదా! అలాగని తను వాదిస్తే? తను నిర్దోషినని తేలుతుందా? తనకి జరిమానా పడకుండా వుంటుందా? ఈ ప్రశ్నలకి జవాబు దొరక్కముందే ఆమె పేరుని పిలవడం జరిగింది. 'బోనులో నిలబడు' అంటూ పక్కనున్న పోలీసు హెచ్చరించాడు. ఆమె బోనులో నిలబడింది.

"నువ్వు నేరం చేశావా?" జడ్జి అడిగారు.

"చెయ్యలేదుసార్... పోలీసులు నన్ను అన్యాయంగా పట్టుకున్నారు"

"నువ్వు నేరం చెయ్యకపోతే బ్రోతల్ హౌస్‌లో ఎందుకు దొరికావ్?" కిరణ్మయి ఆ అభియోగానికి ఆశ్చర్యపోయినా వెంటనే జవాబు యిచ్చింది.

"నేను ఏ బ్రోతల్ హౌస్‌లోనూ దొరకలేదు సార్. నన్ను పోలీసులు హోటల్ రాజహంసలో పట్టుకున్నారు"

"అక్కడకెందుకెళ్లావ్?"

పబ్లిక్ ప్రాసిక్యూటర్ లేచి, "ఈవిడ తరచుగా రాజహంస హోటల్‌కెళ్ళి బిజినెస్ చెయ్యడం అలవాటు యువరానర్! పోలీసులు గఫార్‌ఖాన్ బ్రోతల్ హౌస్‌మీద రైడ్ చేసే టైముకి ఈవిడ విపరీతంగా తాగి వుంది. ఒంటిమీద స్పృహలేదు. శరీరం మీద బట్టలేదు... ఆస్థితిలో అరెస్టయిన మనిషికి తను ఎక్కడ అరెస్టు అయిందీ ఏం తెలుస్తుంది?" అన్నాడు.

పబ్లిక్ ప్రాసిక్యూటర్ వెంకటేశ్వర్రావుకి ఇలాంటి బ్రోతల్ కేసులు కొట్టిన పిండికిందే లెక్క! నిల్చున్న పళాన ఆశువుగా ఎన్ని అబద్ధాలయినా ఆడెయ్యగల సమర్థుడు! పి.పి. చెప్పిందంతా అబద్ధమని, పోలీసులు చేసింది అన్యాయమని కిరణ్మయి గొంతు చించుకుని అరిచింది, వాదించింది, మొత్తుకుంది, మొరపెట్టుకుంది. అయినా ప్రయోజనంలేకపోయింది. లేకపోగా-

ఆమెకు పదిహేను వందలు జరిమానా విధించారు. జరీమానా కట్టకపోతే అయిదు రోజులు జైల్లో వుండాలని ఆదేశించారు!

కిరణ్మయి మెదడు దిమ్మెక్కిపోయింది.

తన దగ్గరున్నవి నలభై అయిదు పైసలు! ఆ మనీపర్సుకూడా యిప్పుడెక్కడుందో తెలీదు.

పదిహేను వందలు జరీమానా!

నేరం చేసినవాళ్ళకి వెయ్యిరూపాయిలు...

ఏ నేరం చెయ్యని తనకి పదిహేనువందలు... లేదంటే అయిదు రోజులు జైలు శిక్ష!

తను నేరం చెయ్యకుండా జరీమానా ఎందుకు కట్టాలనే ప్రశ్నలేదిప్పుడు! తనో వ్యభిచారినని ప్రభుత్వమే ముద్రవేసింది!

పదిహేనువందలు ఎలా కట్టాలి?

కట్టలేదు!

కాబట్టి-

కిరణ్మయికి అయిదు రోజులు జెయిలు శిక్షే ఖరారయింది.

ఈ అయిదురోజులు జెయిల్లో ఆమె ఏం చేసినా, అనుక్షణం ఆమె ఆలోచిస్తున్నది





తన తల్లి గురించే! అలా, ఆలోచిస్తున్నప్పుడల్లా ఆమెకు ఎదురయ్యే పాత ప్రశ్న ఒక్కటే!

ఏమిటీ జీవితం?

★ ★ ★

కిరణ్మయి జెయిలునించి విడుదలయింది!

తను యింటినించి దూరమై ఇవాల్టికి ఏడువరోజు! తన తల్లి పరిస్థితి ఎలా వుందోనన్న ఆత్రమే ఆమెనడుస్తున్న నడకని పరుగుగా మార్చింది! తల్లిని తీసుకుని విశాఖపట్నం వెళ్ళిపోయి గోపీచంద్ సాయంతో ఆమెకు ఆపరేషన్ జరిపించి, శాశ్వతంగా కళారంగానికి వీడ్కోలు చెప్పేసి, గోపీచంద్ భార్యగా స్థిరపడిపోవాలనే నిర్ణయమే, నీరసంగా వున్న ఆమె శరీరానికి పిడికెడు కొత్త శక్తిని ప్రసాదించింది.

తన వీధిలోకి అడుగుపెట్టింది.

ఆమెను చూడగానే, అంతవరకు వీధిలో వుండి ఏవేవో పనులు చేస్కునేవాళ్ళు ఆ పనులు వదిలేసి ఆమెనే వింతగా చూడసాగేరు. వాళ్ళంతా ఎందుకిలా చూస్తున్నారు? తను జెయిలు కెళ్ళిన విషయం వీళ్ళందరకీ తెలిసిపోయిందా? యింటిముందుకొచ్చింది! యింటికి తాళం కప్ప వ్రేళ్లాడుతోంది! ఆమె గుండెలో భయం రెపరెపలాడింది. పొరుగింటి వరలక్ష్మితోపాటు మరి కొంతమంది ఆమెను సమీపించేరు! కిరణ్మయికి వాళ్ళందరిముఖాలు చూస్తూనే ఏదో విషయం అర్థమయింది. ఆమె ప్రశ్నించకుండా, ఆమె వెయ్యబోయే ప్రశ్నలకి వారి మాటలే, సమాధానం చెప్పేయి. అందరికంటే ఎక్కువగా వరలక్ష్మే చెప్పింది.

“నువ్వోగంటలో వస్తానన్నదానివి, వారం తర్వాత యిప్పుడొచ్చేవు. ఆ రాత్రంతా మీ అమ్మ ఆయాసంతో నానా యాతన అనుభవించి, మర్నాడు తెల్లారుఝామున జీవనాలొగ్గేసింది. ఏనాటి ఋణానుబంధమో, నేనే

మీ అమ్మ నోట్లోయిన్ని తులసినీళ్ళు ఏసేను... నీకోసం మన వీధిలో నలుగురైదుగురు మగోళ్ళు అన్ని స్టూడియోలకీ ఎళ్లి ఎతికేరు! కానీ, నువ్వెక్కడా లేవట! అలాంటప్పుడు నీకోసం ఎక్కడని వెదకడం? ఎన్నాళ్ళని వెదకడం? వీధిలో శవం వుంటుండగా ఎవరికి మాత్రం వంటలు చేసుకోబుద్ధవుద్ది? నువ్వు ఎప్పుడొస్తావో తెలీదు, అసలు వస్తావో రావో తెలీదు. శవాన్ని వీధిలో ఎన్నిరోజులని వుంచడం? చివరకి అందరం ఆలోచించి అనాధాశ్రమానికి కబురు చేసాం. వాళ్లే బండి తీసుకొచ్చి శ్మశానంలో మిగతా తంతు అంతా జరిపించేశారు. మేం గూడా శ్మశానందాకా ఎళ్లేమనుకో... తల్లీ, ఎక్కడ పుట్టేవో, ఎలా బతికేవో, ఓ కూతురుండి కూడా చివరికి అనాధపిల్లల చేతులమీద యింత బుగ్గయిపోతున్నావటమ్మా... అంటూ నాకు మా చెడ్డ ఏడుపొచ్చేసిందనుకో"

వరలక్ష్మి, యితరులు యింకా చెప్తూనే వున్నారు. కిరణ్మయి మెదళ్లో రెండేరెండు విషయాలు మెదుల్తున్నాయి. తన తండ్రి తనకి తెలియకుండానే యీ లోకం నించి వెళ్ళిపోయేడు! తన తల్లి... తెల్సితెల్సి... తనతో కలిసి వుంటూనే, అనాధలచేతులమీదుగా బూడిదైపోయింది!

"అయినా యిన్ని రోజులూ ఎక్కడికెళ్లిపోయేవు పిల్లా? "

"వయసులో వున్న ఆడదిలా వారాల తరబడి, అడ్రస్‌లేకుండా వెళ్లిపోయిందంటే ఏమనుకోవాలి"

ఇలా తలా ఓ కామెంట్ చేస్తున్నవారందర్నీ వరలక్ష్మి కంట్రోల్‌చేసింది. "నిన్ననే మీ ఇంటి ఓనరొచ్చి నీ సామాన్లన్నీ బయట పారేసి తలుపు తాళం వేసుకెళ్లిపోయాడు. ఆ సామాన్లన్నీ మా యింట్లో దాచాన్లే" అంటూ వరలక్ష్మి కిరణ్మయిని తన యింటికి తీసుకువెళ్ళింది.

★ ★ ★

కిరణ్మయి యాంత్రికంగానే స్నానం చేసింది. వరలక్ష్మి పెట్టిన అన్నాన్ని యాంత్రికంగానే రెండు ముద్దలు తినేసింది.

"ఈ వారం రోజులూ ఏమైపోయేవు? " అని వరలక్ష్మి ప్రశ్నించిందిగాని దానికి సమాధానంగా కిరణ్మయి భావరహితంగా చూసిన చూపు మళ్లీ ఆమెచేత ఆ ప్రశ్న వేయించలేదు.

"ఇప్పుణ్ణువ్వేం చేస్తావు? "

ఈ ప్రశ్నకి మాత్రం జవాబు చెప్పింది.

"మా వైజాగ్ వెళ్లిపోతాను" అంది కిరణ్మయి. ఆమె ఇంకా ఏదో అనబోతుండగా, వరలక్ష్మి ఏదో ముఖ్యమైన విషయం మర్చిపోయినట్టుగా-

"అన్నట్టు వైజాగ్ అంటే జ్ఞాపకానికొచ్చింది. ఎవరో గోపీచందట. ఎర్రగా, ఎత్తుగా వున్నాడు. అతను మీ అమ్మపోయిన రెండోరోజో, మూడోరోజో వచ్చి నీకో కవరు ఇవ్వమని చెప్పి వెళ్లిపోయాడు" అంటూ డ్రాయరులోంచి ఓ కవరుతీసి అందించింది. ఆ కవరు విప్పేముందు కిరణ్మయి వేళ్లు ఒణికాయి. అయినా తమాయించుకుని కవరు విప్పి ఉత్తరం చదివింది.

"కిరణ్మయిగారికి! కళాభివందనాలు! చల్లగా వుండే నిప్పు, తియ్యగా వుండే వుప్పు ఈ లోకంలో వుండవని మా పెదనాన్నగారనేవారు. ఆడది నటిగా ఓసారి ముఖానికి ఎర్రరంగు పులుముకున్నాక, ఆమె మనసుకి ఆటోమేటిగ్గా నల్లరంగు అలుముకుంటుందని, ఆ నలుపురంగు వెనక నైతికధర్మం అనేది బతకలేక చచ్చిపోతుందని మా ఫ్రెండు కె.వి. రావు అంటుంటే, అది అందరి విషయాల్లోనూ నిజంకాదని నేను ఎన్నోసార్లు వాదించేను. వాదించిన ప్రతీసారీ నీ పేరే ఉదహరించేవాణ్ణి. మా బంధువులు నాకు ఎన్ని సంబంధాలు చూసినా, నేను నిన్నే నిన్నే కోరుకున్నానంటే,




నీమీద నాకెంత నమ్మకమో ఆలోచించు... కానీ ఈ ఉత్తరం రాయడానికోగంటముందు నేనీవూరొచ్చి మా బంధువయిన పబ్లిక్ ప్రాసిక్యూటర్ వెంకటేశ్వరరావు ఇంటికి వెళ్లడం జరిగింది. అక్కడెందుకో, నా పెళ్లి ప్రస్తావన వస్తే, నేను నీ గురించి చెప్పి, నా పర్సులో పదిలంగా దాచుకున్న నీ ఫొటో కూడా చూపించాను. అప్పుడు అతనే చెప్పాడు. నువ్వు బ్రోతల్ గా పట్టుబడి జైలు కెళ్లేవని... అంటే నా వాదన, నా నమ్మకం, నా ఆరాధన... అన్నీ అబద్ధమయిపోయి-మా పెదనాన్న చెప్పిన చల్లటి నిప్పు, తియ్యగా వుండే ఉప్పు ఈ లోకంలో పుట్ట వనే మాటే నిజమని నమ్మక తప్పిందికాదు. మా ఫ్రెండు చెప్పినట్టు నైతికవిలువలు కాపాడుకునే నటి ఈ ప్రపంచంలో వుండ దనే మాటనే నువ్వూ నిరూపించేవు. ఎందు కిలా జరిగిందని అడిగే హక్కు నాకు లేదు. జవాబు తెల్సుకుని నీమీద జాలిపడే అవకా శమూ లేదు. ఎందుకంటే... మా మావయ్య కూతుర్ని పెళ్లి చేస్కోడానికి నేను అంగీకరించాను..."

ఆ ఉత్తరంలో ఇంకా మూడు నాలుగు వాక్యాలున్నా, కిరణ్మయి వాటిని చదవ కుండా ఉత్తరాన్ని మడిచేసింది.

ఆమెకు ఏడుపు రాలేదు. నవ్వు రాలేదు.

"నేను వైజాగ్ వెళ్లాక మనియార్డరు చేస్తాను. ఓ అయిదు వందలువుంటే ఇస్తావా?" అడిగింది వరలక్ష్మిని.

ఆమెనే గమనిస్తున్న వరలక్ష్మి మౌనంగా అయిదువందలు అందించింది. ఆ డబ్బు తీసుకుని కిరణ్మయి స్టేషన్ కి బయలుదేరుతూ, వస్తున్న కన్నీటిని ఆపు కుంటూ, "అక్కా మా అమ్మ కన్నది, పెంచింది, నాతోపాటే వుంది... కానీ ఆవిడ అంత్యక్రియలు మాత్రం నువ్వు చేశావు. అనాథప్రేతాన్ని దహనంచేసే అదృష్టం నీకు దక్కింది. ఆఖరు ఘడియల్లో అమ్మ నోట్లో ఇన్ని నీళ్లుపోసే అదృష్టం నాకు దక్క లేదు..." అంది.

వరలక్ష్మి కిరణ్మయిని గాఢంగా కౌగలిం చుకుంది.



కిరణ్మయి గోదావరి ఎక్స్ప్రెస్ లో జన రల్ కంపార్ట్మెంట్ ఎక్కబోతుంటే-"పార్వతీ" అనే పిలుపు వినిపించి, ఆగి అటు వైపు చూసింది.

ఆమె... గూడూరు సత్యవతి.

ఆమె కూడా రంగస్థల నటీమణే! గూడూ రులో వుంటూ నాటకాలాడుతూ చాలా పరి షత్తుల్లో కలిసేది. తను వారంకిందటే సిని మావేషాల కోసం హైదరాబాదు మకాం మార్చేనని, తనకి తోడుగా వచ్చిన తల్లిని విజయవాడలో వున్న తన అక్క దగ్గరికి పంపిస్తూ ఆమెను బండెక్కించడానికొచ్చా నని చెప్పింది సత్యవతి.

"ఏం? " కిరణ్మయి నిర్లిప్తంగా అంది.

"మా అమ్మ మరీ ముసలిదైపోయింది. చాదస్తం కూడా ఎక్కువైపోయింది. మనం సినిమావేషాల కోసం వచ్చేంగదా. రకరకాల సినిమా మనుషులు వస్తుంటారు. ఎవరొ చ్చినా వాళ్లు వెళ్లేదాకా ఒకటే మూలుగులు, ఒకటే సణుగుడు. పైగా నేనుంటున్నది ఒక్కటే రూమ్. ప్రైవసీ లేదు. అలాగైతే మనబోటివారికి ఎలా కుదురుతుంది? " సత్యవతి చాలా బేకాతరుగా జవాబు

చెప్పింది.

కిరణ్మయి నిట్టూర్చిందే తప్ప సత్యవతి అభిప్రాయం గురించి కామెంట్ చెయ్యలేదు. సత్యవతి ఆశ్చర్యంగా అడిగింది-

"ఔనూ నువ్విక్కడ సెటిలైపోయేవని విన్నాను. నువ్విక్కడకొచ్చేవనే నేనూ ధైర్యంగా వచ్చేశాను. కానీ నువ్వు పెట్టే బేడా సర్దుకుని వెళ్లిపోతున్నట్టున్నావ్"

"ఔను"

"ఏం? "

"నేను నటిగా ఓడిపోయి పారిపోవడం లేదు. నా వ్యక్తిత్వాన్ని ఓడించాలని ప్రయత్నించే మనుషుల్ని ద్వేషిస్తూ వెళ్లిపోతున్నాను"

"నువ్వు చాలా ధైర్యవంతురాలివిగదా..."

"ఇప్పుడూ ధైర్యవంతురాలినే. ఓడిపోయి పారిపోవడంకన్నా నిలబడి పోరాడి విజయం సాధించడంలోనే గొప్పతనం వుందని నాకు తెలుసు. కానీ ఇక్కడ జరిగే పోరాటంలో ఎలా గెలుపొందాలో తెలిసింది. కానీ అటువంటి గెలుపు నా తత్వానికి సరిపడదనే వెళ్ళిపోతున్నాను"

"అంటే...? నాకు అర్థమయ్యేట్టు చెప్పు"

"నేను నటిని. నటనలో నాకు ఎదిరించి పోరాడ్డమే తప్ప దొంగదెబ్బలు తీసి గెలుపు సాధించడం నాకు చేతకాదు. నాకు అలాంటి గెలుపూ ఇష్టంలేదు"

"అందుకని మళ్ళీ విశాఖపట్నం వెళ్ళిపోతున్నావా?

"నా వూరు అదేకదా"

"అక్కడ మళ్ళీ నాటకాలు వేసుకుంటావా?

"నా కొచ్చిన విద్య అదేకదా?

"నువ్వు తొందరపడుతున్నావేమో!"

"లేదు. ఈ నిర్ణయం తీసుకోడానికి ఇప్పటికే ఆలస్యం చేశాను. నాటకరంగంలో అర్హతలున్న వాళ్లతో పోటీపడి గెల్చి అర్హాకలితో బతకడంలో నాకు ఆనందం వుంది. కానీ యిక్కడ అదృష్టవంతులతో పోటీపడే శక్తి నాకు లేదని తెల్సుకునే వెళ్లిపోతున్నాను"

"అది సరే... ఇక్కడేవో కష్టాలున్నాయని, తిరిగి నాటకాలు వెయ్యడానికి వెళ్లిపోతున్నావు. నాటకాలు వెయ్యడంలో మాత్రం కష్టాలు లేవా? "

"వున్నాయి. కానీ ఆ కష్టాలు, ఆ అవమానాలన్నీ అన్నంలోని రాళ్లు లాంటివి. కాస్త శ్రమపడి, ఆ రాళ్లని ఏరుకుని అన్నం తినొచ్చు కానీ ఇక్కడ బంగారుపళ్లెంలో అన్నం పెడతారు. కానీ ఆ అన్నంనిండా రాళ్లే. ఆ రాళ్ల మధ్యనించి అన్నం మెతుకులు ఏరుకుతినే ఓపిక నాకు లేదు. అన్నం ఎలాంటిదైనా అది బంగారుపళ్లెంలో పెట్టేరు కదాన్న వ్యామోహమూ నాకు లేదు? నేను నటిని. నన్ను సితారగా మార్చాలని పరిస్థితులు నన్నిక్కడకి తీసుకొచ్చేయి. కానీ ఇప్పుడు నా ఆశలన్నీ కాలిపోయి, తీగెలు తెగిన సితారగా మారిపోయినా, నటిగా నేను వెనకబడలేదు. వ్యక్తిగా నేను మలినపడలేదు. ఆ తృప్తి, ఆ ఆనందం, ఆ గర్వంతోనే తిరిగి నాటకరంగానికి వెళ్లిపోతున్నాను"

ట్రైను బయలుదేరుతున్నట్టుగా గంట మోగింది కిరణ్మయి కంపార్ట్‌మెంటు ఎక్కి నిలబడింది. "ఏమైనా నువ్వు వెళ్ళిపోవడం నాకు బాధగా వుందే" అంది సత్యవతి సిన్సియర్‌గా.

కిరణ్మయి శుష్కమందహాసం చేసింది. "బాధ ఎందుకే! నేను వెళ్లిపోతున్నాను. నువ్వు వచ్చావు. ఓ నటీమణి స్థానం భర్తీ అయిపోయిందిగా"

ట్రైన్ కదిలి ముందుకు సాగింది. అది జనరల్ బోగి. అందులో అందరూ జనరల్ ప్రయాణికులే వున్నారు. అయినా, ఆ జనరల్ మనుషుల మధ్య ఓ జనరల్ మనిషిగా కూర్చోడానికి కాస్తంత స్థలం సంపాదించింది.

ట్రైన్ ముందుకు సాగిపోతోంది. 




# చతుర కతలు

## రాయల్టీ

ఆంధ్రుల అభిమాన రచయిత్రి అలివేణి దీర్ఘాలోచనలో పడింది. కుప్పలు తెప్పలుగా తను రాసిన నవలల్ని చదివి ఆంధ్ర పాఠక లోకం వెర్రెత్తింది. తనూ డిమాండ్‌ను బట్టి సప్లయి అనే రీతిలో ఎడాపెడా రాసేసింది. ఇప్పుడు తన నవలల్ని ఎవరూ కొని చదవ డంలేదు.

యువతకు ప్రేమ టానిక్‌తో కథలు, నవ ల్లూ, మధ్యవయస్కులకు ఆర్థికంగా నిలదొ క్కుకోవటం ఎలా అనే పుస్తకాలు, వృద్ధులకు జ్ఞాన, సాంఖ్య, యోగాలమీద నవలికలు ఎన్నో రాసింది. ప్రస్తుత 'ట్రెండ్'ను బట్టి ఇద్దరు హీరోయిన్లు ఒక హీరో... దక్షిణ నాయకత్వం వెలగబెట్టే హీరోల కథలూ, ఇంటిలో రంభ... వీధిలో అప్సర బాపతు నవలలూ రాస్తోంది.

కాని ఈ కంప్యూటర్ యుగంలో టి.వి.కి ప్రాధాన్యత హెచ్చి... ప్రతివాడూ తనకు నచ్చిన 'ఛానల్' దగ్గర సెటిల్ అయ్యేసరికి 'అలివేణి' నవల్లు కొనే ముఖమే కరువ య్యింది.

స్కీంలు, పథకాలు, రెండు నవల్లు కొంటే ఒక లాటరీ టికెట్టు ఉచితంలాంటి ప్రకటన లు చేసినప్పటికీ మార్కెట్‌లో రిలీజయిన ప్రతి నవల సూపర్‌ఫ్లాప్ కావటంతో పబ్లి షర్స్ ముఖం చాటేశారు. పచ్చి శృంగారం రాసేవార్ని ప్రోత్సహించటం మొదలెట్టారు.

అయినా గుమ్మంలో కూచొని రోజూ పబ్లి షర్స్ కోసం ఎదురుచూస్తూండేది అలివేణి.

ఒకనాడు ఎండలో పడి ఒక పబ్లిషర్ వచ్చాడు. "మీ నవలల్ని మేం పబ్లిష్ చేస్తాం..." అన్నాడు. ఎడారిలో ఒయాసిస్సు కనబడినట్లయింది అలివేణికి. కాసేపు కుశల ప్రశ్నలయ్యాక... "రాయల్టీ ఎంత?" అడి గింది అలివేణి. కాసేపు సణిగిన తర్వాత ఆ పబ్లిషర్ చెప్పాడు.



"అమ్మా... నిజానికి నా వృత్తి బుక్స్ పబ్లిష్ చెయ్యడం కాదు. నాది 'అల్లోపతి' మందుల వ్యాపారం. మా పరిశీలనలో తే లిందేమిటంటే మీ పుస్తకాలు చదివిన వా రందరూ మా కంపెనీ వాంతుల నిరోధక మందులు వాడుతున్నారు. మా మందుల అమ్మకాలు గణనీయంగా పెరిగాయి. మీరు ఊ... అంటే మీ బుక్స్ ఉచితంగా ప్రింట్ చేయిస్తాం. పెరిగినమందుల అమ్మకాలలో కొంత రాయల్టీ... ఇస్తాం" అని పక్కకి తిరిగేసరికి... అలివేణి వెనక్కి విరుచుకు పడిపోయివుంది.

-డాక్టర్ కె. శివసుబ్బారావు

---

## అల్లుడి దర్జా

అల్లుడు రవికుమార్‌కి జి.కె. ఇండస్ట్రీస్‌లో ఉద్యోగం వేయించాడు సీతారామయ్య. జి.కె. ఇండస్ట్రీస్ మద్రాస్‌లో పెద్ద కంపెనీ. అందులో జాబ్ దొరికితే ఇక సెటిల్ అయిన ట్లే అని చాలామంది భావిస్తుంటారు. జాబ్ వేయించడంతోనే వూరుకోలేదు సీతారామ య్య. ఓ ఏడాది ఆగి తనకున్న పలుకుబడి నంతా ఉపయోగించి యం.డి. చుట్టూ తిరిగి అల్లుడికి ప్రమోషన్ కూడా ఇప్పించాడు. రవిఉమార్ పాండిచ్చేరి బ్రాంచికి మేనేజర్ అయ్యాడు. ఆదాయం పెరిగి, కంపెనీ వారి చ్చిన బంగళా, కారుతో అల్లుడి దర్జా చూసి ఆనందించాడు సీతారామయ్య. చుట్టపక్కా లతోనే గాక కనుపించిన ప్రతివారితోనూ అల్లుడి దర్జా గురించి బోర్ కొట్టసాగాడు.




ఆర్నెల్లు గడిచాయో లేదో కంపెనీ యం.డి. దగ్గరికి పరిగెత్తుకెళ్ళాడు సీతారామ య్య.

"ఏవండీ బాగున్నారా?" అని పలకరించా డు యం.డి., అల్లుడికి మళ్ళీ ఏం కావాలని వచ్చాడోనని లోలోపల జంకుగానే వుంది యం.డి.కి.

"ఏం బాగులెండి'' అన్నాడు నీరసంగా.

"ఏం జరిగింది? మీ ఆరోగ్యం బాగానే వుందిగదా?"

"నాకేం రాయిలాగా వున్నాను''

"మరింకేం?"

"అల్లుడి పరిస్థితే ఏం బాగాలేదు''

"అతనికేమైంది? ఎనీ ప్రాబ్లమ్?"

"కడుపు చించుకుంటే కాళ్లమీద పడు తుందని ఏం చెప్పమంటారు? దయచేసి మా

అల్లుడికి రివర్షన్ ఇప్పించి మళ్ళీ మద్రాస్‌లో పడేయాలి'' అన్నాడు సీతారామయ్య.

"వాట్! రివర్షన్ ఇవ్వాలా?" ఆశ్చర్యపోయాడు యం.డి.

తల వూపాడు సీతారామయ్య.

"అల్లుడి ప్రమోషన్ కోసం మినిష్టర్‌తో చెప్పించారు. వేకెన్సీ వచ్చేవరకూ తెగ తిరిగారు. ఇప్పుడు రివర్షన్ ఇవ్వమంటారేమిటి?" మతిపోయింది యం.డి.కి.

"అంతా తలరాత. కుక్కని సింహాసనం మీద కూర్చోబెట్టినట్లయింది''

"ఏం జరిగింది?"

"చిన్న ఉద్యోగంలో వుండేటప్పుడు బాగానే వుండేవాడు. మేనేజర్ అయ్యాక పూర్తిగా మారిపోయాడు. రోజూ క్లబ్బుకి వెళ్తున్నాడట. అక్కడ పేకాట ఆడుతున్నాడట. తాగి ఇంటికి వస్తున్నాడట. మా అమ్మాయి ఏడ్చి మొత్తుకుంటున్నది. నేనెన్ని విధాల చెప్పినా తన ప్రవర్తన మార్చుకోవడంలేదు. ఇప్పుడే ఇట్లా చెడిపోతే ముందు ముందు ఇంకెన్ని వ్యసనాల పాలవుతాడోనని భయంగా వుంది. అందుకే అతగాడికి రివర్షన్ ఇచ్చి వెనక్కి పిలిపించండి'' మొరపెట్టుకున్నాడు సీతారామయ్య.

"సారీ! సీతారామయ్యగారూ! మా కంపెనీకి చేయాల్సిన పని సరిగ్గా చేస్తున్నంత కాలం అతన్ని ఏం చెయ్యడానికీ వీల్లేదు. అందుకు మా కంపెనీ రూల్స్ ఒప్పుకోవు. అతను ఏదైనా ఫ్రాడ్ చేస్తేనో, డ్యూటీ సరిగ్గా చేయక పోతేనో అప్పుడు యాక్షన్ తీసుకుంటాం" కరుగ్గా అన్నాడు యం.డి.

"అంతేనంటారా?" బిక్కమొఖం పెట్టాడు సీతారామయ్య.

"అంతే. జీవితంలో ఎవరైనా స్వయంకృషితో పైకి వస్తే వారికి ఆ పదవి విలువ తెలుస్తుంది. ఎంత కష్టపడి పైకి వచ్చారో గుర్తుంటుంది. రికమండేషన్లతోను, నడమంత్రపు సిరితోను పైకొచ్చేవారు ఇంతే'' అన్నాడు యం.డి.

-సి.ఎస్.ఆర్. ప్రసాద్

## విజయరహస్యం

ఆడిటోరియం జనసందోహంతో కళకళలాడుతోంది. అందులో అధిక సంఖ్యాకులు కాలేజీ విద్యార్థినీవిద్యార్థులే. గతంలో ఎన్నడూ లేని విధంగా అత్యధికశాతం మార్కులతో యమ్మేలో యూనివర్సిటీలో ఫస్ట్‌రాంక్ సాధించిన పరమానందానికి సన్మానం జరగబోతోంది. సన్మానం చేయించుకోబోతున్న పరమానందం పరమానందంతో అందరితోనూ ఎంతో ఉత్సాహంగా కబుర్లు చెప్తున్నాడు. నిర్వాహకులు అన్ని ఏర్పాట్లూ పూర్తిచేశారు. పరమానందాన్ని సన్మానించబోయే ప్రముఖవ్యక్తి దీనబంధు, ప్రజాహిత వగైరా వగైరా బిరుదులెన్నో కలిగివున్న పట్టణ మున్సిపల్ ఛైర్మన్‌గారి రాకకోసం ఎదురుచూస్తున్నారు.

అంతలో ఆయన రానేవచ్చారు. సభాకార్యక్రమం ప్రారంభమయింది. సభానిర్వాహకులు ఒక్కొక్కర్నే వేదికమీదకి పిలిచారు. అధ్యక్షులవారు తమ ప్రారంభోపన్యాసంలో పరమానందాన్ని, అతని ప్రతిభను ఎంతగానో కొనియాడారు. ఆపై మరికొందరు వక్తలు తమ వాగ్ధాటిని ఆహూతులపై వర్షించారు. ఉపన్యాసాల అనంతరం సన్మాన కార్యక్రమం. నాదస్వర నాదాలమధ్య... వేదమంత్రోచ్చారణలు సాగుతుండగా మున్సిపల్ ఛైర్మన్‌గారు చందన తాంబూలాది సత్కారాలు చేసి దుశ్శాలువ కప్పి పరమానందాన్ని సన్మానించారు. ఎన్నెన్నో కెమేరాలు క్లిక్... క్లిక్‌మన్నాయి. వీడియో కెమేరాలు ప్రశాంతంగా తమపని తాము చేసుకుపోతున్నాయి.

సన్మాన కార్యక్రమం అయిన తర్వాత





పరమానందం అభిమానులు, పట్టణంలోని ప్రముఖ సంస్థలు, ప్రముఖవ్యక్తులు పరమానందాన్ని అభినందిస్తూ పూలమాలలతో ముంచెత్తారు. ఆపైన అధ్యక్షులవారు సన్మానగ్రహీతలైన పరమానందానికి తనకు జరిగిన సన్మాన మహోత్సవానికి కృతజ్ఞతలు తెలియచేసుకొనే అవకాశాన్నిచ్చారు.

నవ్వు ముఖంతో సన్మాన సింహాసనంపై నుండి లేచాడు పరమానందం. మెడలో ఉన్న పూలమాలల్ని తీసి పక్కనే ఉన్న టేబిల్‌మీద పెట్టాడు. తలపైనుండి రాలే అక్షింతలు, పూలరేకుల్ని దులుపుకుంటూ మైక్ ముందుకి వచ్చాడు. ఒకసారి ఆడిటోరియం అంతా కలయచూశాడు. అలాగే వేదికనలంకరించిన పెద్దలవంక చూశాడు. గాద్గదికమైన కంఠాన్ని సవరించుకొని సభామర్యాదననుసరించి ఆహూతులకు, వేదికపై ఆశీనులై వున్న ప్రముఖులకు ప్రణామాలు తెలియచేశాడు. ఆడిటోరియం జనవాహినితో నిండిపోయివున్నా, అంతా మౌనంగా వున్నారు. పరమానందం ఏం చెప్తాడా అని ఎదురు చూస్తున్నారు వాళ్ళంతా.

"నాకు తెలుసు, మీరంతా నా ఈ విజయ రహస్యం ఏమిటో తెల్సుకోవాలనే ఉత్సుకతతో ఉన్నారని. నేను సాధించిన ఈ ఘనవిజయం గురించి... అందులోనూ ఇంతవరకూ ఏ విద్యార్థీ సాధించనంత ఎక్కువ శాతం మార్కులతో గోల్డ్‌మెడల్ సాధించిన విజయం గురించి తల్చుకుంటుంటే ఆనంద భాష్పాలు ఆగనంటున్నాయి. ప్రతి విద్యార్థి విజయం వెనుకా అతని తల్లిదండ్రుల ప్రోత్సాహం ఉండవచ్చు. చదువు చెప్పే గురువుల ప్రోత్సాహం ఉండవచ్చు. కానీ నా పట్ల అవేవీ లేవు.

ప్రతి మగవాడి విజయం వెనుకా ఒక స్త్రీ హస్తం ఉంటుందంటారు. అది నాపట్ల నిజమని చెప్పకతప్పదు''

ఒక్కసారిగా ఆడిటోరియం అంతా గుసగుసలతో నిండిపోయింది. 'ఎవరా స్త్రీ? ఆవిడ ఎంత మేధావంతురాలో...' అనుకుంటున్నారు అందరూ.

"... ఆమె ఎవరో కాదు నా మేనమామ కూతురు. నా విజయానికి కారణం ఆమేనని సగర్వంగా చెప్తున్నాను. నేను పదవతరగతి చదువుతుండగా మా నాన్నగారు ఒక హెచ్చరిక చేశారు. అదేమిటంటే.. 'అబ్బాయ్ నువ్వెప్పుడు పరీక్ష తప్పితే అప్పుడు మెల్లకన్ను... ఎత్తుపళ్ళు, నల్లపిల్ల...నీ మేనమామ కూతుర్నిచ్చి పెళ్ళిచేస్తాను...' అని''.

-సూరిపండు





# ‘కాలిన కలలు’ పై సమీక్షలు

**జూన్ ‘చతుర’లో ప్రచురితమైన ద్వివేదుల సోమనాథశాస్త్రి రచన ‘కాలిన కలలు’పై మాకందిన ఉత్తమ సమీక్షలు.**

## అందరూ కారకులే

*(ప్రథమ బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)*

‘**కా**లిన కలలు’లో సుశీల భార్యా భర్తృ సంబంధాలలో భంగపాటు పొందటమేగాక మాతృత్వపు అనుబంధం కూడా భగ్నమవటంతో వైవాహిక జీవితం గురించి తాను కన్నకలలు కాలిపోగా పిచ్చిదై తిరిగి మానసిక స్వస్థత పొందటం మొదలైన కథావిషయాలు చర్విత చర్వణమే. అయినా కథనంలో చాతుర్యం, విలక్షణత ఉంటే నవల ప్రయోజనాన్ని పొందగలిగి ఉండేది. కుటుంబసభ్యులు పెట్టిన బాధల కారణంగా డిప్రెషన్ స్థితిలోకి వెళ్లిన పాత్రపై పాఠకుల సానుభూతికంటే కూడా ‘స్త్రీకి స్త్రీలే శత్రువులు’, అందుకే స్త్రీ కష్టపడుతుందనే భావన పాఠకుల మనసులో స్థిరపడాలనేది రచయిత సంకల్పంగా కనిపిస్తోంది. కుటుంబ

సంబంధాలలో స్త్రీ అలా డిప్రెషన్ స్థితికి చేరడానికి ప్రధాన కారకుల్ని, కారణాల్ని, సమగ్రంగా చిత్రీకరిస్తే ప్రయోజనం ఉండేది. సుశీల కష్టాలన్నింటికీ ఆమె అత్త, తోడికోడళ్ళ మనస్తత్వాలే కారణంగా చూపించాలనుకోవటం పాతపోకడే. మాలతిని అంతగా సాధించని అత్త సుశీలను మాత్రం ప్రతి విషయంలోనూ కష్టపెట్టగలిగిందంటే దానికి కారణం ఆమె భర్తే సుశీల అంటే ఏమాత్రం ప్రేమ లేకుండా, ఆమె మీద అధికారం చెలాయించే మాధవరావుకు తల్లిగా మాత్రమే ఆమె అత్తరికపు పెత్తనం సాగించింది. మాలతి కూడా పిల్లవాడిపై ప్రేమకంటే కూడా మాతృత్వంతో వారసుడిని అందించే బాధ్యతగా మాత్రమే కుటుంబంలోనూ సమాజంలోనూ తన జీవితానికొక భద్రత ఉంటుందనే తప్ప, సాటి స్త్రీ దుఃఖానికి కారకురాలవుతున్నానన్న విషయం గ్రహించలేకపోయింది. ఇలా అత్తా, తోడికోడలు సుశీలతో శత్రుపూరిత సంబంధాలలోకి ప్రవేశించటానికి కారణం పితృస్వామ్యపు ప్రభావమేనని రచయిత కాస్తంత చైతన్యంగల పద్మ పాత్రద్వారానైనా పాఠకుల్ని ఆలోచింపజేస్తే బాగుండేది. చదువుని, జ్ఞానాన్ని అందించని ఆమెతండ్రి కొండలరావు, కుటుంబసభ్యులు బాధపెడ్తున్నా పట్టించుకోని భోగప్రవృత్తిగల భర్త మాధవరావు సుశీల డిప్రెషన్‌కి ప్రధానకారకులు. సుశీలకు చదువు, పరిజ్ఞానం లేకపోబట్టే పరాయీకరణలో వైవాహిక జీవితం గురించి కలలు కన్నది. ఆ కలలు కాల్తున్నప్పుడు తగిన చైతన్యం తెచ్చుకోలేకపోయింది. రచయిత స్త్రీ పాత్రలను చైతన్యవంతంగా చిత్రంచటమేగాక, సుశీల డిప్రెషన్‌లోకి వెళ్ళటానికి పురుషపాత్రలు పత్యక్షంగా, పరోక్షంగా, మౌనంగానూ ఎలా కారకులు కాగలిగారనే స్పృహ పాఠకుల్లో కలిగేలా మరింత విలక్షణంగా వ్రాయగలిగితే నవల సాహిత్య విలువల్ని సంతరించుకొనేది.

-డా. జె. కనకదుర్గ
కొత్తగూడెం-507101

## బాధ్యత...!

**(ద్వితీయ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)**

ద్వివేదుల సోమనాథశాస్త్రిగారి కాలిన కలలు'లో సుశీల పాత్ర మనసంఘంలో స్త్రీ జీవితం ఎంత శోచనీయంగా వుందో తెలియజేస్తోంది. ఈ నవల చదువుతున్నంతసేపు సుశీల పాత్ర మనస్సును చాలా బాధపెట్టిందనే చెప్పాలి. ఆమె చుట్టూ వున్న మాధవరావు, కృష్ణారావు, కాశీపతి, కామాక్షి అందరూ ఆమెను శారీరకంగా, మానసికంగా హింసించినవాళ్ళే. మోహనరావు, పద్మ కాస్త మెరుగనిపించారు.

సాధారణంగా కలలు కల్లలేనంటారు. కాని వాటిని పూర్తిగా కాకున్నా, కొంతవరకైనా నిజం చేసుకొనేది మన చేతిలోనే వుందన్నది పద్మ పాత్ర ద్వారా రచయిత వెల్లడించినా అంత తృప్తికరంగాలేదు. వేరే వూరిలో కాపురం పెట్టక యీ వుమ్మడి కుటుంబంలోనే వుండివుంటే, సుశీలకు కాస్త ఆసరాగా వుండేదేమో. కళ్ళముందు జరిగే అన్యాయాలను ఖండించేదేమో! అలాకాక రచయిత ఆమెను వేరుకాపురం పెట్టించినందువల్ల, శోకరసం మోతాదుకంటే కాస్త ఎక్కువై మనస్సును చాలా బాధించింది. ఈ నవలలో వచ్చిన హింసాత్మక చర్యలు యువతరంపై ఎలాంటి ప్రభావం గలిగిస్తాయో కాస్త ఆలోచించాలి.

సుశీల కలలు కాలిపోయి వుండవచ్చు. కాని చదివే యువతరాల మనసు బాధపడి, బెంబేలెత్తిపోయి, జీవితమంటే ఒక భయం, ఏహ్యాభావం రాకుండా చూసుకోవడం ప్రతి రచయిత యొక్క బాధ్యత.

-సుముఖి రాఘవన్
మద్రాసు-600017




## కొత్తకోణం

*(మూడవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

**ఆ**ద్యంతమూ కరుణరసభరితంగా సాగి కంట నీరు తెప్పించింది 'కాలినకలలు'. కన్నబిడ్డకోసం అలమటించి, కడకు పిచ్చిదానిగా కూడా మారిన సుశీల పాత్రను రచయిత సహజంగా చిత్రించారు. అత్తగారింట్లో ఆడపిల్ల పడే కష్టాలు అనాదిగా చూస్తున్నవే అయినా సుశీల ఎదుర్కొన్న విపత్తును కొత్త కోణం నుండి చూపించటంలో రచయిత సఫలీకృతులయ్యారు. సుశీల చేతగానితనాన్ని నిస్సహాయతను ఆధారం చేసుకొని ఆమె తొలి చూలు బిడ్డనే నిర్దాక్షిణ్యంగా ఆమె నుండి వేరుచేయాలని చూసిన కామాక్షమ్మ మాలతిల క్రూరత్వాన్ని ఎవరైనా సరే ఖండించక మానరు. భర్త తిరుగుబోతో, తాగుబోతో కాకపోయినా, భార్యను తగు ప్రేమాదరాలతో చూడలేని వాడైతే ఆ భార్య బ్రతుకెంత హీనస్థితికి దిగజారుతుందో సుశీల పాత్రద్వారా చాటిచెప్పారు. సుశీలకు పూర్తి వ్యతిరేకం పద్మ పాత్ర. భర్త మోహన్ సంపూర్ణ సహకారంలో ఆమె ముళ్ళబాటల్ని కూడా పూలబాటగా మార్చుకోగలిగింది.

అటు పుట్టింటివారి నిరాదరణకు, అత్తింటివారి ఆరళ్లకు గురై జీవితాన్ని పిచ్చాసుపత్రి పాలు చేసుకొనే సుశీలలెందరో ఈ లోకంలో. భర్త తననంతగా నిరాదరిస్తున్నా, అతని పాదాలదగ్గర పడి ఉండవలసిన అవసరం లేదని ఎంతో కొంత చదువుకొని తన కాళ్ళ మీద తాను నిలబడాలని సుశీల తీసుకొన్న నిర్ణయం సముచితంగానే ఉంది. ఆ విషయంలో ఈ కాలం ఆడపిల్లల మనోభావాలకు ప్రతీకగా నిలిచింది సుశీల. ఒకవిధంగా సుశీల కష్టాలన్నిటికి కారణం ఆమె భర్త మాధవరావు అసమర్థతేనని చెప్పుకోవచ్చు. సుశీలను బిడ్డనుండి క్రూరంగా విడదీసి అన్యాయంగా ఆమెను పిచ్చాసుపత్రికి పంపించిన మాధవరావు తగిన శిక్ష అనుభవించాడు. కన్నబిడ్డను చేతులారా పరాయివాళ్ళకు అప్పగించిన మాధవరావు, సంతానం కలుగక అలమటించడం, సుశీలకు చేసిన ద్రోహానికి పశ్చాత్తాపపడడం నవలలో చక్కని మలుపులు. భార్యంటే మనసులేని మరబొమ్మ కాదని, మరికొందరు 'మాధవరావులు' ఈ నవలద్వారా గ్రహించగలిగితే ధన్యులు. ఏది ఏమైనా కడకు ఆమె కన్నబిడ్డ విజయకుమార్ సుశీలను కన్నతల్లిగా గుర్తించి, చేరువ కావడం చక్కని ముగింపు. మొత్తానికి సృష్టిలో తీయనిది మాతృత్వం అని మరీమరీ చాటి చెప్పిందీ నవల. కథను కొంచెం సాగదీసినట్లు కన్పించినా, ఒక మంచి నవలను, కొత్త కథను చదివామన్న తృప్తిని కలిగించింది.

-జి.వి. సునంద
గూడూరు -524101

## కాలుతున్న కలలు

*(నాలుగవ బహుమతి రూ.50/- పొందిన సమీక్ష)*

**"కా**లిన కలలు'' కథ నిజంగానే జరిగిందా అన్న భ్రాంతిని కలుగజేసింది. సుశీల పాత్రను చదువుతున్నంతసేపు మన కళ్లముందు ఒక అబల అనుభవించిన నరకయాతన కనిపిస్తుంది.

ఏమైనా అంతటి సహనం, ఔదార్యం ఈనాటి యువతలో ఉన్నాయంటే మనం నమ్మలేము. వెనుకటి తరంవారు అనుభవించి ఉండవచ్చుగానీ ఈ రోజులలో అసలు అటువంటి ఉమ్మడి కుటుంబాలు ఉండటమే అరుదు. అలాగే మాధవరావు వంటి హృదయం లేని భర్తలు ఈరోజులలో ఉండరనే చెప్పాలి. మోహనరావువైపు భర్తలే ఎక్కువగా కనిపిస్తారు. మోహన్‌రావు లాంటి పాత్ర



ను చేర్చి రచయిత మనకుబోర్‌లేకుండా చేశారు. అత్త కామాక్షమ్మ ఈరోజులలో కూడా అక్కడక్కడ తరచుగా కనిపించే అత్తే. ఎంతో ధైర్యంగా ఉన్న పద్మ పాత్ర సూపర్బ్‌గా ఉంది. కాని పద్మ పాత్రను నిండుగా నడిపించలేకపోయారు శాస్త్రిగారు. చివరకు ఈమె నిజం నిర్భయంగా చెప్పడం కొంచెం సంతృప్తినిచ్చింది. ఏమైనా కొందరు ఆడపిల్లల బతుకులిలా కాలడానికి వెనుకగల కారణాల గురించి అందరూ ఆలోచించాలి.

-మామిళ్ళపల్లి వెంకటేశ్వరరావు
హైదరాబాద్ -500055

## సహజ చిత్రీకరణ...

*(అయిదవ బహుమతి రూ.50/- పొందిన సమీక్ష)*

**అ**త్తవారింటి కొత్తకోడలు పడే బాధలు ఇందులో అతిసహజంగా చిత్రీకరించారు. అత్తారింట కాలుపెట్టే ప్రతీ ఆడపిల్ల సహజంగా వూహించుకునే ఆశలు, కలలు ఏవిధంగా కాలి బూడిదవుతున్నాయో తెలియజేసిందీనవల.

ఇంట్లో అందరూ పెద్దా, చిన్నా, ముసలీ, ముతకా తన చెప్పుచేతల్లోనే వుండాలనీ అధికారం, పెత్తనం, తనే చెలాయించాలనీ, తన మాటకు ఎవరూ ఎదురుచెప్పకూడదనే మనస్తత్వంగల ఆడవారు చాలామంది వున్నారు. అందులో కోడలు రాగానే ఆ భావాలన్నీ మరీ ఎక్కువగా విజృంభిస్తాయి. ఈ అవస్థ ప్రతీ ఉమ్మడి కుటుంబ వ్యవస్థలో వుంటుంది. ఈ నవలలో ఆ లక్షణాలన్నీ ఎక్కువగా కనపరుస్తూ తన భర్తను, తన కొడుకులను, కోడళ్ళను కీలుబొమ్మలుగా చేసి ఆడించే పాత్ర కామాక్షమ్మ కొన్నిచోట్ల పక్షపాతవైఖరి వహిస్తూ పెద్దకోడలిని వెనకేసుకొస్తూ చిన్నకోడలుని పూర్తిగా వదిలేసి కేవలం రెండోకోడలు సుశీలను మాత్రమే హింసలు పెట్టేది. ఆవిధంగా ఈ నవలలో కొంత అసహజత్వం చోటుచేసుకొన్నది.

ఇక ఈ నవల ప్రత్యేకంగా సుశీలకోసం మాత్రమే వ్రాయబడిందా అన్నట్లుగా వున్నది. ఏమాత్రం కోరికలు, కలలు, ఆశలు లేకుండా తన భర్త తనను ఆదరణగా చూసుకుంటే చాలు అనుకొంటూ అత్తారింట కాలు పెట్టిన సుశీల అత్తగారి బాధలు, భర్తనిరాదరణ, తోడికోడలి సాధింపులు ఇట్లాంటివాటితో బాధ పడేసమయంలో మండువేసవిలో చల్లని నీడలా ఆమెకి బాబు పుట్టడంతో అన్నీ మరిచి ఆనందం పొందే క్షణాన వాడ్ని బలవంతంగా లాక్కొని పెద్దకోడలికి ఇవ్వటం, ఎట్లాగైనా తన బిడ్డను తన హృదయానికి హత్తుకోవాలనే తాపత్రయంలో తను చేసిన రెండు ప్రయత్నాలు బెడిసికొట్టటం, పిచ్చిదానిలా ఆస్పత్రి పాలవటం, తండ్రి పంచన చేరటం మొదలైనవన్నీ కడుదయనీయ సన్నివేశాలు.

కానీ పద్దవాడెప్పుడూ చెడ్డవాడు కాదు అన్నట్లుగా ఎన్ని కష్టాలు పడినా చివరికి తన కొడుకు తన భర్తను తీసుకొని తల్లి దగ్గరకు రావటం, సుశీల, భర్త కొడుకు కలుసుకోవటం అనేదే ఈ నవలలోని నిజమైన కొసమెరుపు...

ఇంత మంచి నవల అందించినందుకు 'చతుర' వారికి, రచయితకు మరొక్కసారి కృతజ్ఞతలు.

-తెన్నేటి లక్ష్మీనరసింహమూర్తి
సిరిగిందలపాడు - 533288

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 229428. Office Address: CHATURA Telugu Monthly Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad 318181, 399444; Madras 470434; Vijayawada 476685; Visakhapatnam 52211; Tirupati 5291; Anantpur 22977; Rajahmundry 71390; Karimnagar 83216; Suryapet 20538; Guntur 353942.



మహంతేష్ సి. మొరాబాద్

CHATURA Telugu Monthly Hyderabad – 500 482 Regd. No. H/HD/402

# ఇలా చదవండిది, అలా తెలుసుకుంటారిక ఇకనుంచీ నీలిమందుని ఎందుకసలు వాడనేవాడరో అనే సంగతినిక !



సాధారణ 'బ్లూ' నీటిలో గడ్డలు కట్టడంతో మీ బట్టల పైన మడ్డి నీలి మరకలు పడుతాయి.



వైజ్ఞానికంగా రూపొందించిన, శక్తివంతమైన మైక్రో డిస్పర్షన్ ఫార్ములేషన్ కలిగిన 'ఉజాలా' నీటిలో అంతటా సమంగా కరిగిపోయి, మీ బట్టలకు ఇస్తుంది మిరుమిట్లు గొలిపే తెల్లదనం.

## కొత్త ఉజాలా ఫేబ్రిక్ వైట్‌నర్.
## మీ బట్టలకి మిరుమిట్లుగొలిపే తెల్లదనాన్నితెచ్చే మెచ్చలేని మంచి ఉపాయం.

నీలిమందు మీ బట్టలపైన చారల మరకల మచ్చల అవశేషాల్ని వదిలిపెడుతుంది, అయినా అతి పురాతనమైన ఆ నీలిమందును కలకాలంగా వాడుతూనేవున్నారు జనం – కారణం, దానికి బదులుగా మరొకటి లేకపోవడం. అది పాతమాట, వచ్చేసింది యిప్పుడిక ఉజాలా – బట్టలకు తెల్లని తెలుపునిచ్చే శాస్త్రీయమైన ఫేబ్రిక్ వైట్‌నర్. దాన్లోగల పదార్థాలతో, శాస్త్రీయమైన ప్రక్రియతో అబ్బింది దానికి ఆ లక్షణం.

__వి+ గల వైట్‌నర్ ఉజాలా__

అసలు వి+ ఎందుకని? ఏంచేస్తుంది మీ బట్టలకి యిది? మరి గమనించారా యిది – బట్టలని డిటర్జంట్‌తో ఉతికిన ప్రతిసారీ వాటి కళని పోగొట్టుకుంటాయి. నిజానికి డిటర్జంట్లు, మాసిన బట్టలలోని మురికిని మాత్రమే తీసివెయ్యగలవు కాని ఆ ప్రక్రియతో బట్టలు పాతైపోయినట్లు కనిపిస్తాయిక. మరి నీలిమందు, నీటిలో మడ్డి పదార్థాలను వదలటంతో అవి మీ బట్టలపైన చారల మరకల్ని వేస్తాయి. ఇక ఉజాలాలోగల 'మైక్రో డిస్పర్షన్ కేటలిస్ట్ వి+' నీటిలో సరిసమానంగా కరిగిపోయి, బట్టల పోగుపోగులోకి తక్షణమే చొచ్చుకు పోయి, వాటికి మిరుమిట్లుగొలిపే తెల్లదనాన్నిచ్చే ఒకేఒక వైట్‌నర్. అదే వి+ ప్రత్యేకత.

__మిరుమిట్లుగొలిపే తెల్లదనం – చూడండి ప్రత్యక్షంగా మీకు మీరే__

మరొక పనికొచ్చే కిటుకు – ఉజాలా, కేంద్రీకృతమైన గాఢతగల ద్రవం కావడంవలన, కొద్దిచుక్కలు వేస్తే చాలు యిది. పొదుపే పొదుపు. ఆ మిరుమిట్లుగొలిపే తెల్లదనపు అత్యుత్తమ ఫలితాలకోసం, పక్కన సూచించిన పద్ధతుల్ని అనుసరించండి. అనుభవంలోకి వస్తుంది మీకే.

ఇక చారల మచ్చలుపడే నీలిమందును ఎందుకు వాడాలి, పట్టుక్కూర్చో వాలిగనక? ఉండిగదా తెల్లదనాన్నిచ్చే కిటుకు ఉజాలా, వుండిగదా అందుబాటులో?

## నీలిమందుకన్న ఎంతో మరెంతో మెరుగు

**ఉజాలాని సరిగ్గా వాడటానికి అంచెలు అంచెలుగాగల పదతి**

1. ఉజాలా బాటిల్ లోపలి మూతకి సన్నని చిల్లు పొడవండి.
2. మీకు కావలసినదల్లా ఒక లీటరు నీటికి 4–6 చుక్కలు.
3. ఉతికిన బట్టల్ని నీటిలో ముంచి వుంచండి.
4. బట్టల్ని మెల్లిగా జాడించండి కొద్ది క్షణాల సేపు. వాటిని ఆరనివ్వండి.

కేవలం 4 చుక్కలు చాలిక !




**UJALA**

జ్యోతీ లేబరేటరీస్, బొంబాయి వారి నుంచి.

Situations/JL/22/9